అను నన్నయపద్యమువలనఁ దెలియు చున్నది. ఇట్టి సాహితీమతభేదములు విమర్శలును వాఙ్మయము కేవలము శైశవము నందున్నప్పుడు కలుగనేరవు. అందుచే నన్నయనాఁటికే యాంధ్రకవిత్వము మిక్కిలి ప్రచారమునం దుండెననియుఁ దత్పూర్వపు టజ్ఞాత యుగము నిరాంధ్రయుగముగాదనియు నిశ్చితమగుచున్నది.

చారిత్రకాజ్ఞాతయుగము

మన యాంధ్రకవిత్వ చరిత్రమునందు వలెనే హిందూదేశపు రాజ్యాంగచరిత్రము నందుఁగూడ నొకయజ్ఞాతయుగము గానవచ్చుచున్నది. పారంపర్యములైన కథల రూపమునఁగాని లిఖితరూపమునఁగాని యెట్టి వర్ణనములునులేని యాయజ్ఞాతయుగమున చారిత్రకాంశములను గనిపెట్టుటకై ప్రతిభావంతులైన మన చరిత్రకారులు నేటికిని ప్రయత్నించుచున్నారు. ఈవిషయములో వారికిఁ దోడగుచున్న యాధారములు పురాతనపుఁ గట్టడములు మొదలగు శిల్పములు (Architecture)మాత్రమే. లిఖితరూపకములైన యాధారములు లేనప్పుడు దేశమునందలి ప్రజలంగూర్చియు వారి మతముంగూర్చియు రాజ్యాంగ ప్రసంగములం గూర్చియుఁ గొంతవఱకైనఁ దెలియఁగలుగుటకీ శిల్పకళలే మార్గదర్శకములు. అజ్ఞాతయుగమునందలి చారిత్రకాంశసంపాదనకై యీశిల్పకళ లెట్లు సాయపడుచున్నవో యీక్రింది విషయములవలన స్పష్టముకాఁగలదు.

Dr- Fergusson says " In the rails of Buddha Gaya and Bharant, we have a complete picture of Buddhism as it existed during tne great Mouryan dynasty. (B.C. 320-B.C.180) At sanchi and the western caves we have as complete a representation of the form it took from the 2nd century B.C to 3rd century A.D. At Amaravaty and the Gandhara monastaries we learn what modifications had been introduced between our era and the third century and from the Ajanta and the later caves we trace its historv down-ward through its period of decay till it faded away altogether.

During the first half of this thousand years we have no contemporary records expect those written in stone and during the latter we have no books to rely upon; but the architecture with its sculptures and paintings remain and bear the indelible impress of the thoughts, the feelings and the aspirations of those who executed them and 'supply us with a vast amount of exact knowledge on the subject which is not available by any other means now known to us.

*　*　*　*

బౌద్ధజైన చిహ్నములు

హిందూదేశమునందలి యితరభాగముల యందువలెనే మనయాంధ్రదేశము నందుఁ గూడ బౌద్ధ జైనచిహ్నములు విచ్చలవిడిగాఁ గానవచ్చుచున్నవి. బహుదూరస్థములైనవియే కాక, మన చుట్టుప్రక్కలనున్న, అమరావతి, పీఠికాపురము, బొజ్జనకొండ, రామతీర్థము మొదలగు పెక్కుస్థలములయం దిట్టి శిథిలాలయ చిహ్నములను నేటికిని మనము చూచుచున్నారము. అందు నమరావతి స్తూపమునందలి యొకచిన్న స్తంభముమీఁదఁ జెక్కఁబడిన కథయొక్క పటమీసంచికలో నీయఁబడినది. స్తంభమునకుఁబైని యొక

శాసనమును, దాని క్రింద మకరతోరణమును, దాని క్రింద కమలమును, దాని క్రింద కథయు, దాని క్రింద మరలఁ బద్మమును జెక్కఁబడి యున్నవి. క్రిందిభాగము కొంతపగిలిపోయినది. రెండుకమలముల మధ్యఁ గల కథ యెద్దియని మనము పరీక్షింపఁగా నందలి ప్రతిమల హావ భావాదికములవలన నీకథ గోచరించును."

"పై భాగమున నొకరాజు సింహాసనమున నాసీనుఁడై యున్నాడు. చారుడొకడు చేతు లుజోడించుకొని యేదియో వార్త చెప్పచు న్నాడు. అతని యెదుటిభాగమునందు సైని కులు కోటను సంరక్షణ సేయుచున్నట్టున్నారు. అంతకు క్రిందిభాగమున కోటద్వారమునుండి సైనికులు లోపలికి జొరబడుచున్నట్లున్నది. అందు నేనుఁగులు గుఱ్ఱములు పదాతులు గూడనున్నారు. క్రింద నొకఁడు శత్రుఁడు కాఁబోలును సాష్టాంగపడి శరణుజొచ్చినట్లు కానవచ్చుచున్నది. ఈవార్తయే పైని చారుఁడు రాజుతో చెప్పచుండెగాబోలు. స్తంభముయొక్క క్రిందిభాగము పగులక యున్నయెడల నీకథయొక్క తదుపరివృత్తాంతము మనకు తెలిసియుండును."

"ఇంకొకపటము జూడుడు. ఇదియు నమ రావతిలోనిదే. ఈబండపై భాగము కొంతపగిలి నది. ఆపగిలిపోయిన వృత్తమునందు ఒకబౌద్ధ బోధకుఁడు స్త్రీపు[illegible] బోధించు చున్నట్లును వా[illegible]రును భక్తిశ్రద్ధలతో వినుచున్నట్లును వారిపైని దేవగంధర్వులు పూజాద్రవ్యములను గొనివచ్చి యర్పించు లేనందున నీతఁడు బుద్ధుఁడో బోధిసత్త్వుఁడో మరియెవఁడో తెలిసికొనుటకు వీలులేకుండ నున్నది. పైవృత్తమునకును క్రిందికమలము నకును నడుమనున్నపటములు మూడుగళ్లుగా విభజింపబడియున్నవి. మొదటిగదిలో నొక రాజు సింహాసనముమీద గూర్చుండినట్లును, ఒకయువకుడు భూమిమీద నాసనమువేసి కూర్చుండినట్లును, ఒకవీరుడు తనకేమియో చూపి వీరావేశసంభాషణము గావించుచున్న ట్లును రాజు ఈసంభాషణము వినుచున్నట్లును జూపబడినది. రెండవగడిలో ఈసంభాషణము యొక్క ఫలము చూపబడినది. రాజొక యేనుఁగునెక్కి తొందరగా శత్రువులమీదికి బోవుచున్నాడు. అతనివెంట నిద్దరుస్త్రీలు మాత్రమున్నారు. శస్త్రములుకూడ లేవు. అతనివెంట సైన్యమువచ్చుచున్నది. ఆకాశ మునుండి దేవగంధర్వులు పుష్పమాలలు వేయుచున్నారు. మూడవగడిలో వాయువేగ మున బరుగిడుచున్న యశ్వములనెక్కి శత్రులు పారిపోవుచున్నట్లు చూపబడినది... ......................................"

మతయుద్ధములు

ఈ గుఱుతులన్నియు మనదేశ మొక ప్పుడు బౌద్ధజైన జనాక్రాంతమై యుండెనని చెప్పుట కవకాశము గలిగించుచున్నవి. ఆది నుండియు మనదేశస్థులకు మతమునందుఁ బ్రీతియుఁ బట్టుదలయు నెక్కువగదా? రాజ కీయయుద్ధములవలెనే మతముతో సంబంధిం చినయుద్ధములుఁగూడఁ బూర్వము మనదేశ

వైష్ణవమతములు విజిగీషతోఁ జెలరేఁగి యాంధ్రదేశమున నగ్రస్థానము వహించుటకై తమలోఁదాము నిరంతరమును గలహించుచుండెను. ఈమతయుద్ధములను దరుచుగా రాజులే నాయకులై నడపించుచుండెడివారు. దేశములో నొక్కొక్కకాలమున నొక్కొక్క మతము ప్రజలయొక్కయుఁ బ్రభువులయొక్కయుఁ బ్రోత్సాహమును వహించి యూన్నత్యమును బొందుచుండెను. ఈసందర్భమున జైనబౌద్ధమతముల నిర్మూలమును గూర్చి యాంధ్రులచరిత్ర మిట్లు చెప్పుచున్నది.

"బౌద్ధులకును జైనులకును ఘోరకలహము ప్రారంభమై మతచర్చ లతిభయంకరములయ్యెను. మహారాజగు విష్ణువర్ధనుఁడు వైష్ణవులపక్షమునఁ జేరినందున జైనులబల మడిగిపోయినది. రామానుజుఁడు జైనమతాచార్యులను వాదమున గెలిచెనఁట. వైష్ణవపక్షపాతియై విష్ణువర్ధనుఁడు 790 జైనదేవాలయములను నాశనముచేసి, యదివరకా దేవాలయముల పోషణార్థమై దానముచేసిన మడులు మాన్యములు నూడఁబెఱికికొని వైష్ణవదేవాలయముల కైంకర్యాదుల కొఱకును.................. వైష్ణవమత మవలంబింపని జైన మతాచార్యు లనేకులు గానుగలలోఁ బెట్టి చంపఁబడిరి. పద్మగిరిలోఁ దిరుగఁబడిన జైను లనేకులు పైరీతిగనే సంహరింపఁబడిరి. ఈ ఘోర ప్రళయమునకు భయపడి జైనమతావలంబకు లనేకులు తప్తముద్రధారణమును గైకొని వైష్ణవులయిరి. ఈవిషయములు స్థలపురాణములలోను వైష్ణవమత గ్రంథములలోను వ్రాయఁబడినవి..........."

ఆంధ్రదేశముతో సంబంధించిన యిట్టి మత విషయములును రాజ్యాంగాది సకలవిషయములునుగూడ శిల్పచిహ్నములే కాక యంతకంటె నెక్కుడుగ గ్రంథజాలము సైతము మనకుఁ దోడగుచుండుటచేతఁ బదునొకండవ శతాబ్దమునకుఁ బూర్వముకంటెఁ దరువాత మన కెక్కువగా స్పష్టమగుచున్నవి. పదుమూఁడవ శతాబ్దమున గణపతిదేవుని నాఁడుఁ గూడఁ బెక్కనసోమయాజి కారణమునఁ బలువురు జైనబౌద్ధులు సంహరింపఁబడిరని సోమదేవరాజీయాది గ్రంథములవలనఁ దెలియుచున్నది.

### జైనుల యాంధ్రకావ్యరచన

ఇట్లు బౌద్ధులంగూర్చియు జైనులంగూర్చియు ననేకసంగతులు గ్రంథజాలమువలనఁ దెలిసికొనుచు, వాని కుదాహరణములుగా జైనబౌద్ధశిల్ప చిహ్నములను బెక్కుస్థలములయందుఁ జూచుచున్నాము. రానురా నీరెండు మతములకును దేశమున నాశనము సంభవించుచువచ్చినను, గొన్నిశతాబ్దములు మాత్రము బౌద్ధులును జైనులును దమ మతప్రచారమునకై మనయాంధ్రులతో నేకీభవించి సర్వవిధముల వారితోఁ గలసిమెలసి సంచరించుచుండిరని పై నిదర్శనములే కాక యింకను బెక్కు చారిత్రకాంశములు చెప్పుచున్నవి. పెక్కు శతాబ్దములవఱకు నింతటి గాఢమైన సంబంధ మాంధ్రులతో వహించిన యీమతస్థులకు, ఆంధ్రులవాఙ్మయముతోఁ గూడ సంబంధ

ముండక తీరదు. అందుచే నియ్యుభయ మత బోధకులునుగూడఁ గన్నడాది భాషలయందు వలె నాంధ్రభాషయందును గొన్ని గ్రంథములు రచించియుండవలెను. ఇందుకు దృష్టాంతముగాఁ గంచిలో నొక జైన మతమునందుఁ దెనుఁగు జైన శతక మొకటి కలదని జైనగెజటు అధిపతులైన మ-రా-శ్రీ, సి.యస్. మల్లినాథుగారు చెప్పుచున్నారు.

ఆంధ్రవాఙ్మయమునందు బౌద్ధయుగము, జైనయుగము

ఈ బౌద్ధ జైన మతబోధకులు గావించిన యాంధ్ర గ్రంథరచన యేయుగమునందు విచ్చలవిడిగా జరిగియుండునో యూహించుటయు మన కవసరము. ఇది సుకరమేకాని దుష్కరముగాదు. ఆంధ్ర వాఙ్మయోద్ధారకులలో నగ్రగణ్యులైన రాజరాజు విమలాదిత్యునివలెఁగాక, బ్రాహ్మణ మత ప్రతిష్ఠాపకుండై జైన మతవిసర్జనముగావించుట జైనులకెల్ల గొప్ప ప్రోత్సాహ భంగమనుటలో సందియము లేదు. "యథారాజా తథా ప్రజా" యను న్యాయమునఁ బ్రభువుననుసరించి ప్రజలకును నమ్మతమునం దసహ్యాభావము పుట్టియుండకపోదు. కావునఁ బదునొకండవ శతాబ్దమునందే జైనమతపతనమునకై యాంధ్రదేశమున నశుభసూచకము లారంభించెనని చెప్పవచ్చును. ఇయ్యపశకునముల కనుకూలముగ, బండ్రెండవ శతాబ్దమునందు * విష్ణువర్ధనునిచే నొకమారును, పదుమూఁడవశతాబ్దమున గణపతిదేవునిచే నొకమారును లోకభయంకరములైన బౌద్ధజైన సంహారములు రెండు గావింపఁబడినవి. అందు గణపతిదేవుఁడీమతసంహారములో రాక్షసక్రౌర్యము వహించెనని చెప్పెదరు. మొత్తముపైఁ బదుమూఁడవశతాబ్దము రక్తసిక్త గాత్రములైన బౌద్ధజైనమతములకు సాయంకాలమని చెప్పక తప్పదు. ఈకారణములవలన 11-12-13 వ శతాబ్దములలో నీమతములు క్రమక్రమముగా నశించినవనియే చెప్పవలసియున్నది. కావున నన్నయకుఁబూర్వపు టజ్ఞాతయుగమునందే మనయాంధ్ర దేశమున బౌద్ధులును జైనులునుగూడ గొప్పయున్నతి వహించియుందురు. ఆయుగమునందే వారికి మిక్కిలి యాంధ్ర జనాదరణము కలిగియుండును. మత ప్రచారమునకై వారుగావించిన యాంధ్ర గ్రంథరచనయు నప్పుడే విచ్చలవిడిగా జరిగియుండును. ఈయజ్ఞాతయుగమునందే బౌద్ధయుగమనియు, 'జైనయుగ' మనియు మన యాంధ్ర వాఙ్మయముతో సంబంధించిన రెండు యుగము లుండియుండవలయును.

ఇంక 11 వ శతాబ్దము ప్రారంభముగాఁ గల వాఙ్మయము నంతటిని మనమెట్లు యుగవిభాగ మొనర్పవలయునో విచారింతము. భారతయుగము నాఁటి వాఙ్మయ స్థితికిని, ప్రస్తుతయుగము నందలి వాఙ్మయస్థితికిని గల తారతమ్యములను బరిశీలించిన యెడల నీ రెండింటికిని నడుమంగల యుగములలో నాంధ్ర కవిత్వ మెన్నియోవిధములైన మార్పులను

* క్రీ. శ. 1106 లో రాజ్యాధిపత్యము వహించిన గాంగవాడి దేశాధీశుఁ డగు విఠలదేవరాయని కీవిష్ణువర్ధనుఁ డనునది క్రొత్తపేరు.

జెందియుండవలయు నని స్ఫురింపఁగలదు. ప్రస్తుతయుగ మనఁగా 19 వ శతాబ్దమునుండియుఁ బ్రారంభమైన నవీనయుగమని నాయభిప్రాయము. ఈ నవయుగములోని వాఙ్మయము పూర్వయుగములలోని వాఙ్మయము నుండి పెక్కువిధముల భేదించుచున్నది. ఆభేద మొకటిరెంటిలో మాత్రమే కాదు. కావ్యరచనోద్దేశములు, కావ్యరచనావిమర్శలు, కావ్యరచనావిధానములు, కావ్యరచనాస్వాతంత్ర్యములు, కావ్యరచనాసంపాదిత వస్తుసామగ్రులు, (Materials) కావ్యకర్తల జీవనోపాధులు, కావ్యకర్తల సంరక్షకులు, కావ్యకర్తల పాండిత్యవిశేషములు, ఇట్లనేక విషయములయం దనేకవిధములైన మార్పులు గానవచ్చుచున్నవి.

### పూర్వయుగములలోని కవులు

పూర్వ యుగములలోని కవులెల్లరుఁ బ్రాయికముగా బ్రాహ్మణులే. కవియన నెట్టివాఁడో నిర్వచించిన యప్పకవి కవి కుండవలసిన యోగ్యతలలో బ్రాహ్మణత్వమే మొదటిదిగాఁ జెప్పినసంగతి మన మిదివఱకుఁ జర్చించితిమి. ఇదమిత్థమని నిశ్చయించుటకు వీలులేక యింకను సంశయాస్పదములైయున్న చేమకూర వేంకటకవ్యాదుల విషయము లటుండ, రంగనాథుఁడు, కాచవిభుఁడు, నన్నెచోడుఁడు, రాయలు, భట్టుమూర్తి, కంసాలి రుద్రయ్య, మొల్ల, కోటశివరామయ్య (పెదధూర్జటి శిష్యుఁడు), మల్లారెడ్డి, రామరాజు, రంగప్ప, మట్ల అనంతభూపాలుఁడు, బైచరాజు వేంకటనాథుఁడు, ముద్దుపళని మొదలగు బ్రాహ్మణేతరకవులు కొందఱు మాత్రమే పూర్వయుగములలో లెక్కకుఁ గానవచ్చుచున్నారు. ఈనవయుగమునఁ గవితావిద్య యొకరిసొమ్ముగాక వరణీయులగు సకలవర్ణములవారిచేతను నభ్యసింపఁబడుచున్నది. పూర్వయుగములో బ్రాహ్మణేతర కవిత్వమును బ్రాహ్మణులధిక్షేపించుచుండిరేమోయని యీక్రిందిపద్యమువలన నూహింపఁదగియున్నది.

క. "చీపర పాపర తీఁగలఁ
జేపలబు ట్టల్లినట్లు చెప్పిన నీయీ
కాపుఁగవిత్వపు మాటలు
బాపనకవివరుని చెవికిఁ బ్రమదంబిడునే?"

ఈనవయుగమున బ్రాహ్మణ కవిత్వము బ్రాహ్మణేతర కవిత్వమును సమానముగానే ప్రకాశించుచున్నవి. అమాత్య సేనానాయకాద్యున్నతోద్యోగములతోఁ గొంద ఱను గేవల కావ్యరచనోద్యోగముతోడనే కొందఱను బూర్వయుగములలోని కవులు సాధారణముగా రాజాస్థానములనే యంటియుండిరి. అట్టి యున్నతోద్యోగములు లేకపోవుటయే కాక కవితారచనచేఁ గవులు పోషింపఁబడుచుండిన యాస్థానములు ప్రస్తుతయుగమున లెక్కకు మిక్కిలి తక్కువ. వేములవాడ భీమకవి, శ్రీనాథుఁడు, అడిదము సూరకవి మొదలగు కవులయొక్క చరిత్రములవలనఁ బూర్వయుగములలోని కవులు కొందఱు శాపానుగ్రహసమర్థులనియు నాకారణమున రాజు లట్టి కవులయెడభయభక్తులుగలిగి వారినెల్లప్పుడును సత్కరించుచుండిరనియుఁ దెలియుచున్నది. కాని శాపానుగ్రహసమర్థతయొక్కటే కారణము గాదు. సాధారణముగఁ బూర్వపు

రాజులకుఁ గవితాభిమానము సహజగుణము. అందుచేఁ గవులెల్లరునుగూడ సాధారణముగా రాజులచేఁ బోషింపఁబడుచుండిరి.

### కవులు - దారిద్ర్యము

మఱియుఁ బూర్వయుగములలోని కవులు దరిద్రులనియు నందుచే నానారాజ సందర్శనము లాచరించుచు జీవించుచుండిరనియు వాడుక; కాని వాఙ్మయమున గణింపఁదగిన కవులలో నట్లు దేశాటనమువలన జీవించిన కవులు మిక్కిలి తక్కువయేమో యని చెప్పవలసి వచ్చుచున్నది. భీమకవి జీవితచరిత్రాంశములు మన కింకను తెలియవు. అవసానదశయందొకప్పుడు కొన్నికష్టములు సంభవించినట్లు తోఁచుచున్నను, శ్రీనాథునిజీవితముమాత్రము మొత్తముపై సుఖాస్పదమైనదే కాని దారిద్ర్యపీడితము గాదు. రెడ్డిరాజులచే నాతఁడు పోషింపఁబడిన విధమును రాజాస్థానములయం దాతఁడు చెప్పిన పద్యములను బట్టిచూడ, దేశాటన మొనర్చుటయందలి శ్రీనాథుని యభిప్రాయము దిగ్విజయమే కాని యుదరపోషణముగాదని స్ఫురింపఁగలదు. శ్రీనాథుని వలెనే యడిదము సూరకవి సైతమును దనజీవితములోఁ గొంతకాలమును నానారాజ సందర్శనములతోఁ గడపెను. సూరకవి విజయరామ గజపతీంద్రుని యాస్థానకవి. ఆతఁడు సందర్శించిన రాజులు బొబ్బిలిరంగారాయఁడు, పర్లాకిమిడి నారాయణదేవుఁడు మొదలగు వారు. వారిలోఁ గొందఱు విజయరామ గజపతికి శత్రువులు; కొందఱు మిత్రులు. అట్టి రాజుల నీతఁడు సందర్శించుటకుఁ గారణము తన ప్రభువుతో సంబంధించిన రాజకీయ వ్యవహారమేదైనఁ గావలసియుండును గాని కేవలము 'భిక్షాం దేహి' యని యాచించుట గాదని నాయూహ. అదియునుగాక సూరకవి కొంతభూవసతియుం గలవాఁడు. తన కనకాభిషేకమునాఁడు "స్నానముచేసిననీరు పానము సేయ" నని వేలకొలఁది బంగారునాణెములను బరిత్యజించిన మహోదారచిత్తుఁడు. ఆత్మగౌరవమునకై యొక్కొక్కప్పుడు తన ప్రభువునుసైతమును నిర్లక్ష్యభావమునఁ జూచుచుండువాఁడు. అట్టి సూరకవి వట్టిదరిద్రుఁడనియుఁ బొట్టకూటికొఱకే రాజుల సందర్శించుచుండెననియుఁ జెప్పుట న్యాయముగాదు.

### నవీనయుగకవులు - కావ్యరచన

ఇంక నీనవయుగములోని కవులన్నచో శాపానుగ్రహసమర్థులని చెప్పుటకు నిదర్శనములులేవు. కవితాభిమానులై, వచ్చినకవులను సత్కరించురాజులును మిక్కిలితక్కువ. అందుచేఁ గవులదేశాటనములు నానారాజసందర్శనము లీయుగమున నంతగాఁ గానరావు. కొందఱుకవులు స్వతంత్రకావ్యరచన యొనర్చినను బూర్వకవులు సాధారణముగాఁ బ్రభువులనుమెప్పించు కావ్యరచన గావించుచుండిరి. ప్రస్తుతకవులలోఁ బ్రజలను మెప్పించు కావ్యరచన గావింపవలసిన వారగుచున్నారు. ప్రభువు తనయాస్థానమున విద్వజ్జనముల మధ్య నొకానొక కావ్యమును సాంతముగా విని, తత్కృతిపతిత్వ మంగీకరించిన పిమ్మట నయ్యది సుప్రసిద్ధకావ్యముగా నెన్నఁబడుచుఁ గ్రమక్రమముగఁ బ్రచారములోనికి వచ్చు

చుండెను. కాని ముద్రణాది సాధనములు లేని యీకాలములో నెంతటిసుప్రసిద్ధగ్రంథమైనను బ్రస్తుతయుగమునందువలె సంతసూక్ష్మముగా దేశమున వ్యాపించుట కవకాశములు చాలకుండెను. భారతరామాయణాది మహాగ్రంథముల సైతము నెవరి ప్రతులను వారు వ్రాసికొనవలసినవా రగుచుండిరి. కాని మన కిప్పుడట్టి చిక్కులు లేవు. అట్టి చిక్కులే కాక యెట్టి చిక్కులును లేవు. ప్రభుమతము ననుసరించి యాతని మెప్పువడయు కావ్యరచన గావింపవలసిన నిబంధనమూ లేదు. రచించిన కావ్యము రంగారోహణమున విద్వజ్జనామోదమును బొందవలయు నగత్య మంతకన్నను లేదు. సాధారణముగఁ బ్రస్తుతకావ్యకర్తలు మంచిచేసికొని యాశ్రయింపవలసిన వా రిరువురుమాత్రమే: వ్రాసినగ్రంథమును నుచితముగాఁగాని తక్కువధరకుఁగాని యచ్చువేసి యిచ్చుట కొకముద్రాయంత్రాధికారి (Printer); ముద్రించినగ్రంథమును బఠనీయగ్రంథముగా నేర్పరచుట కొక పఠనీయగ్రంథనిర్ణయసభాసభ్యుఁడు (member of the text book committee) ప్రభుసమాదరణము లేని యీదినములలో నియ్యిరువురి సాహాయ్యముచేతనే కావ్యకర్తలు కాలక్షేపము చేయవలసినవా రగుచున్నారు. ఇట్లని యీనవయుగాంధ్రకావ్యకర్తలకుఁ గావ్యరచనమున విద్వజ్జనామోద మవసరములేదని నాయభిప్రాయము గాదు. ముద్రితగ్రంథములయందలి యుపోద్ఘాతములలో "మిత్రుల ప్రోత్సాహమువలన నీగ్రంథము నింతత్వరగా ముద్రింపవలసి వచ్చిన"దనియు, "కావున విద్వజ్జను లిందలి దోషము నెఱింగించినయెడ రెండవకూర్పునందు దిద్దుకొనెద" ననియు గ్రంథకర్తల విన్నపములు మనము తఱుచుగాఁ జూచుచుండుటచేత నట్లు భావించుటకు వీలులేదు.

మఱి యొకవిధముగా మనము పరిశీలించిన యెడఁ బూర్వయుగములలోని కవులకంటె నీ నవయుగాంధ్రకవులకుఁ గావ్యరచనయం దెక్కుడు నిరుత్సాహము, కష్టము, మానసికాందోళనము, భయము గలుగుచుండునని చెప్పవలసి వచ్చుచున్నది. సంస్కృతమునుండి యాంధ్రీకృతములుగాక శేషించినకావ్యములో, లేక తమప్రభువులు ప్రత్యేకముగాఁ దమకు రచింప నియోగించిన కావ్యములో, పురాణమనికాని, ప్రబంధమనికాని, ద్వ్యర్థికావ్యమనికాని పూర్వకవులు తమతమ యుగములనాఁటి రచనాసాంప్రదాయముల ననుసరించి నిశ్శంకగా రచించుచుండిరి. ఈనవయుగమునఁ గవులకావ్యరచన కట్టి రాజమార్గ మొకటి యేర్పడియుండలేదు. పూర్వసాంప్రదాయము పూర్తిగఁ బోకుండుటయు, నాంగ్లభాషా సహవాసంబున నూతనసాంప్రదాయ మొకటి బయలుదేరుటయుఁ దటస్థించుటచేత నీసాంప్రదాయద్వంద్వము రోగులను వైద్యద్వంద్వమువలెఁ గవులనెంతయు బాధించుచున్నది. అందుచే రచనోత్సాహముగల కవి, కావ్యనిర్మాణమునకుఁ గడంగుటకు ముందుగ నీరెండుసాంప్రదాయములలో నెద్దాని ననుసరింపవలయునో యని కొంత మానసికాందోళనము

నొందుచుండును. ఒకపురాణమూ, ప్రబంధమూ, లేక, నాటకమూ, ప్రహసనమూ, నవలయూ, ఎయ్యది రచించినయెడల నెక్కుడుగఁ బ్రజ లామోదింతురో, ఎట్టిరచన మెనర్చినఁ బఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడునో యని రాజాదరణములేక కేవలము ప్రజాదరణముపైనే బ్రదుకుచుండిన యీ నవయుగాంధ్రకవి వితర్కించుట యొక వింతగాదు.

### సామాన్యకవులు - వారికావ్యములు

ఇది యిట్లుండ నీనవలలు, నాటకములు, ప్రహసనములు, గావ్యములుగాఁ బరిగణింపఁబడునా యనియు వానిని రచించినవారును గవులనఁబడుదురాయనియుఁ గొందఱు పరిహసింతురు. గీర్వాణకవులెల్లరును గాళిదాసులుకారు. ఆంగ్లేయకవులెల్లరును షేక్స్పియరులుకారు. అట్లే యాంధ్రకవులెల్లరును నన్నపార్యులు కాఁజాలరు. ఏభాషయందలి కవిత్వచరిత్రమును మనము పరిశీలించినను సాధారణముగ నొక్కొక్క యుగమునం దొక్కొక్కమహాకవి కవులకెల్లరకును మార్గదర్శియై ప్రబలుచుండును. ఆయాయుగముల యందలి తదితర సామాన్యకవులను వారి కావ్యములను గవులనియుఁ గావ్యములనియు గణింపకున్నయెడల, నింక మహాకవులనియు మహాకావ్యములనియు నిర్ణయింపవలసిన యవసరమే యుండదు. అందుచే సామాన్యకవులును సామాన్యకావ్యములును మహాకవులకును మహాకావ్యములకును గీర్తిసాధనములగుకతన, మనకవిత్వ చరిత్రమునం దట్టికవులను గావ్యములను గూడఁ బ్రసంగించుట యవసరమని నావిన్నపము.



# * వర్షాగమము

వింజమూరి రంగాచార్యులు గారు, ఎం. ఏ., బి. యల్.

జలబిందువులతోడి జలధరంబుల గుంపు, పొగడఁగొందు మదపుటేనుఁగులు గాఁగ
ధళుధళుక్కను నింగిఁ దాటించు మెఱపులు, రమణీయమైన టెక్కెములు గాఁగ
అవనిఁ గ్రక్కదలెడు నశని ఘోషంబులు, తోరంపు విజయదుందుభులు గాఁగ
చెలువొందు తొలకరి చిఱుపాటచినుకులు, నాచార లాజ చయంబు గాఁగ
రమ్యకాంతులతో మహారాజువలెను, వచ్చెఁ బ్రియురాల! చూడు మిప్పట్టునందు
కామిజనముల పాలిటి నోముపంట, అతులరమ్యంబు నూత్నవర్షాగమంబు. ౧

గీ. నల్లకల్వల కాంతి నందముగఁ గొన్ని, కరము నున్నకాటుకవోలె మెఱసికొన్ని,
నిండుచూలాలి గుబ్బపాలిండ్ల మిసిమిఁ గొన్ని, యాకాశమెల్ల మొగుళ్లగములె!. ౨

* ఆంధ్రగబుతుసంహారమునుండి.

గీ. కొసరు చాతకపక్షుల కోర్కి పంట, లధికవర్షణములు మనోజ్ఞారవములు
తోయభారానతములైన తోయదములు, మింటఁ జరియించుచుండెడి మెల్లమెల్ల. ౩

చ. పిడుగుల మర్దలధ్వనులు పిక్కటిలన్ నలుదిక్కులందుఁ జరి
చలలను నారిగాఁ గలుగు శక్రధనుస్సున వర్షధారలన్
బలితపు టంపకోలలను బాగుగఁ గూర్చి వియోగి మండలిన్
గలఁచి యలంచు నియ్యెడలఁ గంధరముల్ ధృతిమంధరమ్ములై. ౪

చ. నలిగిన యవ్విదూరజము నాఁడెముఁ జూపెడి గడ్డిమొల్కలన్
దలమగు కందళీదళవితానపు రంగుల నింద్రగోపక
మ్ములను సితేతరాచ్ఛమణి భూషణ భూషితదేహవల్లియా
లలన వలెం జెలంగెడి నిలాతల మబ్దసమాగమంబునన్. ౫

ఆ. నెమిలిగమి మనోజ్ఞనిస్వనంబుల తోడ, మమతఁ జేయు చుంబనముల తోడ
పరవశంబులైన పరిరంభణములతోఁ, బురులు విప్పి యాడ మొదలుకొనియె. ౬

చ. పొలయు ప్రవాహవేగమున మ్రొగ్గతిలం బడఁ బార్శ్వవృక్షముల్
కలుష జలప్రపూరితములై రసముబ్బఁగ జాతవిభ్రమం
బులయి మహారయంబునను బోవుచు నుండు సముద్రగాములై
ఫలమునఁ గాంతుఁ జేరు నభిసారిక లట్లు నదీచయం బిటన్. ౭

తే. హరిణశాబంబు లించుక గొఱికి విడువ, మిలమిలల నాడు పచ్చిక మొలకలొప్పఁ
జివుళులను సౌరు గొలిపెడి చెట్లతండ, మమరు వైంధ్యవనములు చేతము హరించు. ౮

తే. ఉఱుములను మెఱుముల లేళ్లు కరము బెదరి, యింతలగు కన్నులను లోలదృష్టు లొప్ప
నిసుక నెలవు లవని నెల్ల యెడలఁ జెదరి, చూచువారల హృదయముల్ చూఱఁగొల్పు. ౯

తే. కాఱుగ్రమ్మిన ఘనఘనాఘనము లేచి, యంధకారమ్ము లెల్లెడ నలమికొనిన
మెఱయు మెఱుపులచే మార్గ మెఱిఁగికొనుచు, రేలఁ బ్రియులకై యభిసారి కాళి తిరుగు. ౧౦

ఆ. ఉఱుము నంబుదములు మెఱసెడి మెఱుపులు, తాళజాలనట్టి తమినిగూర్ప
తప్పుచేసియున్న ధవులను బిగికౌఁగి, లింత నోలలార్తు రింతు లిప్పుడు. ౧౧

తే. కనులఁ దొరఁగెడి కన్నీటికాల్వ పల్లవముల హసియించు బింబా[illegible]ములఁ దడుపఁ
బూఁతలును భూషణంబులుఁ బూలు మాని, ప్రోషితాంగనలు [illegible]చుందురు. ౧౨

తే. పురువులు రజంబు తృణములు బెరసి పొందు, రంబుగాఁ బాము వొ[illegible]
బెదరు కప్పల హృదయముల్ కుదుటఁబడగఁ, బోవు క్రొన్నీరు [illegible]. ౧౩

తే. రేకు లెడలిన తామర ప్రోక విడిని, జుమ్మనుచు మ్రోయు తుమ్మెద[illegible]
ఆడెడు నెమిళ్ల గమిపించి యంపుఁగనుల, వ్రాలుఁ జెంగల్వవిరులను భ్రాంతితోడ. ౧౪

చ. మదగజయూథ మయ్యెడ నమందనవాంబుద నిస్వనంబులన్
మద మడరం జెలంగి పలుమాఱును ఘీంకృతులం బొనర్చుచున్
బొదలు నవోత్పలప్రభల పొల్పును దెల్పఁగ పోలపాళిఁ దు
మ్మెదగమి మూఁగ దానజలమేదురతన్ గడు నింపునింపెడున్. ౧౫

తే. సానుల సితోత్పలాభాబ్ద చయము వ్రేల, నెల్లెడల వెల్లిగొని సెలయేళ్లుఁ బాఱ
నెమిలి తండంబు చెలరేఁగి నృత్య మాడఁ, బర్వతము లొప్పెఁ గన్నుల పండువుగమ. ౧౬

సీ. అతులకదంబసర్జార్జునకేతకీ, సాలశాఖికల నుయ్యాల లూఁగి
ఘుమ్ముఘుమ్మని తావిఁ గ్రుమ్మరింపఁగఁజాలు, కుసుమవాసన లెల్లఁ గొల్లలాడి

కాదంబినీ మాలికాశీకరాంబువుల్, తనువు సోఁకఁగ జల్లఁదనము గాంచి
శాలయు నుత్తరవాతపోతముల్ మెల్లఁగా, వీచు చుల్లము పల్లవింపఁజేయ,
పిఱుఁదు లంటెడు కురులతోఁ, దుఱుముపిరుల తావితో, సీధుగంధ వక్త్రముల తోడ,
బిగువుఁ బాలిండ్ల నటియించు పేర్లతోడ, వెలఁదు లుందురు పాంథు లువ్విళ్లు లూర. ౧౭

తే. ఇంద్రధనువులు చంచల లింపొనర్ప, తోయభారానతములైన తోయదములు
అమరు మొలనూళ్ల మణికుండలముల మెఱయు, రమణులును బాంథజనుల చేతము హరింత్రు. ౧౮

తే. కేసరములు కదంబముల్ గేదఁగులును, విరిసరులఁ గూర్చి శిరములఁ దుఱుముకొనుచు
కకుభసుమమంజరులు తమ కర్ణపాళిఁ, దొడవులుగ నిచ్చదీర నింతులు ధరింత్రు. ౧౯

తే. అగురు కలిపిన చందనం బలఁది మేన, పూవుఁదొడవుల తలకట్టు తావులీన
నబ్దఘోష విని గురుగృహంబు విడిచి, పడకటిలు చేరుచున్నారు పడఁతు లిపుడు. ౨౦

మ. జలభారానమితమ్ములై కువల యశ్యామంబులై యున్నతం
బులునై శక్రధనుర్విభూషితములై వ్యూహంబులై మందమం
దలసచ్ఛీతల వాయు చంచలములై నవ్యాబ్దముల్ మన్మథా
విలకాంతా హృదయాపహారు లగుచున్ వెల్గొందు నందమ్ముగన్. ౨౧

శా. పూవుల్ పూచి కదంబవృక్షములు సమ్మోదమ్ము నూచింపఁగా
ప్రావృణ్మారుత చాలితంబగు తరువ్రాతంబుచే నాడుచున్
దావుల్ క్రేవలఁ జల్లు గేదఁగుల చిర్నవ్వుల్ పిసాళింప నా
హా! వర్షర్తు వనాంతశోభ లివె సౌఖ్యానందమున్ జాలెడున్. ౨౨

తే. మాలతులతోడి పొగడల మాలఁ దుఱిమి, అడవి మొల్లమొగ్గల విచ్చి నట్టి కడిమి
పూలఁ గర్ణపూరంబులు పొసఁగఁజేసి, కాంతలకుఁ గాంతువలె వర్షకాలమొప్పు. ౨౩

చ. కులుకుమిటారి గబ్బి చనుగుబ్బల ముత్తెపుఁ బేరులొప్ప, నిం
పులు దులకింప [illegible] రహింపఁగా
లలితవళీవిభంగ [illegible]లు మధ్యము లంబు నేచనన్
[illegible]లఁ దనరఁ బొల్తురు పొల్తుక లియ్యెడన్ గడున్. ౨౪

[illegible] సంగతిఁ జల్లఁదనంబు దాల్చి, సం
[illegible]లగు భూరుహకాండములన్ గదల్చుచున్
మల్లడిగొన్న పుష్పొడి దుమారము తావులు కొల్లలాడి, నేఁ
డెల్లెడఁ బిల్ల గాడ్పు [illegible] హరించెడుఁ బ్రోషితచిత్తవృత్తముల్. ౨౫

ఉ. తోయ భరానతంబులుగఁ దూఁగుచునుండినవేళ నాశ్రయం
బై యలరెం గదా మనకు; నాతఁడు గ్రీష్మదవానలంబుచేఁ
గాయము మాడి తూల జలకం బిడ యుక్త మటంచునెంచి సౌ
ఖ్యాయత లీలఁ జాలఁ జెలువారెడి వింధ్యముపై నవాబ్దముల్. ౨౬

చ. అతుల గుణాభిరామము, సుమాంగుల చిత్తసరోజహారి, శ్రీ
ణిత తరువల్లికావళికి నెయ్యపుబంధువు, సర్వజంతు సం
తతికిని ప్రాణభూతము, నితాంత మనోహర ప్రావృడాగమం
బతులగరిమన్ హితంబులగు నాశయముల్ ఫలియింపఁజేయుతన్. ౨౭

---




## అక్కరలు

గిడుగు వెంకటసీతాపతి గారు

II

సూర్య:—క్రిందటిసారి మనమువిమర్శించిన దానినిబట్టి వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు నన్నయ మధ్యాక్కరలకు చెప్పిన లక్షణమందు అతివ్యాప్తి దోషము ఎట్లుదొర్లినదో స్పష్టమైనది. ఏపద్యము చూచినా అందులో అక్కరలకు వారుచెప్పిన గణములు వరుసగా కనబడుతూ ఉన్నవి. కనుక, వారు చెప్పిన లక్షణము అంగీకరించుటకు వీలులేదు. ఇకను తక్కిన విషయములు పరిశీలింతాము.

నేను:—అనంతుని ఛందోదర్పణమునకు నేనువ్రాసిన ఉపోద్ఘాతమందలి వాక్యములు కొన్ని వారు విమర్శించి ఆక్షేపించినారు. వాటికి నేను చెప్పే సమాధానము విందురుగాని. విజయనగరం మహారాజా కాలేజీ మ్యాగజీనులో 80 వ పుటయందు వారు నాఅభిప్రాయములను విమర్శిస్తూ వ్రాసిన వాక్యములను గుర్తుపెట్టినాను. ఇదుగో, చదవండి.

[illegible]:—చదువుతున్నాను; వినండి:—"నన్నయాక్కరలలో లాక్షణికులు చెప్పిన గణములసంఖ్య సరి పడునుగాని గణముల వరుస సరిపడదని వ్రాసి యున్నారు."

[illegible]:—ఆగండి. ఈవాక్యము నే నెక్కడా వ్రాయలేదు. తర్వాత చదవండి.

[illegible]:—"అట్లే యీ మధ్యాక్కరలోఁగూడా కవికి స్వాతంత్ర్య ముండె నేమో?"

[illegible]: ఆగండి 'అట్లే' అంటే ఏమో మీకర్థమైనదా? [illegible]లేదు. చూచినారా? ఇంత అసందర్భముగా నేను వ్రాసిఉందునా? నేనువ్రాసినదేదో సరిగా ఎత్తివ్రాయక నేనువ్రాయని వాక్యము వ్రాసినట్లుగా (") [illegible]గుర్తులు కూడా పెట్టిచూపించుటచేత ఇక్కడ అర్థము పొందినదికాదు. తర్వాతి వాక్యములు చదవండి.

సూర్య:—"నన్నయ పాటించిన యతిస్థలమునకుఁ బూర్వము రెండు ఇంద్రగణములు నొక సూర్యగణము మఱియొక యింద్రగణము ఉండవలెనని గదా అనుకొంటున్నాము. ఆసూర్యగణము మూఁడవచోటనే కాక మఱియొక స్థలమందైనా వుండవచ్చునని నన్నయయభిప్రాయమేమో చూడండి అనియు నిట్లు వ్రాసివారివద్దనున్న యొకానొక యచ్చుప్రతినుండి స్వమతోపయోగములగు కొన్ని యక్కరల చరణములను వెదకితీసి యుదాహరించినారు." మీరు అరసున్నలు శకటరేఫములు వాడినారే.

నేను:—నేను వ్రాసినవాక్యములు సరిగా ఎత్తివ్రాయక నేను పాటించని అరసున్నలు, శకటరేఫములు, ఆదేశములు ఉ[illegible]నాభావ కొంత సంస్కరించినా[illegible]ంచవలసిన విషయము [illegible]

గణమ[illegible]ందరూ చెప్పిన [illegible]కరించక పోలేదు. గణముల గురించిన్ని [illegible]లవయన గురించిన్ని లాక్షణికులందరూ చెప్పిన సామాన్యలక్షణమునకు, సరిపడిన చరణములు నన్నయ మధ్యాక్కరలలో అనేకముగాఉన్నవి. వాటిగురించి తగవే లేదు. ఆసామాన్యలక్షణమునకు లొంగని చరణముల గురించే, ఇప్పుడింతగా వాదప్రతివాదములు జరగవలసి వచ్చినది. పూర్వ లాక్షణిక మతమునకు విరుద్ధముగాఉన్న పాఠములు చాలా వ్రాతప్రతులలో కనబడుతూ ఉన్నప్పుడు, అవి నన్నయ భాషకు విరుద్ధముకావని మనకు తోచినయెడల వాటికి లక్షణాం

తరకల్పన చేయవలసి ఉంటుంది. కనుక, నేను చెప్పిన దేమంటే, మధ్యాక్కరలో పాదాదినుండవలసిన సూర్య గణము రెండవగణముగా నైనా నాలవగణముగా నైనా ఉండవచ్చునన్న వికల్పము కలదుగదా; అట్లే ఈమధ్యాక్కరలో కూడా కవికి స్వాతంత్ర్య ముండెనేమో. ఇదీ నేను వ్రాసినది. అయితే, ఇప్పుడు సీతారామస్వామి శాస్త్రిలవారు చూపించిన వాక్యములను బట్టి యథేష్టముగా ఉండవచ్చునని నేను చెప్పిన విశేషలక్షణమే సామాన్యలక్షణముగా నేను గ్రహించినట్లు చదివేవారికి అర్థమవుతున్నది.

నావద్దనున్న అచ్చుప్రతినుండి స్వమతోపయోగములగు కొన్నియక్కరల [illegible]ణములను వెదకి తీసి యుదాహరించినానని శాస్త్రిలవారు వ్రాసినారు! నేను చూచిననాలుగైదు వ్రాతప్రతులలోను, అచ్చుపడ్డ ప్రతులయందు కొన్నిటిలోను, [illegible] కనిపించుచుండుట చేత అవి నన్నయపాఠములే అయిఉండుననుట తప్పు కాదని నేను స్పష్టముగా వ్రాసిఉన్నానుగదా; శాస్త్రిలవారు ఈ వాక్యములు సరిగా చూడలేదో! చూచినా, నామాటలయందు విశ్వాసములేక నావద్దను తాటాకు ప్రతులు ఉండవని తలచినారో!

ఈ 80 వ పుటలోనే శాస్త్రిలవారుచేసిన ఆక్షేపణము మరియొక టున్నది. ఇంకా చదివివదానికి ఆవల నున్న పేరాలో గురుపెట్టి[illegible]

సూర్య:—[illegible]నుబట్టి సవరించు తలం[illegible] యూయులం [illegible]గడతప్పి సవరణము [illegible]రని నావమ్మ[illegible]ము అట్టివానినే [illegible] లక్షణాంతరకల్పనము చేయుచుండుట [illegible] నా యభిప్రాయము".

నేను:— ఆగండి; ఇందులో సాహసముచూపినవారు ఎవరో మీకే స్పష్టమవుతుంది. అచ్చుప్రతిలోనే కాక, నేను చూచిన నాలుగైదు వ్రాతప్రతులలోను కూడా ఆపాఠములు నాకు కనబడినవని నేను స్పష్టముగా వ్రాసిఉండగా, వీటిని తాము గ్రహించుటకు ఇష్టపడక, సీతారామస్వామిశాస్త్రిలవారు ఎట్లు ఊహించినారో చూచినారా? అప్పకవీయమునుబట్టి సవరించు తలంపుగలవారేయైన, ముద్రణకర్తలు అప్పకవీయమందలి లక్షణమునకు విరుద్ధముగా దిద్ది సవరించి ఉండరుగదా! అయితే, ఈపాఠము లెందుండి వచ్చినవి? వ్రాతప్రతులనుండి వచ్చినవే కావలెను. అవిదిద్దుటకు వీలు లేకపోవుటచేత వాటిని దిద్దకుండా ముద్రణకర్తలు అచ్చువేయించి ఉండవలెను; లేదా, దిద్దుటకు వీలు పడినా, అవి తాము గ్రహించిన లక్షణమునకు సరిగా ఉన్నదీ లేనిదీ చూచుకోకుండా ప్రమత్తులయి వ్రాతప్రతులలోని పాఠములు అచ్చువేయించి ఉండవలెను. ఏదెట్లయినా, ఆపాఠములు కొన్నివ్రాతప్రతులలో ఉన్నవి; నేను చూచినాను. అవి నన్నయ వాగ్వ్యవహారమునకు విరుద్ధముగా లేవని మనకు తోచినప్పుడు వాటిని సప్రమాణముగా గ్రహించి వాటికి లక్షణము కల్పించడమే సాహసమో, ఎవరూచెప్పని గణములు సూర్యేంద్రచంద్రగణములుగా గ్రహించి, ఏవచనమునకైనా సరిపడుతూఉన్న గణలక్షణము నన్నయ మధ్యాక్కర పాదములకు సరిపడినవని చెప్పడమే సాహసమో మీరే ఆలోచించి చెప్పండి. ఇకను, తర్వాతి వాక్యము చదవండి.

సూర్య:—"మఱియు వీరు స్వపక్షోపయోగ మనుకొన్న యూచరణము లితర తాళపత్రగ్రంథములలోను, వితర ముద్రణములలోను వీరుదహరించిన రీతినుండక యప్పకవీయాది ప్రసిద్ధలక్షణమునకే లొంగి యున్నవి."

నేను:—అటువంటి పాఠములు దొరికినయెడల నాకు చాలా సంతోషమే. పూర్వులు గ్రహించిన లక్షణమునకున్ను నన్నయ వాగ్వ్యవహారమునకున్ను అనుగుణమైన పాఠములు కనబడినప్పుడు ఇంక కావలసినదేమి? అప్పుడు నేను చెప్పిన విశేషలక్షణము పరిత్యజించవలసినదే; సీతారామస్వామి శాస్త్రిలవారుకూడా తాము అనవసరముగాను, నిరాధారముగాను తెచ్చిపెట్టిన గణలక్షణము విడిచిపెట్టవలసినదే. అప్పకవ్యాదిలాక్షణికులు చెప్పిన లక్షణమే సరియైనలక్షణమని అంగీకరించవలసినదే కదా! అయితే, మనదురదృష్టముచేత, పూర్వలాక్షణికులు

చెప్పినలక్షణమునకు అనుగుణముగా నన్నయమధ్యాక్కరల చరణములన్నిటికీ సరియైనపాఠములు వ్రాతప్రతులలోగాని అచ్చుప్రతులలోగాని నాకిదివరకు దొరకలేదు. ఇకను దానితర్వాత నేను గుర్తుపెట్టిన వాక్యము చదవండి.

సూర్య:—"అట్లు సవరించుటకును గొన్నియెడల వీలు పడనందున నవి తాము చూపిన లక్షణమునకుఁ గుదురలేదనికూడ నంగీకరించియున్నారు."

నేను:—రామ! రామ! నే నేదీ తీరికూర్చుండి సవరించలేదండీ. ఆపని శాస్త్రులవారేకాని నేను తలపెట్టుకోలేదండీ. నేనంగీకరించి ఇచ్చినపాఠములు వ్రాతప్రతులలో నాకు కనబడినవి. లాక్షణికులు చెప్పిన సామాన్యలక్షణమునకు గాని, నేను చెప్పిన విశేషలక్షణమునకుగాని సరిపడిన పాఠములు కనబడుతూ ఉండగా లక్షణ సమన్వయముకాని పాఠము లున్నవని నే నెట్లు అంగీకరించి ఉందును?

సూర్య:—"సంగరకులహానికరుఁ డయిధారుణీనాథ నీ సుతుఁడు" అని ఉన్నదిగదా; ఇది ఎట్లు మీరుచెప్పిన లక్షణమునకుగాని, సామాన్యలక్షణమునకుగాని లొంగిఉన్నది?

నేను:—దీనిగురించి ఛందోదర్పణో పోద్ఘాతమందు నేను వ్రాయకపోలేదు. 'కరుఁడై' అని కొన్నివ్రాతప్రతులలో ఉన్నది. అప్పుడు కన్నడ లక్షణమును అనుసరించి, అది సూర్యగణ మవుతుంది. నన్నయ కన్నడ లక్షణమును అనుకరించి ఉండుట అసంభవముకాదు. కనుక, ఈపాదమునకు ఈవిధముగా లక్షణముకుదురి ఉన్నదని వ్రాసినాను.

సూర్య:—అయితే, పాదాన కొక్కొక్క లక్షణము చెప్పినయెడల వ్యవస్థ ఏదీ?

నేను:—వేరువేరుగా విషయ విమర్శనము చేసినాము, గనుక, వివిధలక్షణములును నేను చెప్పినట్లు కనబడుతూఉన్నది.

సూర్య:—అయితే, మీరు చెప్పదలచినదంతా పొందుపరచి నన్నయ మధ్యాక్కరలకు మీరు నిరూపించిన లక్షణము స్పష్టముగా తెలియజేయండి.

నేను:—నన్నయమధ్యాక్కరలలో ప్రతిచరణమందున్ను రెండింద్రగణములు, ఒకసూర్యగణము రెండింద్రగణములు ఒకసూర్యగణము ఉంటవి. మూడవగణముగా ఉండవలసిన సూర్యగణము రెండవగణముగానైనా నాల్గవగణముగానైనా ఉండవచ్చును. సూర్యగణములు కన్నడమర్యాదననుసరించి హగణ నగణ సగణ గగములు. మధ్యాక్కరలలోవచ్చే ఇంద్రగణములామాత్రము తెలుగులాక్షణికులందరూ అంగీకరించిన నల, నగ, సల, భ, ర, తలే కాని మగణ సగములు కావు. (కన్నడదారి అక్కరలలో 6 మాత్రలుగల ఈమగణ, సగములు రావు). వడిస్థలము నాలుగు గణములయిన తర్వాత. ప్రాసనియమము వృత్తములందున్నట్లే.

ఈలక్షణమునకు సరిపడిఉన్న నన్నయ మధ్యాక్కరచరణములు వ్రాతప్రతులలో నాకు కనబడినవి. కనబడలేదని ఒక్కచరణము గురించి అయినా నేను వ్రాసి ఉండలేదు.

'పదుపరుఁ' పదుంద్రుకు పాఠాంతరముగా కొందరు ఇచ్చినారని వ్రాసినాను గాని, అది నేను దిద్ది సవరించినానని వ్రాయలేదు. అది కొన్నివ్రాత ప్రతులలో కూడా ఉన్నది. "పాళిమురే" అనేపాఠము కూడా కొన్నివ్రాతప్రతులలో ఉన్నదేకాని నేను దిద్ది సవరించిన పాఠము కాదు.

సూర్య:—"ప్రముఖ [illegible] అంగీకరించక పోవుటకు కారణ [illegible]

నేను:—ప్రబలమైన కారణములు ఉన్నవి. ఆగణమునకు తెలుగు [illegible] కన్నడ పద్యాలలోగాని ప్రవేశములేదు. ఇటువంటివే వగణ యగణములున్ను. వీటిలో లఘువుతర్వాత గురువు వచ్చుటచేత ఈగణములవడక విలోమముగా ఉంటుంది. దీనినిగురించి కిట్టెలు దొరగారువ్రాసినది చూడండి: "Observe that none of the feet under No. 273 (అనగా బ్రహ్మవిష్ణురుద్రగణ ప్రస్తారము) begins with an Iambus (14) such a foot being foreign to true Canarese mitras" (పుట 98 నాగవర్మ ఛందస్సు)

లక్ష్యములలో పాఠభేదములున్నప్పుడు, లక్ష ణము నిరూపించడము కష్టము, గనుక, నన్నయ వాగ్వ్యవహారమునకు విరుద్ధముగా లేవని మనకుతోచినపాఠములే ఎంచుకొనవలెను. సాధ్యమైనంతవరకు పూర్వ లాక్షణికమతమునకు అనుగుణముగా ఉండే సంభావ్య లక్షణము ఏది సరిపోవునో చూడవలెను.

సూర్య:—సంభావ్యలక్షణమేదో ఏలాగు తెలుసుకోగలము? పూర్వలాక్షణికులు మధ్యాక్కరకు చెప్పిన లక్షణమునకు భిన్నముగా రెండువిషయములు చెప్పినారు. అవి సంభావ్యములేనా?

నేను:—అక్కరలు కన్నడమువారివద్దనుండి మన తెలుగువారు తెచ్చిఉండ[illegible]జమైనప్పుడు, గణముల విషయములో సైతము, క[illegible]ణమును నన్నయ అనుకరించిఉండడము అసంభవము కాదుగదా? మహాక్కరలో మొదటనుండవలసిన సూర్యగణము రెండవ గణముగానైనా, నాల్గవగణముగానైనా ఉండుటకు అవకాశమున్నట్లే, మధ్యాక్కరలో కూడా మూడవ గణముగా ఉండవలసిన సూర్యగణము రెండవగణముగానో నాల్గవగణముగానో ఉండుటకు అవకాశముండడము అసంభవము కాదుగదా?

సూర్య:—అసంభవము కాదు. మీరు చెప్పిన లక్షణము సంభావ్యమైనదే. అయి[illegible]దలక్షణమును అనుసరించి సూర్య[illegible]ములు కూ కావ[illegible]సమన్వితములు కాని[illegible]?

నేను:—ఒ[illegible]పోవికర్తుడై ధారుణీ నాథ నీసుతుండు [illegible] మాత్రమే.

సూర్య:—ఈ ఒక్క [illegible]డలక్షణము తెచ్చిపెట్టవలెనా? "వసుధరువలపనికరుఁడు ధారుణీనాథనీసుతుఁడు" అనేపాఠము ఒకఅచ్చుప్రతిలో ఉన్నదట. ఈ పాఠము చక్కగా ఉన్న దే కదా?

నేను:—చక్కని పాఠమే. ఆనందముద్రణములో లేదు, గాని వావిళ్లవారి ముద్రణమందున్నది. వ్రాతప్రతులలో నాకిదివరకు కనబడలేదు; కనబడితే సంతోషింతును. లక్షణమునకు సరిపెట్టవలెనన్న ఉద్దేశముతో దిద్దినారనే నే నంగీకరించలేను. అందుచేతనే వ్రాతప్రతులు ఇంకా చాలా చూస్తేనేకాని ఇదమిత్థం అని చెప్పలేమన్నాను. యథాస్థితి తెలుసుకోగోరే వారు చేయవలసిన పని ఇదే కదా! అయితే శాస్త్రులవారు ఈవిషయము గురించి వ్రాసినది చూడండి. "'ఇదమిత్థమని చెప్పలేము' అని వ్రాసియున్నారు; కాన వారుచెప్పిన లక్షణము సరికాదని వేఱుగ చెప్ప నక్కరలేదు" ఇట్లు శాస్త్రులవారు వ్రాయడము న్యాయమేనా?

సూర్య:—బాగున్నది! శాస్త్రులవారే తమ వ్యాసమందు మొట్టమొదట పేరాలో రెండవవాక్యము "ప్రాచీన మధ్యాక్కరల లక్షణ మిదమిత్థమ్మని నిర్ణయించుటకు వలను పడకున్నది" అని వ్రాసినారు. కాన, వారు చేసిన సిద్ధాంతము సరికాదని మనమూ అనవచ్చును.

నేను:—దానికేమి; వారుచేసిన ఆక్షేపణములలో విచిత్రమైనదొకటి చూడండి. ముద్రణప్రమాదముల నాధారముగా తీసుకొని నేను వారినీ జయంతి రామయ్య పంతులుగారినీ నిరసించినానట! శాస్త్రులవారు ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రికలో "శాసనగృహీత గణములను బ్రస్తారమునం జూపెదను" అని వ్రాసి దానిక్రిందను ఇనగణములేవో ఇంద్రగణములేవో వరుసగా చూపించినారు. అందులో 'IUII' కనబడలేదు. ఈ విషయము నాఛందోదర్పణోపోద్ఘాతమందు నిట్లు వ్రాస్తిని (పుట అడుగున [illegible]) "వారి మతమున 'IUII' కూడా ఇంద్రగణములలో ఉండవలెను. పు. 88 లో ఉన్న ప్రస్తారపట్టికలో లేదు. వ్రాయ మరచినారో, అచ్చుతప్పో;" అని వ్రాసినాను. ఇందుకు శాస్త్రులవారికి కోపంవచ్చింది. "ముద్రణప్రమాదమున IUII అనునది పడనంతమాత్రమున "దానిని వ్రాయమరచిరో! అచ్చుతప్పో!" అని వికల్పించుట గూడఁ బ్రస్తారము నెఱింగిన సీతాపతిరావుగారివంటి విమర్శకులకు న్యాయముగాదు" అని వ్రాసినారు!

సూర్య:—బాగున్నది! ప్రస్తారము నెరింగినవారు గనుకనే ఆ గణము పట్టికలో లేకపోవడము మీరు తెలుసుకోగలిగినారు. శాస్త్రులవారికి ప్రస్తారక్రమము తెలియకపోవుటచేత అది పట్టికలో చేరలేదన్న

సూచన మీవ్రాతలో లేదే. 'వ్రాయమరచినారో' అంటే తప్పేమి? వారికిమాత్రము మరపురాదా? అచ్చుతప్పు అని వారే ఒప్పుకొన్నారు. కనుక, మీరు వికల్పించినవాటిలో ఏదోఒకటి నిజముకాక పోలేదు.

అయితే, వారుచేసిన మరియొక ఆక్షేపణమునకు మీరు సమాధానము చెప్పవలసి ఉన్నది. "౧౦౦-ఇట్టి పంచమాత్రాకగణము ఇనగణస్థానమందును, ౧౦౦౦-ఇట్టి సప్తమాత్రాకగణ మింద్రగణ స్థానమందును బైశాసనములో నెచ్చటను గనపడలేదు." అని యిట్లు నేను స్పష్టముగా వ్రాసియుండగా వానినిగూడ నినేంద్రగణములలోనికి నేను దెచ్చి పెట్టితినని వ్రాయుటకు సీతాపతిరావుగారెట్లు సాహసించిరో తెలియకున్నది" అని శాస్త్రిలవారువ్రాసినదానికి మీరుచెప్పేసమాధానమేమి?

నేను:—శాసనగృహీతగణములనిచెప్పి, ఇనగణములక్రిందను, యగణమున్ను, ఇంద్రగణములక్రిందను యగణమును తామెందుకు పేర్కొన్నారో సీతారామస్వామిశాస్త్రిలవారు మొట్టమొదట సమాధానము చెప్పవలసి ఉన్నది. వీటిని వారు పట్టికలోచేర్చినప్పుడు, ఇవి శాసనమందు లేకపోయినా, శాసనగృహీతగణములవైఖరినిబట్టి ఈయగణయగములుకూడా చేర్చుకోవచ్చునన్నఉద్దేశముతో వారుకనబరచినారనుకొన్నాను. ఇట్లుఅనుకోవచ్చుననుటకు శాస్త్రిలవారి వాక్యములే ప్రమాణము. "శాసనకవి తానుపయోగించినవే యినేంద్రగణములనిచెప్పలేదే, మఱియు నెల్ల యినేంద్రగణములను బ్రయోగించుటకుఁ బూనియుండలేదే" అని 91వ పుటలో వారు వ్రాసినారు, చూడండి.

మరియొకవిషయము, లోగడ పరిషత్పత్రికలో "అవసరజ్ఞుండైన వేదవ్యాసు . ." అనేపద్యము తాము చూపిన శాసనగృహీతగణలక్షణమునకు లొంగియున్నదని వారు వ్రాసినారు. అందులో మూడవపాదము ఎట్లు లొంగినది? అన్నాను. అందులో అచ్చుతప్పుఉన్నదట. దానిని ఆధారముగాజేసుకొని అదిసమన్వితమేకాలేదని నేను వ్రాసినానట. అచ్చుతప్పుఉన్నదని తెలుసుకొనుటకు నాకు వీలులేకపోయినది.

సూర్య:—ఏదీ ఆచరణము?

నేను:—"తపసియన్నువపాడవు నల్లని దీర్ఘతనువు(ను) జూచి" (120 తాటాకు). ఇది పరిషత్పత్రికలో [illegible] బరచినపాఠము. ఇదేవారుచెప్పినలక్షణమునకు [illegible] లేదని ఛందోదర్పణోపోద్ఘాతమందు నేనువ్రాసితిని. ఇందులో ఏదో అచ్చు తప్పుఉన్నదట.

సూర్య:—ఈపాదము ఈయ్యాగజీనులోకూడా కనబరచినట్లున్నదే. ఇందులో ఎట్లున్నది?

నేను:—శాస్త్రిలవారు ఇందులో మూడుచోట్ల ఉదాహరించినారు. ఒకొక్కచోట ఒకొక్కవిధముగా ఉన్నది. పుట. 83లో "తపసి యున్నువపాడవును నల్లనిదీర్ఘతనువునుజూచి" (120 తాటాకు.)

సూర్య:—ఇందులో 'యున్నువు'అనుటకు 'యున్నవ' అని ఉన్నది. లేఖకప్రమాదమో ముద్రణప్రమాదమో కావలెను.

నేను:—పుట. 95లో "తపసియున్నువపాడవును నల్లని దీర్ఘతనవునుజూచి" (120 తాటాకు.)

సూర్య:—ఇందులో "యున్నువు" అనుటకు 'యున్నవ' అనిన్ని 'తనువును'అనుటకు'తనవును' అనిన్ని ఉన్నది. ఈమూడున్ను 120 తాటాకులోనివే అయితే, ఒక్కలాగునేఉండవలెనుగదా; ఇట్లు భిన్నముగా ఉండుటకు కార[illegible]

నేను:—[illegible] తాటాకులో ఎట్లున్నద[illegible] 96 లో శాస్త్రిల[illegible] ఇచ్చిన పా[illegible]పవును నల్లని దీర్ఘతనువును[illegible]యున్నది. వీటిలో గణలక్షణమునకు సంబంధించినంతమట్టుకు 'పాడవును' అనుటకు 'పాడవు'అని ముద్రణప్రమాదమున పడినట్లు ఇప్పుడు బోధపడినది.

సూర్య:—సరే; ఇప్పుడుబోధపడినది. పరిషత్పత్రికలో ఇచ్చిన ఆఒక్కపాఠమునుబట్టి ఈముద్రణప్రమాదము మీరుకాదు బ్రహ్మైనా తెలుసుకోలేడు "పావును" అనిఉంటే అచ్చుతప్పుఉన్నదని తెలుసుకోగలము గాని, ఇదిఎట్లు తెలుసుకోగలము? అయితే, "పాడవు"

అనియున్నా శాస్త్రులవారిమతమున ఈ యుదాహరణము ఛందోబద్ధముగానే యున్నదే; చూడండి:—

"తపసియున్నవుపాడ । వు నల్లనిదీర్ఘ । తనువును జూచి" అనికాని,

"తపసి య న్నవుపాడవు నల్లని దీర్ఘ తనువును జూచి" అనికాని, గణవిభజనము చేయవచ్చునే.

నేను:—ఇప్పుడెట్లున్నా కుదురుతుంది. ఆనాటికి వగణము సూర్యగణమున్ను, జగణ మింద్రగణమున్ను కావచ్చునన్న అభిప్రాయము వారికి కుదిరినట్టు తోచదు.

ఇకను, 97వపుటలో చివరనున్న పేరా చదవండి.

సూర్య:—"వెనుక నుదాహరించినట్టి వ్రాసినపరిషత్పత్రికలోని పద్యములో నియచ్చోరపాటుల నాధారముగా జేసికొని యిదిప[illegible] కాలేదనియు, నొక వందయేండ్లక్రిందటిదగు సీతాటాకులప్రతి నన్నయ కాలపులేఖన పద్ధతులతో నుండవలయుననియు, సీతాపతిరావుగారే మేమో వ్రాసియున్నారు. కాని, యట్టి వ్రాత సుసంగతమైయుండనందున విమర్శసహము కాదని విన్నవించుచున్నాను." —అబ్బా! ఎంతకఠినంగా వ్రాసినారు.

నేను:—దానికేమి? పెద్దలు. ఇందులో మొదటివిషయము విమర్శించినాముగ[illegible] వంటిదో [illegible] కాశీమెట్లుండెనో [illegible] విషయము.

సూర్య:—"[illegible] సీతాటాకులప్రతి నన్నయ [illegible] పద్ధతులతో నుండవలయు"నని మీ రెక్కడ వ్రాసినారు?

నేను:—అదేమో? నేనెప్పుడైనా అట్లు వ్రాసియుందునా? వందయేండ్లక్రిందటిప్రతి సుమారు తొమ్మిదివందల యేండ్లక్రిందటి లేఖనపద్ధతులతో ఉండవలెనని నేనెప్పుడైనా అందునా? ఈ లేఖన సంప్రదాయమును గురించి నేను వ్రాసినది. ఛందోదర్పణోపోద్ఘాతమందు ౬౬ వ పుటలో గురుతుపెట్టినాను చదవండి.

సూర్య:—"నన్నయ మధ్యాక్షరలకోసము ఒకవిధమైన లేఖనసంప్రదాయమున్ను శాసనాక్షరలకోసము మరియొకవిధమైన సంప్రదాయమున్ను గ్రహించవలెననుటకు తగినఆవశ్యకత కనబడదు. నన్నయ వ్రాసిన తాటాకులపుస్తకము మనకుచిక్కదు! కాని శాసనకాలమునకున్ను నన్నయకాలమునకున్ను అట్టే అంతరము లేనందున ఆకాలపు లేఖనక్రమము శాసనములో నున్నట్లు ఉండవచ్చునని ఊహించుట తప్పుకాదు.

మీరువ్రాసిన ఈవాక్యములకున్ను మీరువ్రాసినట్లుగా వారుచెప్పినదానికిన్ని ఎంతవ్యత్యాసమున్నది!

నేను:—ఇకను శాసనాక్షరలలక్షణము విమర్శింతాము.

సూర్య:—ఇదివరకున్న లేఖనసంప్రదాయమున్ను, ఇదివరకు తెలుగులాక్షణికులు చెప్పినలక్షణమున్ను (యతివిషయముతప్ప) అనుసరించిచూచినయెడల శాసనములోని మధ్యాక్షరలు సిద్ధలక్షణసమన్వితములై ఉన్నవని మీరు వ్రాసినారు. ఇట్లువ్రాయుటకు మీరెట్లు సాహసించినారో తెలియదుఅని సీతారామస్వామి శాస్త్రులవారు ఆక్షేపించినారు. దానికిమీరుచెప్పే సమాధానమేమి?

నేను:—తెలుగులాక్షణికులు చెప్పిన లక్షణమునకు లొంగి ఉండనిస్థలములు గీతలుగీచి శాస్త్రులవారు చూపించినారుగదా. వాటిలో ఒక్కగీతగీచినవి మొదట చదవండి.

సూర్య:—"బెజవాడం", "భక్తుణ్డై", "ధాతుణ్డై త్రిచ్చె", "సుతుణ్డొణ్డు", "గనివా[illegible]", "నుంగాత్రికేయునకు", "బెడంగును", "రక్షయుంగానున్దము", "దానుంగట్టించె", "వొడంబడి".

నేను:—వారుగీత పెట్టడంమరచినారో అచ్చుతప్పోకాని, ఇటువంటిదే మరియొకటి మొదటిపద్యం రెండవపాదమందే ఉన్నది:—"మల్లుణ్డునవద్య" వీటి కన్నిటికీ ఒక్కటే సమాధానము. ప్రాచీనశాసనములను చూచినా, ప్రాచీనతాళపత్రగ్రంథములను చూచినా, అరసున్నలుంచి తేల్చిపలకవలసినచోట్లను సైతము, నిండుసున్నలో అనునాసికాక్షరములో ఉంచి వ్రాయడము ప్రాచీనలేఖన సంప్రదాయమని బోధపడుతుంది. ఇందుకు నిదర్శనముగా (శక. 1157)—గణపతిదేవుని కాలమందలి ఉపర్పల్లిశాసనమందున్న పద్యమొకటి

చూడండి. (ఇది హైదరాబాదు ఆర్కియాలాజికల్ సీరీజ్ నం 3 రలో ఉన్నది.)

"దేవాదిదేవుండమిత
స్థావరజంగమమయుండు సర్వేశుండుగా
రీవరుండనవరతంబును
నీవుతంగాటయుకు దయ నభీష్టఫలంబుల్"

సూర్య:—సరే; అరసున్న లుండవలసినచోట్లగూడా నిండుసున్న లుంచిపూర్వులు వ్రాసేవారన్న విషయము స్పష్టమైనది. ఇకను రెండేసిగీతలుగీచినవి చదువుతాను వినండి.

"అర్థిన్", "గొమరస్వామి", "గొరగల్గా", "గాగ మొగమాడు"—వీటికి మీరుచెప్పేసమాధాన మేమి?

నేను:—"అర్థి"అని ఉన్నా తప్పులేదు. ఇదిపద్యాంతమందున్నది. పద్యాలుపాడినప్పుడు, చివరనున్న అక్షరము గురువుగా ఉచ్చరించడము సహజము; గనుక శాసనముచెక్కినవాడు "అర్థిi"అనినిండుగా చెక్కి ఉండవచ్చును. "విశ్వదాభిరామవినురవేమా" అని చివరనున్న 'మ'వర్ణము దీర్ఘాంతముగా వ్రాతప్రతులలోకనబడుతున్నదికాదా? ఇంతమా"అర్థి"తర్వాతసున్నదానకారపోల్లా? పద్యముపూర్తియైనదని తెలియజేసే నిలువుగీతా? కొన్నిచోట్ల పాదాంతములందున్ను పద్యాంతములందున్ను నిలువుగీకలుకనబడుతున్నవి. అక్కడమాడా ఒకగీతఉండవచ్చును. అదే 'న్'అని చదువుతున్నారుగాబోలు.

సీ॥ కొక్కొరోకో యని కొమరసామి రథంబు
భీ. ౨ ఆ. (చూ. శబ్దరత్నాకరము)

"గొమరస్వామి"—ఇది "గొమరసామి" అనే ఉండవలెను. "దొర(రె)సామి", "కుప్పుసామి", "కొలకసామి"—ఇవి తద్భవరూపములు గదా; 'స్వామి' అని ఉన్నా దానికి పూర్వమందునఉండే లఘ్వక్షరము తేల్చి పలకవలసినదే కాని ఊది పలకరాదు 'తెలుఁగు వ్యాకరణము' లోని 'గు', 'తలఁబ్రాలు' లోని 'ల' వలెనే తేల్చి పలకవలెనుగదా.

'వడిద్వారము'లోని 'డి'

"గొరగల్గా"—దీనికి సమాధానము చెప్పడము కష్టముగానేఉన్నది. ఈపద్యములో చివరనున్న రెండు చరణాలకున్ను అర్థం స్పష్టంగా లేదు. ఆయతములో ఉండవలసిన వారెవరో ఉండగూడని వారెవరో తెలియదు. నాల్గవచరణమందలి మొదటి అక్షరము పొ, పఘభభవ- వీటిలో ఏదో ఒకటి అయిఉండునని ఊహించుటను బట్టి స్పష్టమైనదిగాని, ఏదనుకొన్నా ఆమాటకు అర్థము తెలియదు.

సూర్య:—తక్కిన మాటలకు అర్థమేమైనా 'గొరగల్గా' అని స్పష్టముగా సగణగురువుగా ఉన్నది. ఈగణము ఇంద్రగణము కావచ్చునని చెప్పకొంటారా?

నేను:—'గొరగల్గా' అనేశబ్దము గురించి మాత్రము మనకు స్పష్టంగా తెలిసినదేమిటి? సరే; ఉన్నది ఉన్నట్లుగానే గ్రహించి ఉచ్చరించినయెడల ఇది సగణగురువై ఉండవలెను; గాని దీనిగురించి కొంచెము చెప్పవలసిఉన్నది.

అద్రువ, వి[illegible]దిచె మొదలయినవి నగణములుగా కవులు ప్రయోగించినారు. 'ఎడ్డ,' 'బూడ్డి,' 'మొగుడ్చి' అని వ్రాతప్రతులలోను, 'ఎద,' 'బూది' 'మొగిచి' అని అచ్చుప్రతులలోను పాఠములు కనబడుతూ ఉన్నవి.

1. చింతంతే హిమ్వ్యకచ్ఛన.

2. కమటువ ఇతంసి జాఓ

జాఏ హిమి[illegible]కంథఅన్నేహిం.

ఈ ప్ర[illegible]మి' అనేది 'హివి' అని ఛందస[illegible]

సూర్య:—అవి[illegible]

నేను:—[illegible]వ్యాసములో [illegible]నగర శాసనమందలి ఆర్యలు కనబరచినారు. ఇదిగో పుస్తకము. పుటలు 245,247 తీసిచూడండి. అందులో ఈ రెండున్ను కనబడతవి.

చూచినారుగదా ఇకను ఋగ్వేదములో కొన్నిచోట్ల వ్రాసినది వ్రాసినట్లుకాక, కొద్దిగామార్చి ఛందోభంగము కలుగకుండా చదవవలెనన్న విషయము మీకు తెలిసినదే. అందుకు నిదర్శనముగా ఒకటి చూడండి.

నేమన్నః కామమాపృణ। గోభిరశ్వైః శతక్రతో
స్తవామ త్వా స్వాధ్యః॥ (మం. 1. సూ. 16, ఋ. 9)

ఇది గాయత్రీఛందము; మూడుపాదములు గలది. పాదానకు 8 అక్షరాలుండవలెను. మూడవపాదములో 8 అక్షరాలే ఉన్నవి. అయితే 'స్వాధ్యః' అనే రెండక్షరాలున్ను 'సువాధియః' అని నాలుగక్షరాలుగా చదవవలెను గదా. ఈలాగునే మనము ప్రతిదినమూ పఠిస్తూ ఉండే గాయత్రీమంత్రములోని 'వరేణ్యం' అనే మూడక్షరాలున్ను 'వరేణియం' అని నాలుగక్షరాలుగా ఉచ్చరించవలెను గదా.

ఇకను, కొన్ని తెలుగు శాసనాలలో వ్రాసినది వ్రాసినట్లుకాక, కొద్దిగామార్చి ఛందోభంగము కలగకుండా ఎట్లు చదవవలెనో చూడండి.

"పుడమివెలుంగ నొంచెడ్లపూండి మహేశున కిందు మాలికిం" ఇది చంపకమాలా [illegible]ణము. ఇక్కడ 'నొంచెడ్ల' అన్నది 'నొంచెడల' అని చదవవలెను. మరియొకటి :—

"అరుదగుచుండ నాదిండ్ల అందు ప్రసిద్ధిగశూలపాణికిని" ఇది, "అరుదగుచుండ నాదిండల అందు ప్రసిద్ధిగ శూలపాణికిన్" అని చదవవలెనుగదా.

సూర్య:—ఇవి ఎక్కడి శాసనములు?

నేను:—South Indian Inscriptions. 4. వాల్యూములో పు. 205; నం. 672. చూడండి. అందులోనే పు. 207; నం. 675 చూడండి. ఒక కంద పద్యము ఎట్లువ్రాసినా[illegible]
ధరసిద్ధిచే[illegible]
హరి[illegible] నుతాజిని
శ్రీవచ్చ[illegible]
[illegible]న్నారు.

ఇందులో 'శ్రీ' [illegible]కుమారుగా 'శిరి' అని గాని 'సిరి' అనిగాని చదవవలెనుగదా. ఈ శాసనము లోనే మరియొక పద్యచరణము చూడండి.—

"అలలితాతపత్రని చయంబునుంగాహడ్లునుదయారసక్షాలిత..." ఇది "అలలితాతపత్రని చయంబునుంగాహడులుం దయారసక్షాలిత..." అనిగదా చదవవలెను.

శాసనములలోనివ్రాతలు ఈలాగు ఉంటూఉంటే 'గొరగల్గా కొరులీస్తు విడిసి బృన్దంబుగొనియుండువారు। ?రిగాక యబ్బారణాసి ప్రచ్చినపాపంబుగొణ్డు।' అన్నచరణములకు అర్థం స్పష్టంకాకుండా ఉంటే, ఇక్కడ సగణగురువుగా కనబడుతూఉన్న గణము ఇంద్రగణముగా కవి ఉద్దేశించినాడో లేదో 'గొరగల్గా'లో 'గ' తేల్చి పలకవలెనో లేదో ఎట్లుచెప్పగలను!

సూర్య:—కావ్యాలంకారచూడామణిలోను, కవిజనాశ్రయములోను త్రిగురు జనితములైన 8 గణములున్ను ఇంద్రగణములన్నారు గదా. అందులో '॥।।' (సగ) అనేగణము ఉన్నదిగదా 'గొరగల్గా' అన్నది సగణగురువుగా మీరెందుకు అంగీకరించరాదు?

నేను:—'మగణ, సగ'ములు మధ్యాక్కరలో ఉండవని చెప్పుటకు కొన్ని కారణములున్నవి.

1. కావ్యాలంకారచూడామణిలోను, కవిజనాశ్రయములోను అక్కరలయిదింటికిన్ని లక్ష్యములుగా ఉన్న పద్యాలలో ద్వి, త్రి, చతుర్గురుజనితగణములలో మొదటిరెండేసిగణములకున్ను ప్రయోగము ఎక్కడా కనబడలేదు. కనుక, మొదటివి రెండేసిన్ని విడిచిపెట్టవలెనని స్పష్టముగా చెప్పకపోవడము ఆ లక్షణకర్తలు ఉద్దేశించుకొన్నదో పొరపాటో నేనుచెప్పజాలను,

2. మనమధ్యాక్కరను పోలిఉన్న కన్నడదొరె అక్కరలో ఉండవలసిన విష్ణుగణములు 4, 5 మాత్రల విష్ణుగణములే (అనగా నల, నగ, సల, భ, ర, తలే) కాని 6 మాత్రల విష్ణుగణములు (అనగా మొదటివి రెండున్ను మ, సగములు) కావు.

సూర్య:—సరే; మీరుచెప్పినసమాధానము చక్కగా ఉన్నది. కాని, కవి ఉద్దేశము స్పష్టముగా తెలుసుకొనుటకు ఇంకా అవకాశమున్నదేమో విచారించవలెను.

ఇకను "గాగమొగమాడు"- ఇందులో 'గాగమొ' భగణమైతే, 'గమాడు' జగణముకావలెను ఇది సూర్యగణస్థానమందున్నదిగదా. దీనికేమంటారు?

నేను:—ప్రమాదవశమున ఒకరుచేసిన తప్పు తక్కినవారు తగిన విమర్శలేకుండా అనుసరిస్తే విపరీతమైన లక్షణములు పుట్టవచ్చుననుటకు ఇది మంచి నిదర్శనమంటాను. శాసనములో 'గామొగమాడు' అనే ఉన్నది గాని 'గాగ మొగమాడు'అని లేదు. 'గాగమొగమాడు

అని శాసనకారుడు వ్రాయ నుద్దేశించి ఉంటే, 'గాజ్గమెుగమాడు' అని ఉండును. 'పరగజ్గ బెజవాడ' అనిఉన్నది చూచినారా? అయితే, రామయ్యపంతులుగారు ఇప్పటిలిపిలో ఈశాసనము కనబరచినప్పుడు 'గా గ మెుగమాడు' అని పడినది. ఈపొరపాటు వారిదో అచ్చువారిదో తెలియదు. కాని ఈశాసనములోని పంక్తులు పద్యచరణములుగా ఎత్తి వ్రాసినచోట 'గామెుగమాడు' అనేఉన్నది. ఇది మనశాస్త్రిలవారు చూడలేదో, చూచినా లాక్షణికులు చెప్పిన లక్షణమునకు సరిపడిఉండవలెనన్న ఉద్దేశముతో ఇది రామయ్యపంతులవారు దిద్ది సవరించిన పాఠమేకాని శాసనములోనిది కాదని తలచి ఉపేక్షించినారో తెలియదు.

సూర్య:—శాస్త్రిలవారు శాసనముప్రతి సరిగా పరిశీలించలేదు, గాబోలు.

పరేకాని, మూడుగీతలుగీచిన వాటిగురించి మీరే మీ సమాధానము చెప్పలేరనుకొంటాను. 'మఠంబు' 'నలియంబయ్యారల', 'ఫలంబు', 'ప్రత్యక్షంబయున్న', 'మఠంబు', 'గ్రమంబున', 'కలశంబిడ్డట్లు'—వీటిలోని నిండుసున్నఅరసున్న అగుటకు వీలు లేదుగదా. మాటకు, 'మఠంబు' అని జగణముగాఉన్నది. 'మఠము'లని నగణముగాచదవవలెనని చెప్పుటకు ప్రమాణమేమి! మీతండ్రిగారు శాస్త్రులవారికిపంపిన దీర్ఘాసిశాసనమందలి సీసపద్యములో 'దేశంబు'అని తగణముగాను, 'దేశము'అని భగణముగాను రెండువిధములుగాను లిపిఏర్పడిఉన్నదిగదా; అదిమీరు చూడలేదాఏమి?

నేను:—అదినేనుచూడకపోలేదు, ఆనాటికి విభక్తి 'ము'కారము ఏర్పడినది. అంతకుపూర్వము 'మఠము'అని నగణముగా చదవవలసినప్పుడుకూడా 'మఠంబు'అనే వ్రాసేవారు. యుద్ధమల్లునిశాసనములో విభక్తి'ము' వర్ణము ఎక్కడాలేదు. దానికిమారుగా అన్నిచోట్లా 'ంబు' అనేఉన్నది. మరిఒకమారు శాసనమంతా చదివి చూడండి.

సూర్య:—అవును. విభక్తి ము వర్ణము కనబడలేదు.

నేను:—అదిఉంటే, శాస్త్రిలవారుచెప్పిన విషయము నేనుశిరసావహించవలసినదే.

సూర్య:—అయితే, అదిలేనంతమాత్రాన మీరుచెప్పినది వారు శిరసావహించవలసిన అగత్యంలేదు. లక్ష్యమునుబట్టి ఇప్పుడు క్రొత్తగా గణకల్పనము చేయదలచినారు; కనుక, 'ంబు'కు పూర్వమందున్నది గురువుగానేభావించి శాస్త్రిలవారు గణములేర్పరుస్తున్నారు. గణములగురించి వివాదలేని పద్యములో విభక్తి ముకారమునకుమారుగా 'ంబు' ఉన్నశాసనము, శాస్త్రిలవారన్నట్లు "అందఱకు దొరకుటకు వీలగునట్టిస్థలము" ప్రమాణముగా చూపించండి. అంతవరకున్ను మీరుచెప్పినదానికి "సమాధానము ఆలోచించుప్రసక్తి యగపడదు."

నేను:—ఆలాగేచూపిస్తాను. కీర్తిశేషులయిన కొ. వె. లక్ష్మణరావుపంతులుగారు రెండుసంవత్సరములక్రిందటజరిగిన ఆంధ్రపరిశోధక మహామండలిపంచమవార్షికోత్సవసభలో చదివినఅధ్యక్షోపన్యాసము కీర్తిశేషులయిన చెలికాని లచ్చారావుగారు చిత్రాడలో ప్రకటించినసంచికయందున్నది; చూడండి. అందులో "నన్నయభట్టునకంటె రెండువందలయేండ్లకుఁ బూర్వమును యుద్ధమల్లునికంటెఁ దొంబదియేండ్లకుఁబూర్వమును" రాళ్లమీదచెక్కిన పద్యములను ఎత్తివ్రాసి కనబరచినారు. వాటిలో ఒకటిసీసము. అందులో "కొట్టంబుల్"అన్నది. సీసమునకుచెప్పిన గణములలో మగణము లేదు; గనుక 'కొట్టముల్' అని రగణముగాచదవలె[illegible]

సూర్య:—శాస్త్రి[illegible]ని శాసనముప్రమాణముగాతీసుకొని [illegible]ములను ఇనేంద్రగణములుగా [illegible] ఈశాసనము కూడా ఆధారము[illegible]ని సీసాదుల విషయములో సైతమూ మగణముకూడా ఇంద్రగణమేను అని అంటే ఏమంటారు?

నేను:—ఇటువంటి సందేహముండబట్టే, "శాస్త్రిలవారు క్రొత్తగా తెచ్చిపెట్టిన ఇనేంద్రగణములు సీసములు మొదలయిన తక్కిన తెలుగుపద్యములందు ఉపచరించునా" అని ఛందోదర్పణోపోద్ఘాతమందు వ్రాసినాను. అయితే, సీస గీతాదుల ఇనేంద్రగణములు అప్పకవ్యాది లాక్షణికులు చెప్పినవే అని శాస్త్రిగ

జీనులో వ్రాసినవ్యాసమందు స్పష్టపరచినారు. కనుక, 'కొట్టంబుల్' అని శాసనములో ఉన్నా "కొట్టముల్" అని చదవవలెనని శాస్త్రులవారు కూడా అంగీకరింపక తప్పదు.

సూర్య:—మీరు చూపించిన ఈసీసపద్యము ముక్కముక్కలుగా ఉన్నదిగాని పూర్తిగా లేదు.

నేను:—యుద్ధమల్లునిశాసనము మాత్రము పూర్తిగా ఉన్నదా; పోనీండి. లక్ష్మణరావుగారు ఉదాహరించిన రెండవశాసనములోనితరువోజపద్యముచూడండి. ఇది నిండుగాఉన్నది.

"కొట్టంబుల్పణ్డ్రెణ్డు(గొని)వేఙ్గినాణ్టి" ఇది "కొట్టముల్ పండ్రెండుగొని వేఁగినాఁటి" అని గదా చదవవలెను. ఇక దీనికేమంటారు?

సూర్య:—మరి మారుమాటాడక ప్రాచీనలేఖన సంప్రదాయమునుగురించి మీరుచెప్పినవిషయము అంగీకరించవలసినదే.

చాలా వేళ అయినది. విషయములన్నీ విమర్శించడమైనదా?

నేను:—ఒక్కవిషయముమాత్రము ఇంకా విమర్శించవలసి ఉన్నది. నాగవర్మదొర అక్కరకుచెప్పిన పద్యమునకున్ను దానిపై కిట్టెలుదొర వ్రాసిన ఇంగ్లీషువాక్యములకున్ను, అర్థము శాస్త్రులవారుచెప్పినారు. వారు చెప్పినఅర్థము విమర్శించవలసిఉన్నది. మరియొకసారి కలుసుకొని విమర్శింతాము.



# నా పాట

భమిడిపాటి రామసోమయాజులు గారు, బి. ఏ.,

గొంతువోయి స్వరమ్ము రవంతయేని
పైకివెలువడకున్నను పాడుచుంటి,
మూగనైనంత మా[illegible] మొరల వినవొ?
వినిన మానివ[illegible]నసుర స్వామి!

ఈమహోన్నత పర్వత భూమిలోన
వెలుగెరుంగని లోయలో, శిలలపైన
హోరనుచు బారు సెలయేటి యొడ్డునందు,
కాలమెరుగక పాడుకోగలను స్వామి!

అంతమేలేని నాపాటయందు జగము
లీనమైపోవు; నీవును లీనమగుదు
వీశరీరము రాలేద యేమొ! దాని
వినుతు పాటను మాత్రము వీడ స్వామి!

చుక్కలన్నియు నీరయి సూర్యచంద్ర
లోకసముతోడ గరగి నాయందె కలతు
రప్పటికి గూడ నే పాట నాప బోను
పాడుకొనియెద నీయొక్క స్వరమె స్వామి!

మాయతెర జీల్చుకొని దివ్యమార్గమంటి,
ప్రకృతి వన్నెలకావలి భావముగని,
నీహృదయకవాటము దట్టి నిన్నుగలసి
కొనగ, నిత్యము నేబాడు కొందుస్వామి!






యడ్లపాటి వెంకట సుబ్బారావు గారు, బి. యె.,

పదునారవ శతాబ్దిలో వెలువడిన ప్రబంధములలో వసుచరిత్ర యొకటి. దీనికి కృతికర్త రామరాజ భూషణుడు. కృతిభర్త, తిరుమలరాయలు. కథానాయకుడు వసురాజు. కథానాయిక గిరికాదేవి. వీరిద్దరి వివాహవృత్తాంత మిందలి ప్రధానకథ. గిరికాదేవి జననకారణమైన శుక్తిమతీ కోలాహల సమావేశము ఉపకథ. శృంగారము ప్రధానరసము. కావ్యము శ్లేషసమన్వితము; నారికేళపాకము; మహాకఠినము.

## కథాసంక్షేపము

గ్రంథవిమర్శనకు గడంగుటకు పూర్వము కథ క్లుప్తముగా చెప్పుట ఆవశ్యకము. కథావిధానము ప్రధాన రసపరిపోషణమునకు బీజము.

వసురాజు చేదిభూపాలుడు. మధుమాసమున నొక దినమున వనపాలురు రాజుకడ కేతెంచి ఉద్యానవన శోభను వర్ణించిరి. రాజు తత్సౌందర్యావలోకనకుతూహలుడై పరివారముతో ఉద్యానవనమున కేతెంచి పరివారమును బహిరంగణమున నిలిపి నర్మసచివసమేతుడై వనప్రవేశ మొనర్చి వన రామణీయకమును నేత్రపర్వముగ విలోకించుచుండ ఒక మహావృక్షము భూమి కొరగియుంట చూచి కోలాహలపర్వతము జ్ఞప్తికిరాగా నాపర్వత ప్రాంతమునకు వెళ్లెను. అక్కడ నొకశిలావేదికపై ఆసీనుడైయుండ వీణారవమొకటి వీనుల విందొనర్ప తద్వృత్తాంత మరయ నర్మసచివుని పంపును. సచివుడేగి యొక రమ్యసౌధములో చెలికత్తెలు పరివేష్టింప వీణవాయించుచున్న గిరికను చూచి రాజుకడ కేతెంచి గిరికాసౌందర్యమును వర్ణించును. రాజామెను చూచు కుతుకమున సచివుడు మార్గముచూప సౌధసమీపమున కేతెంచును. సచివుడు మునివేషధారియై సౌధము ప్రవేశించి అస్త్రీజనముచే పూజితుడై ఉపవిష్టుడగును. మంజువాణి గిరికాజననప్రకారము మునికి తెలియ జేయును. ఆమెను వసురాజే తగినవరుడని ముని చెప్ప వసురాజే విధముగ లభింపగలడని చెలికత్తెలు సందేహము నొందుదురు. అప్పుడు ముని రాజును మంత్రప్రభావమున రప్పింతునన పొదచాటుననుండి కనిపెట్టుచున్న వసురాజు సమయ మదియని వారిసమీపమున కేతెంచును. వారు రాజును ఉచితాసనాసీనుని చేసిగౌరవింతురు. ముని వెళ్లి నిజరూపమున ప్రవేశించును. ఇది గిరికావసురాజుల ప్రథమసమావేశము. కలహంస వచ్చి గిరికను పిలుచుకొనిపోవును. రాజు నర్మసచివునితో వనమున ఆయాచోటుల దిరుగుచు గిరికాప్రశంసచేయుచు నిజమందిరమునకు బోవును.

గిరిక వసురాజుమీది మోహముచే విరహవేదన పడుచు అందుకు తాళజాలక సహకార కోరకగ్రహణమున మేను వాయదలచి వనమున కేతెంచును. చెలికత్తెలామెను వెదకుకొనుచువచ్చి నయవాక్యముల దుఃఖోపశమన మొనర్చి వనవిహార మొనర్చి పుష్పాపచయము, జలక్రీడలు మొదలగునవి సలిపి మన్మథపూజ యొనర్తురు. వసురాజుచిత్తవృత్తి నారయ మంజువాణి పురమున కేగును. గిరికాదేవి విరహవేదనవల్ల చంద్రదూషణ మొదలగునవి చేయును. ఇంతలో మంజువాణి యేతెంచి తానువెళ్లిన వృత్తాంతమంతయువినిపించి రాజామెయందు పరిపూర్ణానురక్తుడై తదేకధ్యానముతో నున్నటులు వివరించి రాజిచ్చిన అంగుళీయకమును గిరికకొసంగును.

వసురాజు నిజగృహమున గిరికామనోహరరూప లావణ్యాదుల స్మరించుచు మోహవిభ్రాంతిలో మునిగియుండును. చెలికాడగు ఇంద్రుడు వీవిషయమును కనిపెట్టి దేవతాపరివారసమేతుడై కోలాహలునికడ కేగుదెంచి గిరికను వసురాజున కిచ్చి వివాహము చేయవలసి-

నదిగా అడుగును. కోలాహలు డండులకు సమ్మతింప ఇంద్రు డావిషయమును వసురాజున కెరింగించి తీసికొని వచ్చును. శుభముహూర్తమున గిరికావసురాజులకు వివాహ మగును. ఇంద్రు డనేక బహుమతులను వసురాజున కొసంగి వీడ్కొనును.

వివాహానంతర మొకదినమున వసురాజు క్రీడా మందిరమునుండ చెలికత్తెల ప్రోద్బలమున గిరిక వచ్చును. సంభోగవర్ణనతో గ్రంథపరిసమాప్తి యగును.

## శుక్తిమతీకోలాహలచరిత్ర

ఉపకథ యగు శుక్తిమతీకోలాహలులచరిత్రకూడ చెప్పుట అవసరము. శుక్తిమతి నది. కోలాహలుడు పర్వతము. కాని వీనిని అచేతనపదార్థములగు నదీ పర్వతములుగ నెంచుకొనక స్త్రీ పురుషులుగానే భావించుదము. శుక్తిమతి నలువకొలువున కేగి తిరిగి వచ్చుచుండ కోలాహలు డెదురుపడును. శుక్తిమతి వినయముతో తొలగిపోవును. కోలాహలున కామెమీద మోహము జనించును. మోహపరవశుడై ఆమెయొద్దకువచ్చి నిజాభిలాషను వెల్లడిచేయును. కాని ఆమె అందుల కీయకొనక తన హేయస్వరూపమును కుటిలగమనమును వర్ణించుకొనును. కోలాహలుడు బలాత్కారమున పైబడును. ఆమె వసురాజునుగూర్చి మొరపెట్టుకొనును. ప్రజ లీ విషయమును వసురాజునకు తెలియజేయ వసురాజువచ్చి కోలాహలుని కొనగోట మీటి యోడించును. ఇంద్రుడు ప్రత్యక్షమై వసురాజు శౌర్యమునకు మెచ్చి లక్ష్మీనారాయణ వివాహసమయమున విశ్వకర్మచే నిర్మింపబడి తనకు నారాయణునిచే నీయబడిన విమానమును వసురాజునకు నిచ్చును. కోలాహలు డాప్రాంతముననే యుండును. శుక్తిమతికి గర్భచిహ్నము లేర్పడును. గిరికాదేవి జనన మొందును. ఈకథనంతయు మంజువాణి మునివేషములో నున్న నర్మసచివునకు చెప్పును.

## శృంగారరసపరిపోషణము

కవి కావ్యమును ఒక శృంగారసౌధముగా నిర్మించుకొనెను. ఆసౌధారోహణమునకై ఆఱు సోపానములను నిర్మించుకొనెను. ఆయారు సోపానములు ఆరు శృంగార రంగములు. ఒక రంగము మరియొక రంగప్రవేశమును కలుగజేయును. ప్రథమరంగము వసురాజు వనవిహారము; ద్వితీయరంగము గిరికా వసురాజుల సమావేశము; తృతీయరంగము గిరికావిరహావేదన, తచ్ఛాంత్యుపకరణములు; చతుర్థరంగము వసురాజు విరహావేదన, మంజువాణి దూత్యము; పంచమరంగము విరహము; షష్ఠరంగము వివాహానంతరము. ఒక్కొక్కరంగ మేవిధముగ శృంగార రసపరిపోషణమున కనుకూలమో వివరించెదను.

గిరికావసురాజుల ప్రథమసమావేశమునకు వసురాజు వనవిహారము ప్రధానము. శృంగారరసమునకు ఆలంబనవిభావమైన నాయకుడు మధుమాసమున ఆహ్లాద సమయమున రమ్యోద్యానవిహారలోలుడై మానసోల్లాసమున నుండువేళ ఆయాదృక్ప్రదర్శనములు, మలయానిల స్పర్శానందానుభవము, ఉద్దీపనవిభావములై తన్మయత్వము నొందించును. ఈరంగమున కవిచేసిన వర్ణనమంతయు వసురాజు చిత్తాకర్షణశక్తియుతమై ముందు కలుగబోవు శుభమునకు సూచకమై యున్నది.

చ. చలిత లతాంతకాంతియను
చందురు కావిచెరంగు దాటి స
మ్మిళితవయోవిలాసముల
మీటిన విచ్చు ఫలస్తనాగ్రముల్
వెలువడఁగప్పెఁ దత్క్షణము
వెల్లితదోహదధూపధూమకుం
తలములు విప్పి దాడిమల
తాలలితాంగి నృపాలుచెంగటన్.

ఈదాడిమలతావర్ణనవ్యాజమున నీ గిరికా వసురాజుల సమావేశమును కవి సూచించెను. ఏతద్దృక్ప్రదర్శనవిలోలుడైయున్న రాజునకు ఒక కిన్నరమిథునము శుభసూచన తెలియజేయుచు కోలాహలపర్వతమున కెగిరిపోవును. అవి యటులు వెళ్లుట చూచిన రాజునకు కోలాహలపర్వతవిహారోత్సుకము కలుగ అచ్చటకు వెళ్లెను. ఇటుల ప్రథమరంగము ద్వితీయరంగమునకు మార్గదర్శక మయ్యెను.

ద్వితీయరంగమున శృంగారరసపరిపోషణ మత్యద్భుతము; కళానైపుణ్యము ప్రశంసనీయము, మనోహరము; నాటకరంగప్రదర్శనతుల్యము. ముఖవిన్యాసముల భావవ్యక్తీకరణము, వ్రీడాభినయవిశేషములు

రసవంతముగ ప్రదర్శితములు. మాయాముని వసురాజును మంత్రప్రభావమున రప్పించెదనన రాజు ప్రత్యక్షమగుట, అక్కడనున్న స్త్రీజనములో కళవళపాటు, అద్భుతకళా ప్రదర్శనములు. నాయికానాయకుల వీక్షణపంక్తులొండొంటితో మిళితమై అన్యోన్యమనోభావాన్వేషణ మొనర్చుట స్వాభావికము. ఈ పట్టున కవి సహజమాధుర్యమును వెదచల్లెను. గిరికాదేవి సహజవ్రీడావీక్షణములు వసురాజు సరసమోహదృష్టుల నెదుర్కొని మరలుట స్వభావసిద్ధము. వసురాజు పరధ్యానమున నుండ మరల ఆ వ్రీడావీక్షణములు ప్రసరించి అతని మనోహర సౌందర్యధన మపహరించుట శృంగారరస పరిణామ వికాసము. గిరికాదేవి లజ్జచే తెరచాటునకుబోయి క్రీగంటిచూపులు ప్రసరింపజేయుట స్వాభావికము. చెలికత్తెల మేలపుపలుకు లిత్యాదులు ఆలంబనవిభావమగు నాయికానాయక శృంగారరసపరిపోషణమునకు ఉద్దీపనవిభావములు. కలహంసతో గిరిక వెళ్లిపోవునప్పుడు కవి చిత్రించిన శృంగారప్రదర్శనము వర్ణనీయము.

చ. కలికియు నానృపాలకునిఁ
 గ్రమ్మఱఁ జూచుచు నేఁగె నేర్పుతో
నలఘుపదాంగదధ్వనికి
 నంచలు మూఁగిన నిల్చి నెయ్యపుం
జెలువల గూడఁ బిల్చుగతిఁ
 జిల్కుకుఁ బార్చు వ్రాలుతాంచలంబులన్.
ఫలము దెమల్చురీతి నళి
 పంక్తికి మోము మలంచు కైవడిన్.

ఈగిరికావసురాజుల సమావేశము తృతీయ చతుర్థరంగములకు కారణము. వసురాజు మనోహరరూపసందర్శనమున గిరికాహృదయక్షేత్రమున ప్రేమాంకురము మొలకెత్తెను. దానిని వికసింపచేయవలెను. అందుకు తగిన ప్రదేశము వనము. గిరికను కవి వనరంగమున ప్రవేశపెట్టెను. వనరామణీయకము, మందమారుతము, పక్షుల కిలకిలారావములు ప్రేమాంకురమునకు దోహదములై ఆమెను మోహావిభ్రాంతికిలో బరచును. చెలికత్తెలామెకు తాపోపశమనముచేయ ప్రయత్నింతురు కాని, ఆయుపచారములన్నియు మోహాభివృద్ధికే తోడ్పడును. ఆమె దృష్టిని తదేకధ్యానమునుండి మరల్ప జలక్రీడాపుష్పాపచయవ్యాజముల కల్పించి ఆమెకు వసురాజుచింతనమున విశ్రాంతి యొసగెదరు; కాని వెంటనే ఆమె మనోభావము లటులనే పరుగెత్తుచుండును. వసురాజు చిత్తవృత్తి కనిపెట్టనేగిన మంజువాణిరాకకై ఆందోళనమును జెందిన హృదయముతో ఎదురుచూచుచుండుట ప్రేమదశ పరిపాకమునొందుచున్నది.

కవి యేర్పరుచుకొన్న చతుర్థరంగము వసురాజు శయనగృహము. గిరిక వనములో విరహవేదన ననుభవించుచున్న విధమున నిక్కడ రాజు గిరికాచిత్రఫలకమును వీక్షించుచు మోహపరవశు డగును. అట్టిసమయమున మంజువాణి వచ్చి గిరికామణిహార మొసంగి గిరికానురాగముచే తెలియజేయుట శృంగారపరిణామము సంపూర్ణత్వము దాల్చెనని చెప్పవచ్చును. మంజువాణి గిరికకు రాతియుంగర మొసగుటతో ప్రేమపరిపూర్ణత్వము తాల్చినది. అన్యోన్యానురాగ మొండొరులకు పరిస్ఫుటమైనది. తృతీయ చతుర్థరంగముల సంయోగమునకు కారకురాలు మంజువాణి. ఈరంగద్వయసంయోగముచే కవి శృంగారరసప్రవాహము వెల్లివిరియునటుల చేసెను.

ఈసంయోగఫలము పంచమరంగమున విశదము. నాయికానాయిక వివాహముతో కావ్యోద్దేశము పరిసమాప్తము. శృంగారరసపరిపోషణము సంపూర్ణము. మనోహరము. కవి కావ్యము నంతటితో విరమించిన నెంతయో బాగుండెడిది. నాయికానాయకవివాహశుభకార్యవర్ణనతో కవి తృప్తినొందక వారిశోభనమునుకూడ ముట్టడించుట విచారకరము. అటుల చేసినను వారిమనోభావములను మాత్రము వర్ణించి ఔచిత్యము పాటించిన బాగుండెడిది, కాని కవి తుచ్ఛవర్ణనకు గడంగెను. పాఠకులకు హేయమును (జుగుప్స) కలిగించు శృంగారవర్ణన చేసెను. ఈక్రిందివర్ణన చూడుడు.

సీ. వరపద్మముకరముల్ కరగతంబులు నీకు
 సతి! నీవి యింత చే సడలరాదె
బహుళశతచ్ఛదరాశి భవదకీయుగళంబు
 నేత్రాంచలం బింత నెరపరాదె
యనఘుదివ్యాహారళని నీదు కెమ్మోవి
 లేమ! ముద్దింత ప్రాలింపరాదె

దావి గంబూరంపుదీవి నీమొగ మొక్క—
పలు కింత నాపైనఁ జిలుకరాదె
చక్రవిజయం బొనర్చె నీచన్నుదోయి
కంచుకం బేల యింకఁ జాలించరాదె
నిర్మలామూల్యగుణరత్ననిధికి నీకు
వనజముఖి త్రాస మిదియేల వదలరాదె?

తే. అనుచు నరపతి కెంగేల నచలకన్య
కాత్రపార్ఘుర గూఢాంగకములు దరలె
నొయ్య నాభికుచాది నిమ్నోన్నతప్ర
దేశములు దద్వ్యగాహెచ్చఁ దెలియుకరణి.

మ. తరళాధార మణిప్రవాళశయగు
ప్తం బంచు నభ్యంతర
స్మరుఁ డుత్తంభితకంపలోలపటసం
ఙ్ఞం బిల్వ బాలాపయో
ధరదుర్గంబు గ్రహించె రాజకరమే
తజ్జాతసంత్రాసనై
ఖరిఁ దెల్పెన్ జఘనస్థలీవరణజా
గ్రద్ఘంటికాఘోషముల్.

ఇది నీచసంభోగవర్ణనము. అసహ్యము. కవిభావనాశక్తిమాత్రము మెచ్చుకొనవలసినదే.

## నాయకుడు

ఇక నాయపాత్రవిమర్శనకు గడంగెదను. నాయకుడైన వసురాజు చేదిభూపాలుడు. శౌర్యధైర్య సమన్వితుడు; కోలాహలపర్వతమును కొనగోటమీటిన మహాసత్త్వుడు; ఇంద్రునంతవానిచే మెప్పువడసి విమానము పొందిన శూరశిఖామణి; ఆర్తజనత్రాణపరాయణుడు; సుగుణమణి; సౌందర్యరాశి; సరసుడు. ప్రకృతిసౌందర్యావలోకనాభిలాషి; శృంగారరసప్రియుడు; కవి నాయకుని పాత్రపోషణమున స్వల్పలోపమును గనుపరచెను. శయనగృహమున హంసతూలికాతల్పముపై శయనించి గిరికాచిత్రపటము వీక్షించుచు నాయకుడు విరహ మనుభవించు విధము సమంజసముగ లేదు. ఆరూపలావణ్యముల మెచ్చుకొనుచు తదనుభవమునకు ఉవ్విళు లూరవలసిన నాయకుడు ఏవిధముగ నాయికాదూషణ ప్రారంభించినాడో చూడుడు.

ఉ. ఏమిటికల్గితే కువల
యేక్షణ! పల్కవిదేటికే వధూ
టీమణి! యేల తాకటికి
డెందము వ్రానితివే లతాంగి? య
య్యో మనసారఁ దావకప
యోధరపాళి దృఢాంకపాళి యీ
వే మృదుపాణి! నీకు నొక
యెగ్గను జేయఁగదే తలోదరీ!

చ. అళులకు మోముఁ ద్రిప్పుగతి
నంచల రాఁ జెలిఁబిల్చురీతి రా
చిలుకకుఁ బండ్లుగోయుక్రియఁ
జిత్రగృహంబుననుండి పోవుచున్
సొలపున నీవు నన్మరలి
చూడఁ ద్రిశుద్ధిగ నేలితంచు నే
నలరితిఁగాని భావజుని
కగ్గముసేయు టెఱుంగఁగోమలీ.

ఆ. గురునిగుణ మురోజగిరులు గాంచినఁగాంచుఁ
గాక నీమనంబు గాంచనేల
తల్లికుటిలవృత్తి తగుఁగాక కురులకు
నింత నీదుచెయ్వు లెనయనేల.

ఈవిరహధోరణిలో ఉన్నతాదర్శము లేదు. చేతనాచేతన వివేకము లేదు. కామాంధకారులకు చేతనాచేతనవివేకము లేకుండుట సహజమందురేమో! అట్లని నిరవధికముగ చేయవచ్చునా? అవయవపరిష్వంగాభిలాష ఉత్తమనాయకాదర్శము కాదు. పవిత్రప్రేమాస్వాదనము, తదనుభవమే ఉత్తమనాయకుని ఆదర్శము. నాయికచెయ్వులలో కుటిలవృత్తికలదని నాయకునిచే దూషింపజేయుట విచారకరము. ఇది శ్లేషవలన వచ్చిన అనర్థకము. ఈవిషయమును శ్లేషవిమర్శనలో వివరించెదను.

## నాయిక

నాయిక గిరికాదేవి, రూపవతి; లావణ్యవతి; వ్రీడావతి; రసికురాలు; ఇష్టవస్తునిరీక్షణవ్యాజమున మనోభావవ్యక్తీకరణ మొనర్చిన చతుర; కాని ధీరస్వాంతకాదు. అకారణశోకసంతప్తహృదయ. వసురాజుమీది విరహవేదన సహింపలేక చూతపుష్పా

ఘ్రాణమున దేహము విసర్జింపదలచినది. చంద్రాతపమున కోర్వలేక ఎటు లేడ్చినదో చూడుడు:

శా. ఆజాబిల్లి వెలుంగు వెల్లికల డా
  యన్ లేక రాకానిశా
రాజశ్రీసఖమైన మోమునఁ బటా
  గ్రంబొత్తి యెల్గెత్తి యా
రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూ
  రాజత్కరాంభోజకాం
భోజీమేళ విపంచికా, రవసుధా
  పూరంబు తోరంబుగాన్.

ఈయేడుపు ఎంతవరకు సమంజసమో తెలుపుటకు మనుచరిత్రలో వరూధిని యేడుపువిధము వివరించుటావశ్యకము. ఆపద్యము గనుడు:

ఉ. పాటున కింతులోర్తురె కృ
  పారహితాత్మక! నీవు త్రోవ ని
చ్చోటఁ భవన్ముఖాంకురము
  సోఁకెఁ గనుంగొనుమంచుఁజూపి య
ప్పాటలగంధి వేదననెపం బిడి
  యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచను
  మిట్టల నశ్రులు చిందువందఁగన్.

ఇక్కడ వరూధిని యేడ్చుటకు దగినకారణమున్నది. నిజమనోరథభగ్నయై ప్రవరునిచే త్రోపువడినది. కోరిక నిష్ఫలముకాగా అవమానము పొందినది. అట్టి సందర్భములో ఎట్టిధీరస్వాంతకైనను ఏడ్పువచ్చుట సహజము; స్వాభావికము. వరూధినియవస్థ దిలకించిన పాఠకులకు అనుకంప జనించును. కాని గిరికశోకము కృత్రిమము. అకారణమనోవ్యథాసంజనితము. తెచ్చుకోలు ఏడ్పనిన సమంజసము. ఎలుగెత్తి యేడువవలసినకారణము మృగ్యము. అనురాగవిచ్ఛిత్తి లేదు. ప్రియునిప్రేమాభావసూచనలు లేవు. కోరికలేమి భగ్నములుకాలేదు. అవమానము పొందలేదు. ఇక కారణమేమనిన కామపీడితయై చంద్రాతపమున కోర్వలేకపోవుటయే. ఇది ధీరాలక్షణముకాదు. మనుచరిత్రలో వరూధిని యేడ్చినట్లు పెద్దన వర్ణించెను గనుక రామరాజభూషణుడు కూడ యేడుపును వర్ణించుచు పద్యము వ్రాయదలచెను. గిరిక యేడువవలసినతావు మరెక్కడ తోచలేదు. అందువలన చంద్రాతపమునకు తాళజాలక యేడ్చెనని వర్ణించి ఉత్తమనాయిక కుండవలసినధీరలక్షణమును కవి విస్మరించెను. ఆశోకమును కాంభోజీరాగసమ్మిళితము చేసెను. ఏడుపుకూడా రాగసరళితో స్వరయుక్తముగ నుండునుకాబోలు. వరూధినియేడ్పులో రాగములేదు. స్వాభావికము.

విదూషకుడు

విదూషకుడు కడునేర్పరి. యజమానునిమనోవృత్తి గుర్తెరింగినవాడు. సమయస్ఫూర్తి కలవాడు. కోలాహలమున వీణారవము వసురాజుచిత్తవృత్తి నేవిధముగ మార్చినదో కనిపెట్టి మునివేషధారియై గిరికావృత్తాంత మరసిన నేర్పరి. వారిమధ్య కడుమెలకువతో మెలగి అనుమానమున కేమాత్రము తావిచ్చినవాడు కాడయ్యెను. ఆస్త్రీలుచేయు సంగీతశాస్త్రప్రశంసలో 'యతి' యను అక్షరసామ్యము నాధారముగగొని, వారిమధ్యకువచ్చి చమత్కారముగ మంజువాణిని ప్రశంసించి తనయందు వారికి భక్తికుదురునట్లు చేసికొనెను. వారి నెటుల ప్రశంసలోనికి దింపెనో చూడుడు:

ఉ. మేలుఁ లతాంగి! నీపలుకు
  మెచ్చితి నే యతివచ్చుజాడ యే
లీల నెఱింగితమ్మ బహు
  శీకృతచాతురిమించు నీవిపం
చీలలితారవామృతము
  చిత్తముసోఁకినవార లీకళా
శాలిని జూచి దీవన లొ
  సంగక పోవుదురమ్మ నావుడున్.

తాను వారిని దీవించి శుభము చేకూర్చుటకు వచ్చినట్లు తెలియజేసి తనయందు వారికి పూజ్యభావము కలుగునట్లుచేసెను. చివరరెండుపాదములు వసురాజును మనసులోనుంచికొని పలికినమాటలు. వసురాజు వచ్చిన తరువాత తానువెళ్లి నిజరూపముతో మరల ప్రవేశించుట చాల సమంజసముగ నున్నది. అప్పుడు ఆరెండు పాదములయర్థము ఆస్త్రీలకు వ్యక్తమైనది. వసురాజునకు గిరికయందనురాగమేర్పడి నర్మసచివుని బంపినటుల వారికి వెల్లడియైనది. ఇది ప్రేమబీజమునకు మూలాధారము.

## మంజువాణి

ఈమె గిరిక చెలికత్తెలలో నుత్తమురాలు. మాయా మునికి గిరికవృత్తాంతము తెలియజేసిన చతురసంభాషిణి.

చ. అనుపమభాగ్యలక్షణసమన్విత
యీరమణీలలామ యీ
మనసిజరాజరాజ్యరమ
మానసవీథిఁ దలంప సింధునం
దన యచలేంద్రనందన యనం
గనవయ్యెడి నీలతాంగి పా
వనకులగోత్రభూమి చెలువా!
చెలువారఁగఁ దెల్పవే యనన్.

అని గిరికను జూపించుచు ముని యడుగ మంజువాణి చాతుర్యము మెరయ నిచ్చిన ప్రత్యుత్తరము గనుడు:

చ. అనుపమభాగ్యలక్షణస
మన్విత యీరమణీలలామ యీ
మనసిజరాజరాజ్యరమ
మానసవీథిఁ దలంప సింధునం
దన యచలేంద్రనందన య
నం గనవయ్యెడి నంచు నిట్లు పే
ర్కొని యను గ్రమ్మఱం దెలియఁ
గోరుట కూరిమిఁ బెంపునం గదా.

వసురాజవివేకముతో గిరికాదేవిని దూరుచుండ పకపకనవ్వి యేవిధముగ ప్రౌఢిమమీర ప్రత్యుత్తర మొసగినదో చూడుడు:

శా. మాయాశీలురు చంచలాత్ములనుకం
పాశూన్యులాత్మైకకా
ర్యాయత్తుల్ సమయానుకూలహృదయ
వ్యాపారగోపాయనో
పాయజ్ఞుల్ మగవార లాపయి మహీ
పాలుర్ మహావైభవ
శ్రీయోగాంధులు చెప్ప నేల మగవా
రిన్ నమ్మగావచ్చునే

ఈమె కార్యనిర్వహణమున అత్యంతనిపుణురాలు. గిరికావసురాజులకు తాపోపశమనమును గావించునది.

## అనౌచిత్యములు

రెండుమూడుచోటుల అనౌచిత్యములు కనబడుచున్నవి. వసురాజు పనుప విదూషకు డేగి రత్నఖచిత హర్మ్యాంతర్భాగమున వీణవాయించుచున్న గిరికను పొదచాటుననుండి చూచి రాజున కావృత్తాంత మెరిగించ వచ్చెను. ఇంతవరకు బాగుగనేయున్నది. అటులవచ్చి తానొక సుందరస్త్రీని చూచివచ్చితినని చెప్పిన నెంత బాగుండెడిది! కాని కవి ఆవిధముగ తృప్తినొంది ఔచిత్యమును బాటింప దలచుకొనలేదు. విదూషకుని వాక్సహాయ మాలంబనముగ గొని గిరికావర్ణన ప్రారంభించెను. ఆనఖ శిఖాపర్యంతము ప్రత్యవయవవర్ణన. విదూషకు డీయవయవవర్ణన మెట్లు చేయగలిగెనా యని సందేహము కలుగకపోదు. ఆమెపాదమున పద్మరేఖలున్నటుల వీనికి దెలియు టెట్లు? ఆమె ఊరుప్రదేశము కటిభాగము జఘనము నాభి ఇనన్నియు నెట్లువర్ణింపగలిగెను? ఇది అసంభవము. మరియొక విశేషము. విదూషకుడేమిటి? రాజుతో ఈవిధముగ వర్ణనచేయుచు చెప్పుట యేమిటి? రాజునకు నర్మసఖుడేయగుకాక. వానికి భార్యకాబోవు యువతినా ఈవిధముగ వర్ణించుట? విదూషకు డావిధముగ వర్ణన పైవర్ణనలు గుప్పించుచుండ రాజు విని ఆనందించుచుండెనా? ఎంత అనౌచిత్యము! వసురాజంతవానికి భార్యకాబోవు గిరికాదేవి, ఉత్తమనాయిక, ఈవిధముగ మానహీనురాలగుట యేనా? ఆమెమానము, లజ్జ, సౌభాగ్యము, ఈవిధముగ తుచ్ఛవర్ణనపాలు చేయుటయేనా? నాయికను ఈవిధముగ దిగంబరగా బహిరంగపరచుటయే కావ్యలక్షణమా? ఇదంతయు వసురాజున కామె సుందరియని దృఢపరచుటకేకదా! అట్టిచో ఆమె చాల చక్కనిదని లావణ్యమును వర్ణించి వసురాజును దోడ్కొనివెళ్లిన నెంతయో యుచితముగనుండెడిది. చక్కదనమును వర్ణించుటకు నఖశిఖాపర్యంతము ప్రత్యవయవవర్ణన మవసరమా! మనుచరిత్రలో వరూధినిని పెద్దన యేవిధముగ ఒక్కపద్యములో వర్ణించినాడో చూడుడు:

మ. అతఁ డా ప్రాతపరంపరాపరిమళ
వ్యాపారలీలన్ జనా

న్వితమిచ్చోటని చేరంబోయి కనియెన్
విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురన్
జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొకమరు
న్నారీశిరోరత్నమున్.

ఇక్కడ కవియే స్వయముగ వర్ణించుచున్నాడు. విదూషకుడు రాజుతో చెప్పుచున్నట్టుల ఇక్కడ వరూధిని సౌందర్యమునుగురించి ఒకరితో మరియొకరు చెప్పుటలేదు. పెద్దన చేయదలచుకొన్న యెడల నఖశిఖా పర్యంతము వర్ణనచేయుటకు వీలున్నది. కాని అట్లుచేయ లేదు. ఈయొక్కపద్యముతోనే వరూధిని మహాసౌందర్య వతియని స్పష్టపరిచెను. కావలసిన దంతియే. అంతకన్న మిక్కిలి అనవసరము. రామరాజభూషణునిదృష్టి సభ్యత్వాసభ్యత్వవివేచనమీద లేదు. గిరికను వర్ణించ సంకల్పించుకొనెను. ఆసంకల్పములో అక్కడ విదూషకుడు రాజుతో ప్రసంగించుచుండె నను విషయము విస్మరించెను. కవిదృక్పథమున విదూషకుడుగాని రాజుగాని లేరు. ఒక్కగిరికాస్వరూపమే ప్రత్యక్షమగుచుండెను. తన మనోదృష్టి ఆస్వరూపముమీదనే తదేక ధ్యానముతో నిలిపి ఆమెను దిగంబరరూపిణిగాకూడ నూహించి తుచ్ఛవర్ణన చేసెను.

గిరికాదేవిమీద వసురాజున కేమాత్ర మనురాగ మున్నదో కనుగొనివచ్చుటకై మంజువాణి వెళ్లి రాజిచ్చిన అంగుళీయకము తీసికొని తిరిగివచ్చెను. మంజువాణి వచ్చుటకు ఆలస్యమైనదని గిరికచెలికత్తెలు అత్యంతాతురముతో నెదురుచూచుచుండిరి. వృత్తాంత మారయ మహోత్కంఠతో నుండిరి. మంజువాణి దృగ్గోచరము కావడముతో ఆతురత హెచ్చుట సహజము. సమాచార మేవిధముగనుండునోయని మనసులో ఆందోళన. ఇట్టి స్థితిలో గిరికయు ఆమె చెలికత్తెలుకూడ నుండిరి. ఎట్టకేలకు మంజువాణివచ్చినది. రావడముతోనే తనకార్యఫల సంసిద్ధిగురించి ఒకటిరెండుమాటలలో చెప్పినదా? లేదు. శ్లేషవర్ణనలతో పెద్దకథ మొదలుపెట్టినది. తన ఆకాశ గమనము, దృక్ప్రదర్శనములు, మార్గాయాసముచే విశ్రాంతి గొనుట, పురప్రవేశవిధానము, నగరవర్ణనము, హర్మ్యవీముల అందచందములు, కోటలు, అగడ్తలు, బురుజులు, అటునిటుతారాడు విటసముదాయవర్ణనలు, ఇవి యవి యననేల — లెక్కలేవన్ని చెప్పినది. తాను రాజాంతఃపురప్రవేశ మొనర్చినతరువాత యెంతవర్ణన చేసినది! దేవతాస్త్రీల హాస్యప్రసంగములు వర్ణించినది. తరువాత అక్కడనున్న రాజమందిరవర్ణన ప్రారంభించినది. రత్నమణిమయధావళ్యముచే తా నేవిధముగ విభ్రాంతికి లోనైనదియు వర్ణించినది. ఈవర్ణనము లన్నియు దేనికి? ఆ సమయమునగిరికాహృదయము ఈవర్ణనలకొరకు తహతహలాడుచుండెనా? ఆమె కప్పుడు కావలసినదిఒక్కటేమాట. వసురాజు తనయందనురక్తుడైయుండె ననువిషయము: కాని, ఆవిషయము ఈవర్ణనలన్నియు పూర్తియైనతరువాతగాని తెలియదు. రుక్మిణిచే కృష్ణునియొద్దకు పంపబడిన అగ్నిద్యోతనుడు తిరిగివచ్చి తనకొరకై యెదురుచూచుచున్న రుక్మిణికి ప్రథమముననే తెలిపినవృత్తాంత మెంత యుచితముగా నున్నది! తనమార్గాయాసవర్ణనలు, ద్వారకానగరవర్ణనలు, కృష్ణమందిరవర్ణనలు, కృష్ణుని వర్ణనలు మొదలగువానితో రుక్మిణి హృదయాందోళనమును హెచ్చుచేయలేదు. అప్పుడు రుక్మిణికి కావలసినవి అవి కావు. కృష్ణుడువచ్చెనా! లేదా! అను సందేహనివృత్తియే. ఆ సందేహనివృత్తికొరకే పోతనమహాకవి "మెచ్చె" "వచ్చె" అను రమ్యమై హృదయతాపనివారణ శక్తియుతములగు రెండు దివ్యపదములను ప్రయోగించెను. మొదటిపదముతో హృదయము కుదుటబడెను. రెండవ దానితో మహానందమొదవెను. ఆపద్యమునే ఉదాహరించిన అందుగల సారస్యము తెలియును. చూడుడు:

ఉ. మెచ్చె భవద్గుణోన్నతి
కమేయఘనావళు లిచ్చె నాకుఁ దా
వచ్చె సుదర్శనాయుధుఁడు
వాఁడె సురాసురులెల్ల నడ్డమై
వచ్చిననైన రాక్షసవివా
హమునం గొనిపోవు నిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును
సర్వము నేఁడు ఫలించెఁ గన్యకా!

గిరికాదేవి వర్ణనచేయుతలంపున ఏవిధముగ అసభ్యమార్గమున పడిరియో ఇక్కడకూడ కవి అదేమార్గ

యవలంబించెను. కవిదృష్టిలో గిరికకాని ఆమె చెలికత్తెలు కాని మంజువాణికాని లేరు. తా నేరంగమున నున్నదియు గూడ విస్మరించెను. ఇక కవి దృక్పథమున నున్నవి మంజువాణి ఆకాశగమనము, వసురాజునగరము, ఆతని అంతఃపురము; ఆ వర్ణనలన్నియు పూర్తియైవరకు పాత్రగాని ప్రస్తుతరంగము స్మరణకురాలేదు. అప్పుడు రాజుయొక్క అనురాగమును బయలుపెట్టెను. మంజువాణి ప్రథమమున నే గిరికమీద రాజునకున్న అనురాగమును తెలియజెప్పి ఆపైన వినోదార్థముగ పైవిషయములన్నియు వర్ణించిన నెంతయో బాగుండెడిది. అప్పు డటులు వర్ణించుటకూడ ఔచిత్యముగ నుండెడిది. తొలి వసురాజిచ్చిన అంగుళీయక మూహామునపైన ప్రథమమున గిరికకు వసురాజానురాగము స్ఫురింపజేసినదేమోయన అట్లులకూడ కనబడుట లేదు. వచ్చుటతోడనే మంజువాణి అంగుళీయకమును గిరిక యెదుట పెట్టినట్లుమాత్రము కవి చెప్పెను. అంగుళీయకమును వసురాజుదని పాఠకులకును మంజువాణికినిమాత్రము తెలియునుగాని గిరికకుగాని ఆమె చెలికత్తెకుగాని తెలియదు. మంజువాణి తనవృత్తాంతమంతయు ముగించిన పిదప అంగుళీయకమును దీసి గిరికచేతి కిచ్చినటులున్నది. అప్పుడు దానిమీదనున్న వసునామము చూచి గిరిక సంభ్రమ మొందెను. అంతవరకు దానిని గిరిక చూచినట్లే లేదు.

వసురాజు కోలాహలుని గోటమీటి అవమానపరిచెను. తనను పాదాక్రాంతునిగా జేసికొనెను. ఈవిషయము మరలమరల కావ్యమును ప్రశంసచేయుట అనుచితముగ కనబడుచున్నది. కోలాహలుడు రాజునకు మామగారు కాబోవుచున్నాడు. అట్టిసమయములోగూడ ఈ బిరుదును వసురాజునకు వాడుట సమంజసముగా లేదు. గిరిక గంగకుత్రయొక్క "చరణాగ్రానమితాచలేశ్వరుని" చే పట్టుమని దీవించినది. "చరణాగ్రానమితాచలేంద్రుడైన" వసురాజునకు నీకుమార్తె నీయుమని ఇంద్రుడు కోలాహలుని అడిగెను. ఈరెండుచోటులను శ్లేష ననుసరించి పాదాక్రాంతులైనశత్రురాజులుగలవసురాజని యర్థము. చేసికొని తృప్తివహించుదమనుకొన్నను ఇంద్రుడు మరల కోలాహలునితో నేమనుచున్నాడో చూడుడు: "చేద స్ఫూర్జరపావకంజకృత ఖంజీభావమ్ము జెందు నీఖేదం బాశ్వగగద్గై నీతవయు" 'గోరుచుట్టుపై రోకటిపోటను నట్లు పరిభవానలసంతప్తుడైనవానికి దత్కారణవిషయ ప్రశంస మరలమరల చేయుట భావ్యముకాదు. బాంధవ్య సందర్భమున ఇది విస్మరింపవలసినవిషయము. వసురాజునకు కోలాహలుడు పూజ్యుడు కాబోవుతరుణమున ఈవిషయప్రశంసచేయుట అనుచితము. గిరిక మనసు ఎంతనొచ్చుకొనునో కవి కనిపెట్టలేదు. తనజనకుని అవమానమునకును సంతాపమునకును కారణభూతుడైన వసురాజునా తానుచేపట్టబోవుట! అందులో దన్ను ఆశీర్వదించువారు 'నీతండ్రిని అవమానపరిచినవానిని వివాహమాడు'మనిదీవించుచుండ ఇంతకంటె హృదయవిదారణము పాప మాగిరిక కేమియుండును? గిరికకీవిషయమే తెలియకుండజేసిన నెంతయో బాగుండెడిది. అటులుకాక తత్సంబంధమైన బిరుదావళితో వసురాజును బెండ్లికొడుకుగా నిర్ణయించుట చాలఅనుచితముగ నున్నది.

## శ్లేషవిమర్శ.

వసుచరిత్ర శ్లేషకావ్యము. కావ్యమంతయు శ్లేషగా రచియింపవలయునని ప్రతిజ్ఞపట్టాని వ్రాసినట్లు కనబడుచున్నది. అందువలన అవసరానవసరములుగాని ఉచితానుచితములుగాని కవి పాటింపలేదు. ఒకచోటమాత్రము శ్లేష అవసరమై మనోహరముగ నున్నది. విదూషకుడు మునివేషధారియై గిరికావృత్తాంతమరయుసందర్భమున తనవృత్తాంతమును శ్లేషతో వివరించెను. ప్రతివిషయము సూర్యపరముగాను రాజుపరముగాను అన్వయించునట్లు తనచరిత్రము అసత్యప్రమాదమునకు లోనుగాకుండునట్లు చేసెను. విదూషకుడు అసత్యప్రలాపియను నభిప్రాయము పాఠకులకు కలుగకుండునట్లును గిరిక మొదలైనవారికతడు నిజమైన ఋషియేయని నమ్మకము జనించునట్లును శ్లేషసాహాయ్యమున కవి ఈఘట్టమును రమ్యముగ బోషించెను. కావ్యమున మిగిలిన శ్లేషయంతయు అనవసరము. కొన్నిచోట్ల అనుచితము. ఈశ్లేషమాహాత్మ్యమువలన కవిదృష్టిలో గిరికాదేవి ఒకప్పుడు కొండగాను ఒకప్పుడు నదిగాను ఒకప్పుడు అరణ్యముగాను ఒకప్పుడు రాత్రిముగాను వివిధరూపములుగ మారిపోయినది. శ్లేషకొరకై శుక్తిమతిని కుటిలగామినిగాను హేయస్వరూపిణినిగాను వర్ణింపవలసివచ్చినది.

గిరికాదేవిని సైతము కుటిలవృత్తికలదానినిగా వర్ణించ వలసివచ్చెను. వసురాజావిరహావేదనలో గిరికాచిత్రఫలకమును వీక్షించుచు ఏమనుచున్నాడో చూడుడు:

ఆ. గురునితంబ మురోజగిరులు గాంచినఁగాంచుఁ
గాక నీమనంబు గాంచనేల?
తల్లికుటిలవృత్తి తగుఁగాక కుటిలకు
నింత వీదుచెయ్వు లెనయ నేల?

గిరికతల్లి శుక్తిమతి కుటిలగామినిగనుక — అనగా వంకరటింకరగ ప్రవహించునది గనుక — అదిసామ్యముగ గొని గిరికకురులు ఆవిధముగ మెలికలుతిరిగినవని చెప్పుచు ఆకుటిలత్వమును ఆమెప్రవర్తనను గూడ ఆరోపించెను. కుటిలత్వము నీకురులకుండినను డు గాక నీనుచేష్టలుకూడ అట్టికుటిలత్వము నేల పొందవలయునని వసురాజు తలపోయుట గిరికాదేవిప్రవర్తన కల్మషపూరితమని ధ్వనించుచున్నది. ప్రియురాలు అనర్హప్రవర్తకురాలైన ప్రియుని హృదయ మేవిధముగ పరితాపమునొందునో వసురాజావిధముగ పరితపించుట చాల అనుచితము. కవి శ్లేషవ్యామోహమున నిమగ్నుడై ఈవిషయములను గమనింపకుండుట విచారకరము.

## శబ్దవైచిత్ర్యము

కవి శబ్దప్రయోగము ధారాళము. నడక సొంపుగ నుండును. ఒకటిరెండుపద్యము లుదాహరించెదను:

సీ. తలిరుఁబ్రాయమువాని వలరాజు నలరాజు
నలరాజుఁ దెగడు సోయగమువాని
పసిఁడిఛాయలవానిఁ బగడంబు జగడంబు
జగడంబుగలమోవి సొగసువాని
తళుకుఁజెక్కులవానిఁ దులకింపు పలుకెంపు
పలుకెంపులొలయు నవ్వొలుకువాని
చికిలిచూపులవాని సిరిమించుదొరయించు
దొరయించు కాంచనాంబరమువాని
నొఁఅపుగలవాని మకుటకేయూరహార
కటకకుండలచాకచక్యములవాని
నమ్మహీజానిఁ గని లేచి యమితవినయ
సంభ్రమము తోప నిలిచి రబ్జాతముఖులు.

సీ. ఈరాలఁబోరాదు హీరాళము జవాది
యీరాలనకుచక్కి నేఁగవలయు
నాకాన నేకాల మడరుఁ దేనియవాన
లాకాన నేర్పున నరుగవలయు
నీవంక నేవంక నెనసినతుహినాంబు
లీవంకఁ బూఁదెప్ప నీఁదవలయు
నామూల ననుమూలరామొత్తములచరు
లామూలముగఁ దీవ లంటవలయుఁ
అధిప యదిమానికపుగోన యది లతాంత
రజముసారువ యదికప్పురంపుటనఁటి
చప్పరంబులు యదికొంత సదన మనుచు
నరపతికిఁ దెల్పె నరుగుచో నర్మసఖుఁడు.

క. ఏమంద మేమిసేయుద
మేమందని మరదలింత మేమందమె యిం
దేమందయాన నడుగుద
మేమందరమనుచుఁ దరళహృదయాంబుజలై.

కాని ఈపద్యములలో సహజమాధుర్యము లేదు. పదాడంబరము పదములపొందికమాత్రము కలదు. పదములు భావమును మరుగుపరచుచున్నవి. భావము పరిస్ఫుటముగ నున్న ఈపద్యము గనుడు:

శా. ఏమే హేమలతా యటంచుఁ
బనియేమే మాధవీ యంచు నీ
భామామన్మథుచంద మెట్లనుచుఁ జె
ప్పంజాల భూపాలు డా
రామక్షోణికిఁ జన్న నాఁటఁగోలె ని
ద్రాసౌఖ్యముల్ మానినాఁ
డేమోయంచు వచింప వింటిఁ దమలో
నేకాంత వీలాగతిన్.

## ఉత్ప్రేక్ష : వర్ణనలు

కవి ఉత్ప్రేక్షాశక్తి అత్యద్భుతము; నిరవధికము; వర్ణనాతీతము. స్వల్పవిషయములను వర్ణించునప్పుడు సైతము ఎంతయో భావము నుద్దీపింపజేయును. అతీత ప్రతిభావిశేషము ప్రతిపద్యమునను వెల్లడియగుచుండును. ఈ క్రిందిపద్యములు చూడుడు:

మ. అలినీలాలక! కంటె చిల్కా భవదీ
యాలాపలీలా ప్తి నిం

పలరం గోరి విపక్వదాడిమతరు
వ్యాలంబి శాఖాఫల
జ్వలనావాఙ్ముఖమై తపంబుసవరిం
పఁ జాగె నే లబ్బెడిం
దల క్రిందైన ననూనవాగ్గ్రహణమే
ధాళ త్తి బింబాళికిన్.

శా. నానాసూనవితానవాసనల నా
నందించుసారంగ మే
లా నన్నొల్లఁ దటంచు గంధఫలి బ
ల్కాఁకం దపంబంది యో
షానాసాకృతిఁ బూని సర్వసుమన
స్సౌరభ్యసంవాసమై
పూనెం బ్రేక్షణమాలికా మధుకరీ
పుంజంబు నిర్వంకలన్.

ప్రకృతి వర్ణనాసామర్థ్య మీ పద్యములలో చూడుడు:

మ. నటదీశానశిర స్తటత్రుటితర
త్నచ్ఛాయఁగల్లోలినీ
వికటమగ్యంబున వ్రాలె నభ్రమణి త
ద్వేగాభిపాతోన్నమ
త్పటుపాథోలవతార ధార లెగసెన్
దద్బిందుసంధానితో
త్కటసంధ్యానలధూమకందళములై
కన్పట్టెఁ గ్రొంజీఁకటుల్.

మ. అరవిందోదరమూర్తి భానుఁడపు దూ
షాంతంబుగా సంతుచ
త్సరసీజేక్షణుఁడై పయోనిధిఁ జొరన్
సంధ్యాతటిత్పూర్వమై
నెరసెం జీఁకటికార్మొగుల్ జగతిపై
నిమ్నోన్నతాభోగముల్
సరిగావించుచు సర్వతోముఖమహా
సారప్రసారంబులన్.

శా. తారాసస్యము పండినన్ గగనకే
దారంబునం జంద్రికా
నీరం బారఁగఁ గోసి తద్రుచిఫలా
నీకంబు ప్రాతర్మహా
సీరిగ్రామణి తూరుపెత్తెననఁ దోఁ
చెం దూర్పునం దెల్ప ద
ద్దూరన్యస్తపలాలరాశిక్రియ నిం
దుం డేఁగె నిస్సారుఁడై.

# ప్రేమమహత్త్వము

జంధ్యాల శివన్నశాస్త్రి గారు

ఇద్దరిని నేను నద్దరి నీవు నడుమ
మన కపార పారావార మెనయుచుండె
నిన్నుఁగలియుట పొంటె నాచిన్నినావ
వదలితిని నాకొకింతయు భయములేదు.

౨. భయపరిధి కుంచితము ప్రేమపరిధి విస్తృ
తము నగుట నద్ది యిందులో నిమిడిపోవు
సూక్ష్మదర్శిని ధరియించి చూడ దృశ్య
వస్తు వది వేఱురీతిఁ గన్పడినయట్లు
ప్రేమయను దివ్యదృష్టికి వివిధవస్తు
తతియు స్వకీయరూపమ్ము దాల్చుచుండు
విశ్వసందర్శనమ్మున భీతి యడఁగు.

౩. నడచుచున్నది ముందుకు నాదునావ
పెద్దయోడల నేన్ ముంచివేయునట్టి
తరఁగలే నాదునావ భద్రముగఁ దోసి
కొనుచు ముందుకుఁబోవనుక్షణము నేను
దూరమును బాసి నీదరిఁ జేరుచుంటి.



# భగవదజ్జుకము

ప్రహసనము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

[గతసంచిక తరువాయి]

(యమపురుషుఁడు ప్రవేశించి)

యమ—ఓహో!

మ. జ్వర గర్భస్రవ కర్ణశూల *పిటక
శ్వాసక్షయాక్షి వ్యథో,
దరగుల్మాది విశేషభీషణరుజా
తంకమ్ముచే, నింక దు,
ర్భరసంక్షోభ చయమ్ముచేత, బహుజీ
వవ్రాతముల్ నేనహో,
ధరణిం బాచితి, నింతలో, యమపుర
ద్వారమ్మునం ద్రోచితిన్.

ఇదిగో! మఱియు నేనింతలో స్వాములవారి యనుజ్ఞను పొందుదును. (వేశ్యను చేరఁబోయి) స్వామీ! వృషలీశరీరమును విడువఁ గోరుచున్నాను.

గణి—అట్లే విడుచుచున్నాను.

యమ—వేశ్యాప్రాణములను యథాస్థానమున
కుమార్చి నేనునునాపనిమీఁదఁబోయెదను.

(అట్లుచేసి నిష్క్రమించును)

పరి—శాండిల్యా! శాండిల్యా!

శాండి—ఇదుగో! స్వాములవారు మామూలు
స్థితికి వచ్చారు!

గణి—పరభృతికా! పరభృతికా!

చేటి—ఇదుగో! ఇప్పుడు అజ్జుక మామూలు
మాదిరిగా పిలుస్తున్నది!

మాత—అమ్మా, వసంతసేనా!

రామి—ఆహా, నా ప్రియురాలు వసంతసేన
ఇపుడు తెప్పరిల్లి తేఱుకొన్నది!

(గణిక, రామిలకుఁడు, చేటికలు, తల్లి, వెళ్లుదురు)

శాండి—స్వామీ! ఏమిది!?

పరి—ఈకథ మిక్కిలి పెద్దది. మఠమునకరిగిన
వెనుకఁ దెలిపెదను. (దిక్కులుచూచి)
అహస్సెల్లఁ గడచినది. ఇప్పుడు:

గీ. అస్తమిలుచుండె రవి యదే యపరదిశను
మూసఁగ్రాఁగిన బంగారుముద్దవోలె;
తత్ప్రభలవెల్గుమేఘబృందములచే, న
భమ్ముదోఁచెడు నగ్నిగర్భమ్మువోలె.

(నిష్క్రమించిరి.)

గీ. జగతికెల్ల మేలు సమకూరుగా, కన్య
హితము భూతగణము వెతకుఁగాక!
తొలఁగిపోవుఁగాక దోషమ్ము లెందును
జనుల కెపుడు సుఖము జరుగుఁగాక!

# తోడిమ

భగవదజ్జుక ప్రహసనపుష్పమున పరిమళము గొనువారీ తోడిమతో దానిం బరిగ్రహింతురు గాక!

గ్రంథకర్త

భగవదజ్జుకమని పేరుగల యీ ప్రహసనమునకుం గర్తయెవ్వరో గుర్తించుటకు మూలగ్రంథమున నాధారము గానరాదు. కాని దాని వ్యాఖ్యాత (పూర్ణసరస్వతి కావచ్చును. ఈయన మేఘసందేశమాలతీమాధవాదులకును వ్యాఖ్యాత.) మూలగ్రంథికర్త బోధాయనుండని పేర్కొన్నాఁడు. వ్యాఖ్యారంభమున,—

శ్లో. బోధాయనకవిరచితే
విఖ్యాతే భగవదజ్జుకాభిహితే,
అభినేయేఽతిగభీరే
విశదాం నధునా కరోమి గ్రంథార్థాన్.

అంతమున,

శ్లో. ఇతి ప్రహసనాభిఖ్యే
పూర్వనాట్య నిబంధనే,
హాస్యగ్రాహిత తత్త్వార్థే
టీకా దిక్తత్త్వదర్శినీ.

శ్లో. యశ్చాసౌ భవభూతి సూక్తి జలధే
రర్ఘో ఘ యాదోగణ
ప్రక్షోభోత్థిత భీతిభంజనకరీం
వ్యాఖ్యాతరీం నిర్మమే;
తేనేయం విమమేతివృత్తగహనే
బౌధాయనీయే పున
ర్మాత్స్య గర్భిత శాస్త్ర జృంభిత వచో
గంభీరగుంభే కృతా.

ఒక మూలగ్రంథము ప్రతిలో నిదికలదు:

శ్లో. బోధాయనకవిరచితం
బోధాయతనం విముక్తి శాస్త్రాణామ్;
ప్రహసనరత్నం ప్రత్నం
భవతు ముదే భగవదజ్జుకీయం వః.

వరరుచి పాణిన్యాదు లగు మునులు కొందఱు శాస్త్రకారులే కాక కావ్యకర్తలు గూడ నయియుండిరి. వారినిం బ్రాచీనకవులు కవులనుగా స్తుతించిరి. వారి గ్రంథములనుండి కొన్ని శ్లోకములనుగూడఁ బ్రాచీనాలంకారికు లలంకార గ్రంథములం దుదాహరించిరి. వారి గ్రంథములును గొన్ని యిప్పుడు దొరకి యున్నవి. బోధాయనమహర్షి కూడ నట్లు కావ్యకర్తయై యుండవచ్చును. మహర్షి యగు బోధాయనుం డిట్టి ప్రహసనము రచించెననుట ప్రత్యయితవ్యము గాదని కొందఱందురు. వరరుచిరచియించిన యుభయాభిసారికను వా రెఱుంగుదురు. శ్యామిలకుండు పాదతాడితకమం దిట్లు చెప్పినాఁడు:

శ్లో. న ప్రాప్నువంతి యతయో రుదితేన మోక్షం
స్వర్గాయతిం న పరిహాసకథా రుణద్ధి;
తస్మాత్ప్రతీత మనసా హసితవ్యమేవ
వృత్తిం బుధేన ఖలు కౌరుకుచీం(?) విహాయ.

(యతులై యేడ్చుచుఁ గూర్చున్నందువలన మోక్షమురాదు. పరిహాసకథ స్వర్గలాభమును జెడఁగొట్టదు. ప్రాజ్ఞుఁడు కచకుచాదులపై నభిరుచిని జెందరాదు గాని హసించుచునే యుండవలెను.)

శ్రీ రామానుజులవారు తమ బ్రహ్మసూత్రభాష్యమునకు మూలకల్పమని పేర్కొన్న బ్రహ్మసూత్రవృత్తిని (ఇది యిప్పుడు కానరాదు.) రచించిన బోధాయన మహర్షియు, గృహ్యసూత్రాదికర్తయగు బోధాయనమహర్షియు (ఇద్దఱు నొక్కరగుదురో కారో!) మనయెఱుక కందియున్నారు. విష్ణుపారమ్యమును, బ్రపత్తి ప్రాధాన్యమును, జెప్పు రామానుజమతమునకు మూలాధారమయిన యీ బ్రహ్మసూత్రవృత్తిని రచించిన బోధాయనుఁడీ ప్రహసనకర్తయగు ననుట యొప్పిదముగా నాకుఁదోఁపదు. ఈ ప్రహసనమున "త్వాం పాతు...రుద్రస్య సదర్చితః పాదః"అని నాంది యున్నది; యోగదర్శనమునకుఁ బ్రాముఖ్యము ప్రతిపాదితమయినది; విశిష్టాద్వైత సిద్ధాంత వాసనకూడఁ గానరాదు. కల్పసూత్రకారుఁడుగూడ నీగ్రంథకారుఁడుగాఁగూడదనియే నా తలఁపు. ఆయన ప్రతిపాదించు శాంతికపౌష్టిక శ్రౌతకర్మ ప్రాధాన్య మిందుఁ గానరాదు.

ప్రాచీనకవులు కొందఱు బోధాయనునిఁ గూడఁ గవిగాఁ బ్రస్తుతించిరి. రఘువీరచరితమను నాటకమును రచించిన సుకుమారకవి తననాటకప్రస్తావనలోను,

శ్లో. యై ర్బోధాయనసూక్తి పుష్పకలికాః
కర్ణావతం సీకృతా
యేషాం బిల్హణసూక్తిహారతికసరాః
కంఠా నలంకుర్వతే
మాఘుశ్రైయకభువాం మురారివచసా
మాస్వాది యై స్స్వాదిమా
సంతుష్యంతి త ఏవ నూతనసుధా
వేణీషు వాణీషు నః.

నాసికేతోపాఖ్యానముగ రచియించిన దగ్గుబల్లి దుగ్గనకవి (శ్రీనాథుని బావమఱఁది) గ్రంథావతరణికలోను,

"సీ. ప్రణుతింతుఁ బన్నగరాజ వాల్మీకి స
త్యవతీతనూజ బోధాయనులను
ప్రార్థింతు దిఙ్నాగ రాజశేఖర కాళి
దాస సౌమిల్లిక భాసకులను."

అని వినుతించిరి. ఈబోధాయనుఁడు బ్రహ్మసూత్రవృత్తికారుఁడును గల్పసూత్రాదికారుఁడునుగాక వేఱొకఁడేనిఁ గావచ్చును.

## గ్రంథప్రాచీనత

సర్వజ్ఞ సింగభూపాలుఁడు రసార్ణవసుధాకరమున నీభగవదజ్జుకప్రహసనమును బేర్కొన్నాఁడు. * సర్వజ్ఞ సింగభూపతి పదునాల్గవ శతాబ్దివాఁడుగావున నీగ్రంథమంతకుఁ బ్రాచీనమనుట యొక విశేషముగాదు. క్రీ. శ.600 లో నున్న మహేంద్రవిక్రమవర్మ యను పల్లవరాజు చెక్కించిన మామండూరు శిలాశాసనమున నీభగవదజ్జుకము పేరున్నది. ఆగొప్ప శిలాశాసన మిప్పుడు శిథిలమై యక్కడక్కడ కొంతకొంతమాత్రమే చదువఁదగినదిగా నున్నది. ♦

* శుద్ధం కీర్ణం వైకృతంచ తచ్చ ప్రహసనం త్రిధా; శుద్ధం శ్రోత్రియశాఖాదే ర్వేషభాషాది సంయుతమ్. చేటచేటీజనవ్యాప్తం తల్లక్ష్యంతు నిరూప్యతామ్; ఆనందకోశ ప్రముఖం తథా భగవదజ్జుకమ్, కీర్ణంతు సర్వైర్వీథ్యంగై స్సంకీర్ణం ధూర్తసంకులమ్; తస్యోదాహరణం జ్ఞేయం బృహత్సైభద్రకాదికమ్. యచ్చేదం కాముకాదీనాం వేషభాషాది సంగతైః, షండతాపస వృద్ధాద్యైర్యుతం తద్వైకృతంభవేత్, కలికేళిప్రహసనప్రముఖం తదుదాహృతమ్. ఈశ్లోకము లిటీవల ననంతశయనగ్రంథమాలలో ముద్రితమయిన నాగరీలిపి గ్రంథమందు చేరలేదు. పూర్వము శ్రీ వేంకటగిరి రాజాగారిచే ముద్రితమైన తెలుఁగులిపి గ్రంథమందుఁ గలవు.

♦ సౌత్ ఇండియన్ ఇన్‌స్క్రిప్షన్‌సు వాల్యూము IV చూ.

ఈమహేంద్రవిక్రమవర్మ విద్యావిశారదుఁడు. కిరాతార్జునీయకారుఁడగు భారవికవి యీయన యాస్థానమున నుండెను.* ఈరాజు స్వయము మత్తవిలాసమని యొక ప్రహసనమునుగూడ రచియించినాఁడు. అది యీనడుమ దొరకినది. ముద్రితమైనది. శిలా శాసనమున దానిపేరుగూడఁ గలదు. మత్తవిలాసముతోపాటు దీనిఁగూడ నామహేంద్రవిక్రమవర్మయే రచించియుండవచ్చునేమో యని యూహించుటకు, వ్యాఖ్యాత బోధాయన కృతనుట, యితరకవులు బోధాయనుఁ గవినిగాఁ బ్రస్తుతించుట, వేఱొకబోధాయనకవికృతి యెఱుఁగరాకుండుట, కొంత బాధకమయినను, నారెండు ప్రహసనములందును రచనాసామ్యముండుట కొంతసాధక మగుచున్నది. భగవదజ్జుకము పరిహసించునట్లె మత్తవిలాసముగూడ బౌద్ధమతమును బరిహసించుచున్నది. భగవదజ్జుక మందున్న వాక్యములే కొన్నిమత్తవిలాసమందు నున్నవి. కాని మత్తవిలాసము భగవదజ్జుకమంత ప్రౌఢముగాలేదు. ప్రాచీనమగు భగవదజ్జుకమును మహేంద్రవిక్రమవర్మమత్తవిలాసమం దనుకరించెనేమో! మామండూరు శాసనము స్పష్టముగా గుర్తింపఁదగియుండెనేని యనుమానములకు నపోహములకు నవకాశము లేకుండెడిది.

కర్త బోధాయనుఁడో, మహేంద్రవిక్రమవర్మయో, మఱొకఁడో యెవ్వరయినను, క్రీ. శ. 600 కుఁ దర్వాతివాఁడుమాత్రము కాఁడని మామండూరుశాసన మిప్పుడుగూడఁ బేరెత్తి చెప్పుచున్నది.

గ్రంథార్థము

ప్రహసనమనఁగానే పాఠకులు సాధారణముగా మన తెనుఁగుదేశమునఁ బ్రకటితమైయున్న లంబోదర ప్రహసనమును స్మరించి దానివలె నిదికూడఁ దుచ్ఛమును జుగుప్సితమును నగు బండుబూతుపరిహాసముతో నిండియుండునని రోఁతచెందుదురేమోగదాయని భీతిచెందుచున్నాను. ఇదియట్టిదిగాదు. ఇందుఁగల హాస్యము విందుగూర్చునది. ఆహాస్యముగూడ నాపాతహృద్యమేకాకయాలోచనామృతమునై యధ్యాత్మతత్త్వబోధక మగుచున్నది. హాస్యచ్ఛలమున నధ్యాత్మతత్త్వమును బోధించుటలోఁ గవి యిం దసాధారణచాతుర్యమును జూపినాఁడు. వ్యాఖ్యాత యీప్రహసనమునఁ బ్రత్యక్షరము యోగదర్శనపరముగా నంతరార్థముఁ జెప్పుచు వ్యాఖ్య రచించినాఁడు. ఆయన చెప్పిన యంతరార్థము తీ రిట్టిది:—

శ్లో. అస్మిన్ నాట్యరసే నిసర్గగహనే
యోగీంద్రశిష్యా వుభా
వాత్మానౌ పరజీవభేదకథితౌ,
వన్యా తథైవాజ్జుకా;
మూలాధారసముద్గతా ససుషిరా
నాడీ సుషుమ్నా, పరే
చేట్యౌ చోభయ పార్శ్వగే ససుషిరే
నాడ్యా విడాపింగళే.

శ్లో. అవిద్యా గణికా మాతా మోహో
రామిలకో మతః, వైద్యోహి కల్ప
సంకల్పౌ కాలస్తు యమ పూరుషః.
ఏవం ప్రేక్షామయం యోగం, యుంజ

* దండిరచిత మగు అవంతి సుందరీకథాసారమునఁ జూడఁదగును. ఈగ్రంథమును శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు ప్రచురించుచున్నారు.

న్నర్తకతాపసః, ప్రత్యంచ మచ్యుతం
సద్య స్సంతోత్కృత్యా సుఖీ భవేత్.

వ్యంగ్యమయిన యీయంతరార్థముమాట యెట్లున్నను వాచ్యమయిన బాహ్యార్థమందే బహుధర్మము లిందుఁ బ్రతిపాదితము లయినవి: ఫలాభిసంధి లేక చేయుకర్మము బంధకముగామి, అంతరాత్మ కర్మాత్మల (పరమాత్మ జీవాత్మ) విభేదము, భోగాస్థైర్యము, ప్రామాణ్య పరిజ్ఞానము, అధ్యయనావశ్యకత, సంగరాహిత్యము, యోగప్రశంస, స్వధర్మజిజ్ఞాస, పరధర్మజిహాస, మొదలగునవి.

పయిఁ జెప్పఁబడిన వానికంటె నీ ప్రహసనమున నింకొక పరమప్రయోజనముగలదు. క్రీ. యేడవశతాబ్దికిఁ బూర్వకాలమున భరతఖండమున బౌద్ధమతమునకుఁ బ్రాభవము హెచ్చుగానుండెను. ప్రత్యక్షానుమానములను మాత్రమే ప్రమాణముగాసంగీకరించుచుభూతదయనే పరమార్థముగాఁ జెప్పుచునున్న బౌద్ధసిద్ధాంతములు తేటగా లోకమునఁ బాటికెక్కుచుండెను. శబ్దమునుగూడఁ బ్రమాణముగా సంగీకరించి యప్రత్యక్షవిషయముల నందుండి సాధించుచున్న దర్శనమతముల కప్పుడు తగ్గు వచ్చెను. ఇప్పటి కేఁబదియేండ్లకుముందు క్రీస్తుమతమువారి బోధలు, చర్చలు మొదలగునవి భారతీయుల కెంతవలపుగొలుపునవిగా నుండి యెంతవ్యాప్తి చెందెనో, యాకాలమున బుద్ధమతమువారిబోధలు, స్తూపములు సంఘముగూడ, నంతవలపు గొలుపునవిగా నుండి యంతవ్యాప్తి చెందెను. బౌద్ధమతమును నాశించుటకయి యాస్తికులనఁ బరగిన వైదికమతములవా రప్పుడు బహుగ్రంథముల రచించిరి; శబ్దప్రమాణ మంగీకరింపని వారిని నాస్తికులని గర్హించిరి; తర్కములందు దించి యోడించిరి. యేమిచేసినను నెనిమిదవ శతాబ్దిలో శంకరు లుదయించి యద్వైతసిద్ధాంతమును రాద్ధాంతపఱుచునంతదాఁక బౌద్ధమతమునకు నిజముగా బలము క్రుంగలేదు. బౌద్ధమత ప్రచారమును భంగపఱుచుటకై యాకాలమున నీ ప్రహసనరచన మావశ్యక మయినది. ఇందు శాండిల్యుఁడను శిష్యుఁడు బౌద్ధమత వ్యామోహమునఁబడి చెడినవాఁడు. అప్రత్యక్షముల నాతఁడు నమ్మఁడు; శబ్దప్రమాణమును విశ్వసింపఁడు; వేళకు భోజనముఁజూచుకొనును; అప్రయోజకమయిన యనుతాపముఁ జూపుచు భూతదయ యని యిసు రుడుగుచున్న వేశ్య నుపచరింపఁ బోవును; తగదన్న యాచార్యునిఁ దెగఁదిట్టును. నిట్లు వెంగలితనము వెల్లడించుచున్న శిష్యునిఁ బరివ్రాజకుఁ డెంతయు శాంతుఁడై చక్కదిద్దెను. ఈ ప్రహసనముఁ బ్రయోగించునప్పుడు చూచినఁగాని లేక చదివినను గాని, బౌద్ధమతమునెడఁ బెడమొగము పెట్టనివా రుండరు. కవి యిందు బౌద్ధమతము నంత సక్కఁగా వెక్కిరించినాఁడు. ఆకాలమున నీ ప్రహసనము బౌద్ధమతవ్యాప్తిని గొంత పడఁగొట్టియు నుండును. ఈ ప్రహసనమందు యోగదర్శనము పరమార్థసాధకముగా నిరూపింపఁబడినది; మహేశ్వరాదులు యోగాచార్యులు స్మరింపఁబడిరి. శంకరాద్వైత మాకాలమునకు జన్మింపనేలేదు. ఇందు "అష్టౌ ప్రకృతయః"— ఇత్యాదిగా సాంఖ్యదర్శనముగా ప్రోక

వాక్యమును, "అదిణ్ణాదానాదో" ఇత్యాదిగా బౌద్ధపిటక పుస్తకములలోనిదిగా నొకవాక్యమును గానవచ్చుచున్నవి. కపిలముని సాంఖ్యసూత్రములలోఁగాని యీశ్వరకృష్ణుని సాంఖ్య సప్తతిలోఁగాని మొదటివాక్యము కానరాదు. అది యేగ్రంథములోనిదో నేనెఱుఁగఁజాలనయితిని. ఈవాక్యముగల గ్రంథ మేదేనాకాలమందుండి యిప్పు డంతరించెనేమో! రెండవది బౌద్ధపిటక పుస్తకములలోఁ గలదట. "అదత్తాదానా ద్విరమణం శిక్షాపదం, ప్రాణాతిపాతా ద్విరమణం శిక్షాపదం, ముథావాదా ద్విరమణం శిక్షాపదం, అబ్రహ్మచర్యా ద్విరమణం శిక్షాపదం, అకాలభోజనా ద్విరమణం శిక్షాపదం, అస్మాకం; బుద్ధం, ధర్మం, సంఘం, శరణం గచ్ఛామి." ప్రాకృతమూలమున కిది సంస్కృతచ్ఛాయ. "మాకు పరవిత్తాపహారణమునుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; ప్రాణిహింసనుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; అసత్యోక్తినుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; అబ్రహ్మచర్యమునుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; అకాలభోజనమునుండి తప్పుకొనుట యభ్యసింపవలసినది; నేను బుద్ధదేవుని శరణము చొచ్చెదను; బౌద్ధధర్మమును శరణముచొచ్చెదను; బౌద్ధసంఘమును శరణముచొచ్చెదను." మొదటి యైదింటికిఁ బంచ శిక్షాపదములని కడపటి మూఁడింటికి శరణత్రయమని వెరసి యెనిమిదింటికి నార్యాష్టాంగములని బౌద్ధులలో వ్యవహారము.

'రోమాంచోముఖశోషశ్చ' ఇత్యాదిగా నిం దుదాహృతమయిన శ్లోకము చరకసుశ్రుతాదులలోఁ గలదేమో గుర్తింపఁజాలనయితిని. ఆకాలమునఁగూడ నపండితులు చేతఁగానివైద్యముఁ జేయుచుండుట నిందుఁగల వైద్యహాస్యము తెలుపుచున్నది.

పరివ్రాజకుఁడు వేశ్యాశరీరమునఁ బ్రవేశించి కొంతవింత నడపుచుండఁగా వింతపై వింతయన్నట్టు పరివ్రాజకశరీరమున వేశ్యాప్రాణములను యమపురుషుఁడు ప్రవేశపెట్టెను. తనశరీరమున వేశ్యాప్రాణములకుఁ బ్రవేశముకల్గునని పరివ్రాజకుఁడు ముం దెఱుఁగఁడు. అది జరిగిన తర్వాత వేశ్యాశరీరమందుఁగల పరివ్రాజకుఁడు భాషింపనే లేదు. ఆశ్చర్యముచెంది యాలోచించుచున్నాఁడు. శాండిల్యుఁడును ఆలోచనాంబుధిలో మునిఁగినాఁడు. కవి యిక్కడ కడునేర్పు చూపినాఁడు.

### కథాస్థానము

అజ్జుక ప్రశ్నింపఁగాఁ జేటి 'బావ ఇదుగో వస్తున్నానని చెప్పి నగరంలోకే వెళ్లాడు' అన్నది. వ్యాఖ్యాత యిక్కడ నగరమనఁగా 'పాటలీపుత్ర'మని వ్యాఖ్యచేసినాఁడు. అది యుక్తమే. యమపురుషుఁడు యమలోకము దారిని బేర్కొనుటలో గంగనుండి యుపక్రమించి దక్షిణముగానున్న నదీనగనగరాదులను జెప్పినాఁడు. కావునఁ గథాస్థానము గంగ కావల నుండవలసినదే కదా!

### తెల్గు చేత

ఈ ప్రహసనము ప్రాకృత బహుళము. ప్రాచ్యలిఖితపుస్తకశాలలో విచ్ఛాయముగా దప్పులతో దీనివ్రాతప్రతి యొకటికలదు. దానిఁ జూచి వ్రాసికొని యెట్లో నేను దెలిఁగించితిని.

కాని కొన్నిచోట్లఁ దప్పులు దిద్దఁగుదురనివిగా నుండెను. కథారంభముననే "పరివ్రాజకః-శాండిల్య, శాండిల్య! (పృష్ఠతోఽవలోక్య) నతావ దృశ్యతే; సదృశమస్య తమో వృతస్య" అని యుండవలసిన వాక్యములోని యేకదేశము 'నతావ ద్దృశ్యతే సదృశమస్య తపోవ్రతస్య' అని యుండెను. ఇట్టి చిక్కులింకను బెక్కులుగలవు. కర్త పేరు లేని వ్యాఖ్యానము క్రొత్తగా నపుడు పయిపుస్తకశాలకువచ్చెను. నే నావ్యాఖ్యానము సాహాయ్యమున సర్వసంశయములఁ దీర్చుకొన్నాను. ఆవ్యాఖ్యానమునఁగూడఁ బ్రాకృతవాక్యములకు వ్యాఖ్యయే కలదుగాని సరిగా ఛాయలేదు. అయినను నది సరిగా గుర్తింపఁదగినదిగానే యుండెను. ఇప్పటి తెలుఁగు పలుకుబడి చొప్పున నేనాప్రాకృతము నించుక స్వతంత్రించి విడఁబఱిచి యనువదించితిని. నా తెలుఁగుచేత యెట్లున్నదోకాని మూలగ్రంథము మిక్కిలి హృద్యమయినదని నే ననఁగలను.

శ్రీభారతీ పత్రికలో నా తెలుఁగుచేత ప్రకటింపఁబూనిన సమకాలముననే బీహార్ అండ్ ఒరిస్సా జర్నల్‌లో మూలగ్రంథము విచ్ఛాయముగానే ముద్రితమై వెల్వడెను. చూచితినిగాని యది యనేకలోపములతో నసంగతమై యున్నది. గ్రంథభాగములే యందు విడువఁబడినవి. దానిఁ బ్రకటించినవారు వ్యాఖ్యానము నెఱుఁగరు. నే నిప్పుడు సరిపఱుచుకొన్న మూలము వారిముద్రణముకంటె నెంతో గుణవంతముగా నున్నది. వారికి దానికర్తనుగూర్చి కాలమునుగూర్చి యేమియు నెఱుఁగరాలేదు. బౌద్ధమతప్రశంసనుబట్టి ప్రాచీనమయిన దని మాత్రము వారు భావించిరి.

కడుఁజిన్నదగు నీ ప్రహసన పుష్పమునకుఁ దొడిమ యింక నెక్కుడుగా నుండరాదుగదా!



# నీవె నేను నీతోడిదే నిఖిలజగము

అధికార్ల సూర్యనారాయణరావు గారు, బి. ఎ., బి. యల్.,

నిన్ను మోయుట భూమి నాకన్నతల్లి,
నీకు సుఖమిచ్చుపవనుడు నాకు హితుఁడు,
నిన్నుఁ బ్రోచుట నాబంధుఁ డీశ్వరుండు,
నీవు ప్రేమించునాహృది పావనంబు,
నిన్ను వలచుట జానకీ! నేను నేను.
నిను సదా కాంచునాకనుల్ నిర్మలములు,
నీవిహితమార్గగామి నాజీవనంబు,
నీవె నేను నీతోడిదే నిఖిలజగము!





# తుక్కా — పంచకము

ఆ. రంగస్వామి సరస్వతిగారు, బి. ఏ.,

తుక్కా పంచకముపై నాషాఢమాసపు భారతి 'పుష్పాంజలి' లో విద్వత్కవిశిఖామణులు, నస్మన్మిత్రులును అగు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు వ్రాసిన వ్యాసమును జదివి యానందమొందితిని. ఆవ్యాసమున వారుచూపిన నవీనవిషయముల కాంధ్రలోక మంతయు వారియెడఁ గృతజ్ఞులుగావలసినదే. అయిన నాపట్టున కవిగారనిన కొన్నివాక్యములు కొంతమార్చినగాని ప్రమాణములు కానేరవని వానిగుఱించి యిచ్చట కొంత వ్రాయవలసివచ్చినది. ఈసందర్భమున కవిగారి వాక్యము లివి. "కటకాధిపతియగు ప్రతాపరుద్రగజపతి కృష్ణరాయనిచే విజితుఁడై తనకుమారితయగు తుక్కాదేవి నతని కొసఁగి తత్కోపానలము శమింపఁజేసెనట. విజయియగు రాయలు తుక్కాదేవిని బరిగ్రహించియు నేకారణముచేతనో ఆమె వలన సహచారిణీసుఖం బనుభవింపఁజాలక కంభమునకోటలో నామెను నిరోధించి యుంచెనట. ఆమె చక్కని కవయిత్రియు, ధాత్రియు, కంభస్థలతటాకనిర్మాత్రియు నయ్యె నని "విజయనగర చరిత్రమున కాధారములు" (Sources of Vijayanagar History) అను గ్రంథమునఁ గానవచ్చుచున్నది."..."దీనిని (తుక్కాపంచకమును) తుక్కాదేవికి నంటఁగట్టిన బ్రహ్మశ్రీ సరస్వతిగారెచ్చటనుండి యీసంబంధము సాధించి తెచ్చిరో యెఱుఁగఁజాల." పైవాక్యములనుగూర్చి యభిప్రాయమిచ్చుటకు పూర్వము 'విజయనగర చరిత్రమున కాధారములు' అను గ్రంథమునకును నాకు నున్న సంబంధము కొన్నికారణాంతరములచే మఱుఁగుపడియుండగా వస్తుస్థితి నెఱిఁగి వెల్వరించిన కవిగారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను.

కవిగారి పైవాక్యములఁ జదువువారందఱికి నే నెచ్చటనోయుండిన యైదు భృంగాపదేశశ్లోకములఁ దెచ్చి వానికి తుక్కాపంచకమని పేరిడి కృష్ణరాయలకు తుక్కాయను పేరిట గజపతికూతు భార్యగాఁ గల్పించి యామెకు ముడిపెట్టిన ట్లగుపడును. ఈ యపవాద మెంతవఱకు వాస్తవమో విచారింపఁదగినది. మొట్టమొదట యీ విషయమున గ్రంథపు వాక్యముల నిచ్చట నుదాహరింతును.

The following five verses are ascribed by tradition to Tukka, the daughter of Pratapa rudra Gajapati, the ruler of Orissa, who was given in marriage to Krishna Raya. She is said to have been neglected by her husband and to have led a life of seclusion at Kambam in the Cuddapah District. The big irrigation tank at Kambam is said to have been constructed at her instance. In the verses she bemoans her husband's neglect of her.'

ఈ వాక్యమునుగూర్చియు, కవిగారిఖండనమునుగూర్చియు చర్చింపవలసిన విషయములు. 1. ఈ శ్లోకములకు తుక్కాపంచక మను నామముగలదా? 2. తుక్కాపంచకమునకు, గజపతి కూఁతునకుగల సంబంధమెట్టిది? ఇది యర్వాచీన కల్పితమా? 3. కృష్ణదేవరాయలకు గజపతి కూఁతు రొక భార్యయుండెనా? 4. అట్టి భార్యయుండిన నామె యీ శ్లోకములనుఁ గూర్చునంత సమర్థురాలుగానోపునా? ఈప్రశ్నలకు క్రమముగా నుత్తరమిచ్చెదను.

(1). ఈశ్లోకములకు తుక్కాపంచకమను నామముగలదా? గురుజాడ శ్రీరామమూర్తిగారి కవిజీవితములలో నీశ్లోకములేయుదాహరింపఁబడియున్నవి. అచ్చటనీవిధముగా నున్నది. 'తుక్కాపంచరత్నములు, తుక్కానామగజపతి పుత్త్రీ(కృష్ణదేవరాయ పత్నీ 'అనియున్నది. పైవ్రాతనుబట్టి యీశ్లోకములకు మొట్టమొదట తుక్కాపంచకమని పేరిడినదియు, దానిని కృష్ణరాయలభార్య కంటగట్టినదియు నేనుగాదనుట స్పష్టము. ఇఁక నిట్లంటగట్టినది గురుజాడ శ్రీరామమూర్తి గారై యుండవచ్చునా? పైకవిజీవితము వాక్యములో నే "కృష్ణదేవరాయపత్నీ" అనియున్నది' అనుటచేత నా వాక్యము శ్రీరామమూర్తిగారిది కానట్లును స్పష్టము. గురుజాడ శ్రీరామమూర్తిగారు

...మగ్రంథములో నుదాహరించినగాథలన్నియు గవర్నమెంటు ప్రాచ్యలిఖితపుస్తకశాలయందలి మెకంజీమొదలగువారు సేకరించిన గ్రంథములలోనివి. వీనిలో ననేకములు చరిత్రము లున్నవి. వీనినుండియే శ్రీరామమూర్తిగారు దీనిని సేకరించియుండురనుట స్పష్టము. కనుక నీ తుక్కాపంచకము సంబంధము మెకంజీదొర నాటికి ప్రసిద్ధమని తెల్లమగుము.

ఇదిగాక కృష్ణరాయలు గజపతికూఁతు వివాహమాడినందుకు వేఱు ప్రమాణము లున్నవా? కృష్ణరాయలనుగూర్చి వ్రాయబడిన రాయవాచక మనుచరిత్రగ్రంథమునఁ గృష్ణరాయలు గజపతిరాజ్యమును జయించి పొట్టునూరు జయస్తంభము నిల్పినవెనుక గజపతి తన కూఁతు గృష్ణరాయల కిచ్చి వివాహముచేసినట్లు చెప్పఁబడియున్నది. ఈ గ్రంథమునందలి కథయే కొంచెము హెచ్చుతక్కువగా కృష్ణరాయల చరిత్రముకొఱకే వ్రాయఁబడి, విజయనగరచక్రవర్తుల వంశమునఁ బుట్టిన యొకరి కంకితమీయఁబడిన కుమారధూర్జటివిరచిత కృష్ణరాయవిజయమునందు నున్నది.

పైరెండు గ్రంథములును కృష్ణరాయల కాలమునకు పిదపఁ బుట్టినవేకదా. కనుక నీవిషయమున నంతగా ప్రమాణములగునా యని కొంద ఱనవచ్చును. ఇఁకఁ గృష్ణరాయల కాలముననే పుట్టిన గ్రంథములలో నీ విషయమున్నదా? కృష్ణరాయల కాలమునందే పుట్టినదియు, అతనిశిరఃప్రధానియగు సాళ్వతిమ్మ దండనాథునకు మేనల్లుడును, గజపతియొద్దనుండి జయించినపిదప కొండవీటి రాజ్యమునకు నధిపతియునైన నాదెండ్ల గోపదండనాథుఁడు రచించిన ప్రబోధచంద్రోదయవ్యాఖ్యానపీఠికయం దీక్రిందిశ్లోకము కనఁబడుచున్నది.

"ప్రతాపరుద్రస్య గజేశ్వరస్య పుత్రీం పవిత్రీకృతభూతధాత్రీమ్ । ప్రత్యగ్రహీ ద్యః ప్రకటప్రతాపో నృణాం సుభద్రా మివ పాండవేయః॥"

ఈగ్రంథమున కృష్ణరాయల ప్రతాపమును వర్ణించుచు నతని విజయములలో నొకటినైనను పేరు పెట్టి చెప్పకపోయినను గజపతిప్రతాపరుద్రుని కూఁతుఁ గృష్ణరాయలు పెండ్లాడె నవిమాత్రము చెప్పెను. దీనినిఁబట్టి చూడ కృష్ణరాయల యీవివాహము గోపదండనాథుని యభిప్రాయమున నతని దిగ్విజయము లన్నిటికంటెను ప్రతాపసూచకమని యేర్పడును.

కృష్ణరాయలు గజపతికూఁతుఁ బెండ్లాడెననుటకు కింకొక యాధారముకూడకలదు. ఈ యాధారముకూడ ప్రబోధచంద్రోదయ వ్యాఖ్యవలెనే రాయలకాలముననే పుట్టినది. కృష్ణరాయుల దిగ్విజయముంగూర్చి వ్రాయుచు నాయన యాస్థానమందుండిన కుమారసరస్వతి యను ద్రావిడకవి యీక్రిందిపాట(పద్యము)నొనర్చెను. ఇది 'తమిళ్ నావలర్ చరితై' అను ప్రాచీనద్రావిడసుభాషితావళియందున్నది. దీనిని పైఁజెప్పిన నా 'ఆధారములు' అను గ్రంథమున 155 వ పుటయం దుదాహరించియున్నాను. ఆపద్య మిది.

"కుమారసరస్వతి, ఒడ్డియనై (కృష్ణరాయర్) జెయిత్తపోతు పాడియదు —

కలిఙ్గ మిఞ్జిన్ను నుదిక్కై చజన్దొట్టు
మెలిన్దుకటక న్నెఞ్జుచ విట్టాళ్ — మలిన్దమలర్ప్
పొన్నిట్టమాన కిరుష్ణబూపాలా వున్దనుక్కుప్
పిన్నిట్ట వొడ్డియన్ పొర్పెణ్

ఈపద్యమునందు వొడ్డియన్ కళింగరాజుయొక్క కూఁతునకు, అతని రాజ్యలక్ష్మికి నైక్యము కల్పింపఁబడి యిద్దఱను కృష్ణరాయలఁ బలిగాఁ బరిగ్రహించిన ట్లందముగా వర్ణింపఁబడినది.

ఆంధ్రమునందే కృష్ణరాయల నిర్యాణానంతరము గజపతి కర్ణాటరాజ్యముపై దండెత్తిరాగా పెద్దన చెప్పిన 'రాయరావుతుగండ...' యను చాటుపద్యము నెఱుఁగనివారను గలరా? అందలి 'ఘనతర నిర్భరగండ పెండెరమిచ్చి, కూఁతు రాయలకును గూర్చినాఁడు' అను పాదమునుబట్టి గృష్ణరాయలు గజపతికూఁతుఁ బెండ్లాడె ననుట స్పష్టమేగదా.

ఆంధ్రదేశమునఁ బ్రాఁతకాలమునుండి కృష్ణరాయలకు గజపతికూఁతు రొకభార్యయయ్యెననియు, వివాహానంతర మామెకును గృష్ణరాయలకును నేకారణముచేతనో పొందికలేక యామె వేఱుగా నుండెననియు నొక గాథయున్నది. ఇదియును గాక నందితిమ్మన కృష్ణరాయలకును అతని భార్యయగు గజపతికూఁతురికిని ప్రణయకలహము సంభవింపగా నద్దాని శమింపఁజేయుటకుఁ బారిజాతాపహరణము వ్రాసెననియు నొకయైతిహ్యముకలదు.

ఈయర్థముగలదే యింకొక గాథ కృష్ణరాయలఁగూర్చియే యున్నది. పారిజాతాపహరణము వంటిదే సత్యావధూప్రీణన మను గ్రంథమును రాయలు వ్రాసెనని యాతని యాముక్తమాల్యదయందే యుండలేదా?

ఇంతవట్టు నుదాహృతగ్రంథములవలన గజపతి కూఁతురియొక్క పే రిది యని స్పష్టముగా నేర్పడలేదు. రాయవాచకమున మాత్ర మామె పేరు జగన్మోహిని యని యున్నది. ఇటీవల నొకరు 'ప్రతాపరుద్రస్య......' అన్న నాదిండ్ల గోపన వ్యాఖ్యాన శ్లోకమునందలి 'భద్రాం' అను సుభద్రాశబ్ద విశేషణమునుజూచి పొరపడి ప్రతాపరుద్రుని కూఁతురిపేరు 'భద్ర' యనునని వ్రాసిరి. అయిన నాశ్లోకమును జక్కఁగాఁ బరిశీలించిన నం దామె పేరు లేదనియే స్పష్టమగును.

జగన్మోహిని యను పేరు సాధారణముగ నెవ్వరు నుంచు పేరుగా కన్పడనందునను, గజపతిరాజ్యమైన యుత్కలదేశమునం దట్టిపేర్లుండక పోవుటచేతను నది వెనుక కల్పితమని యేర్పడును. ఇఁక నామె పే రియ్యదియని మనకుఁ దెలియుట కాధారమేమైనకలదా? ఈ తుక్కాపంచకమునందలి 'తుక్కా' యనునదియే పేరై యుండునా? ఇది యట్లుండుననుటకు కారణములు కొన్ని యున్నవి. ఉత్కలదేశమునందువరదరాజమ్మవంటి పేరుండుటయభావ్యము. భద్రయనునదియు నాశ్లోకమున పేరుగానియప్పుడు 'తుక్కా' పదమును పేరుగా గ్రహించుట కాక్షేపణ లేమియుఁ గనఁబడవు. అయిన నాపద మెవరికైన నామముగానున్నదా? 'తుక్కారామ్' 'తుక్కాజీ' యను నామములు చరిత్రమునందు కొందఱు ప్రసిద్ధుల కుండలేదా? అట్లే తుక్కాయని స్త్రీకి పేరుండుటలో సందేహమేమి?

ఇఁక తుక్కాయని గజపతి కొక కూఁతురుండి యామె కృష్ణరాయలకు భార్యయైనను ఆమెకును తుక్కాపంచక శ్లోకములకును సంబంధమెట్టిది? ఈ శ్లోకములకు తుక్కాపంచక మను పేరుండుటచేతనే యవి యామెచేఁ జేర్పఁబడినవని స్పష్టము. ఇంతవఱకును భృంగపంచకమని యుండు గ్రంథమున కిప్పుడే యెవరో 'తుక్కాపంచక' మని క్రొత్తగా నామకరణము చేయలేదనియు స్పష్టమే. అయిన నీయైదుశ్లోకముల నీతుక్కాదేవి వ్రాసియుండునా లేక తత్పూర్వమే ప్రాచీన కవికృతములైనవాని నామె చేర్చియుండునా? ఈ విషయమున సందేహము దీర్చు ప్రమాణము లేమియు లేక 'ఆధారములు' (sources) గ్రంథమును వ్రాయుకాలమున నాసందర్భమున 'The following five verses are ascribed by tradition to Tukka, the daughter of Prataparudra Gaja-pati, who was given in marriage to Krishnaraya' అని మాత్రము వ్రాసితిని. ఇం దీశ్లోకములు మొట్టమొదట తుక్కాదేవియే వ్రాసెనని లేదు. ఈశ్లోకము లామె వ్రాసినట్లు ప్రవాద మున్నదని మాత్రము గలదు. ఈశ్లోకము లామె వ్రాయకుండినను వేఱువేఱుస్థలములందలి యైదుశ్లోకముల నొకటిగాఁగూర్చి తనభర్తకు తుక్కాదేవి పంపియుండుటచే వీనికిఁ దుక్కాపంచకమని పేరువచ్చియుండరాదా? వల్లభదేవుని సుభాషితావళియం దీశ్లోకములైదింటి యందున రెండుదాహరింపఁబడుటచే నివి తుక్కాపంచకమున నేకరింపఁబడుట కాక్షేపమేమి? సుభాషితావళి శ్లోకములతో వాని కర్తలపేళ్లు ననేకస్థలములలో నుండలేదా? అట్లే యీరెండు శ్లోకములకు నందు కర్తలపేళ్లున్నవా? అవి యేకకర్తృకములా? భిన్నకర్తృకములా? సందేహమునకందుసమాధానమున్నదా? ఏకకర్తృకములైన యెడమిగిలిన మూఁడుశ్లోకములును దత్కవికృతము లేనా? ఈప్రశ్నల కుత్తరమిచ్చుటకుఁ దగిన యాధార మేమియు లేదు. సుభాషితావళియం దందలి రెండుశ్లోకము లుదాహృతములని గ్రంథము నేకరించినకాలమునఁ దెలియదు. అట్లు తెలిసియుండినఁ దప్పక యుదాహరించియేయుందును. ఇప్పటికొందఱివలె నేదో సిద్ధాంతమును మనస్సుననుంచుకొని యందులకై ప్రాచీనగ్రంథములలోనున్న పాఠములుమార్చుట గాని, లేని పాఠాంతరముల సృష్టించుటగాని 'ఆధారములు' అను గ్రంథముయొక్క యుద్దేశము గాదు. గ్రంథము వెలువడిన కొలఁది మాసములలో తిరువాన్కూర్ రాజ్యములో గొప్పయధికారపదము నుండు నొకవిద్వాంసుఁ డీరెండుశ్లోకములును సుభాషితావళియందున్నవని తెలియపఱచెను. అందుపై వారికి కృతజ్ఞతఁ దెలుపుచు నీగ్రంథము నింకొక పర్యాయము ముద్రించునెడల నీ విషయముఁ జేర్పఁబడునని బదు లీయఁబడెను. ముకుళభట్టుగ్రంథమున 'భ్రమరభ్రమతాం' అనుశ్లోక ముదాహరింపఁబడియున్నదని మొట్టమొదట యాంధ్రలోకమునకుఁ దెలియఁబఱచిన కవిగా రెంతయు స్తోత్రార్హులు. అయిన నాపట్టున కాలనిర్ణయమునకై

నుదాహరించిన రాజతరంగిణి పఙ్క్తులుమాత్ర మంతగాఁ బ్రమాణము లగునాయని సందేహము పొడముచున్నది. రాజతరంగిణియందలి యనేకగాథలు ప్రమాణరహితము లనియు, అపసిద్ధాంతములనియుఁ జరిత్రకారు లెఱిఁగినదే కదా. ఆగ్రంథమునందలి శ్రీహర్షవిక్రమాదిత్యునకు వాస్తవమైన "శ్రీహర్ష" విక్రమాదిత్యులకాలమునకుఁ జరిత్రమునకు నెంతదూరమో కవిగారికి తెలియదా? రాజతరంగిణి యందలి ప్రవరసేనుఁడు హూణరాజును గాశ్మీరదేశము నేలినవాఁడును గదా. వాస్తవమైన సేతుబంధకర్త ప్రవరసేనుఁడు కవిగారికిఁగూడ దెలిసినట్లు, కుంతలదేశమున వాకాటకరాజును గాళిదాసాదులకు స్నేహితుఁడును గుప్తవంశపు విక్రమార్కునికి దౌహిత్రుఁడునుం గాదా. ఇట్టి విపరీతసిద్ధాంతములు రాజతరంగిణిలో నెన్ని లేవు? కనుక నాగ్రంథము కల్హణునికాలమునకుఁ,జాలపూర్వచరిత్రమునకుఁ బ్రమాణము కాఁజాలదు.

ఇఁక తుక్కాదేవి యీయైదుశ్లోకములను దానే చేర్చియుండును అనుట కామెకుఁ దగినవిద్య యుంట కాధారమేమైనఁగలదా. ఆమెతండ్రి ప్రతాపరుద్రుఁడు గొప్పరాజై కళింగదేశమునుండి వెడలి యాంధ్రదేశమంతయు జయించి అప్పటి విజయనగరరాజ్యములోఁ జాలవరకాక్రమించి యొకానొకకాలమునఁ దనసైన్యముతోఁ రామేశ్వరమువఱకు వెళ్లియుండినట్లు ప్రమాణము లగపడుచున్నవి. ఈకళింగరాజు విజయనగరరాజ్యములో నాంధ్రద్రవిడదేశముల నాక్రమించినసంగతి ద్రావిడదేశములోని శాసనములలో విశదమగును. అందీ కళింగరాజు జయించినవిషయము 'ఓడ్డియన్ కలాపమ్' అని శాసనములలో నుదాహరింపఁబడియున్నది. ఒక కాలమున ప్రతాపరుద్రునితండ్రి పురుషోత్తమగజపతి సేనతో బళ్లారిజిల్లాలోనున్న విజయనగరపట్టణమును ముట్టడించెనని విజయనగరరాజులలో నొకఁడైన మల్లికార్జునరాయల విషయము వ్రాయు సందర్భమున గంగాదాసుకవి వ్రాసిన "గంగాదాసప్రతాప విలాసమున" నున్నది. ప్రతాపరుద్రుఁడు గొప్పకవియు ననేకకవుల కాశ్రయభూతుఁడు నని తెలియుచున్నది. షడ్దర్శనముల మీఁటి పైని గ్రంథము లొనర్చిన లొల్ల లక్ష్మీధరయజ్వ ప్రతాపరుద్రుని యాస్థానకవిగాఁ గొండవీటియందుండెను. ప్రతాపరుద్రుఁడును 'సరస్వతీవిలాస' మను స్మృతిగ్రంథమునకు కర్తయని ప్రసిద్ధము. లొల్ల లక్ష్మీధరుఁడునుఁ, గంచము యెల్లయార్యుఁడను నింకొక విద్వాంసుఁడునుగూడి కొండవీటిరాజ్యమున 'దైవజ్ఞవిలాసము', 'జ్యోతిషదర్పణము' అను అతివిస్తారములైన గ్రంథముల రచించియున్నారు. ఓడ్రదేశమునందుఁ గొందఱుకవులును ప్రతాపరుద్రుని యాస్థానమునయుండిరి.

వంగదేశమునఁ బ్రసిద్ధ వైష్ణవాచార్యుఁడైన చైతన్యులీ ప్రతాపరుద్రునిచేఁ జాల గౌరవింపఁబడిరి. చైతన్యుఁడు ప్రతాపరుద్రుని యాస్థానమున నుండిన కాలమున వారిద్దఱిని వ్రాసిన చిత్రలేఖనమొకటి యిప్పటికి నున్నది. ప్రతాపరుద్రుని తండ్రి పురుషోత్తమగజపతి వ్రాసినదేకదా 'త్రికాండశేష' మను సంస్కృతనిఘంటువు. ఇట్లు అనేకపండితకవుల కాశ్రయమగు పండితకవివంశమునఁ బుట్టి సంస్కృతమందు నాంధ్రమునందు ననేకగ్రంథములు వ్రాసియు గ్రంథకర్తలకధిపతియునై ఆంధ్రభోజుఁడని పేరుగన్న కృష్ణరాయలకు భార్యయైన తుక్కాదేవి యీ యైదుశ్లోకములను సేకరించియుండ దనుట యెంతటిసాహసము?

ఇఁక నీతుక్కాదేవికిని, కంభస్థలమందలి తటాకమునకు సంబంధ మెట్టిది? ఈతటాకనిర్మాణవిషయకమైన శిలాశాసన మొకటి దానియొద్దనునే యున్నదని ప్రతీతి. అయిన నింతవఱ కాశాసనప్రతిబింబము శాసనశోధకులచే నెత్తఁబడినట్లు కనుపడదు. ఆశాసనమం దది వరదాజమ్మచే నిర్మింపఁబడినదని యున్నదో లేదో? అట్లుండిన యెడల నది తుక్కాదేవిచే నిర్మితముకాకపోవునేమో? వరదాజమ్మ (సరియైన రూపము వరదాజిఅమ్మ) అను పేరుగలవారు విజయనగరరాజవంశమందు కలరు. వారిలో ప్రసిద్ధురాలు కృష్ణరాయలకుఁదమ్ముఁడును, నతని వెనుక రాజ్యమేలినవాఁడును నగు అచ్యుతరాయలకు భార్య. ఈమె సలకరాజుయొక్క కూఁతురును, అచ్యుతరాయల మంత్రియు సేనాధిపతియునగు సలకము తిమ్మరాజు తోఁబుట్టువును. ఈమెపేరిటనే విజయనగరము సమీపమున వరదాజమ్మనపేటయను గ్రామము నిర్మింపఁబడినది. ఓదువ (విద్యార్థి) తిరుమలమ్మయను కవయిత్రి అచ్యుతరాయలకును, వరదాంబకునైన వివాహమునే 'వరదాంబికాపరిణయ' మని చంపూకావ్యముగా రచియించియున్నది. కంభము తటాక మామెచే నిర్మితమేమో యను సందేహము కలుగుచున్నది.

# ప్రేమతత్త్వము

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

(ఉత్తరభాగము)

(గతసంచిక తరువాయి)



నిష్కామ సాత్త్వికప్రేమ

నిరీశ్వరసాంఖ్యము :—

అరయఁ బ్రధానమెల్ల వియదాది వికారములొంది యీచరా
చరజగమయ్యె నియ్యదియ, సాజమటంచును దెల్పు తన్నిరీ
శ్వరమతసాంఖ్యమున్ బ్రకృతిఁ బాసి సుఖింపఁగోరి తెల్విమైఁ
బురుషుఁడు కేవలత్వమును బొందునటం చనురక్తిఁ జూపదే?

గీ. దీని నిట్లుంచి యిఁకమీఁదఁ దెలియఁ బఱతు, సద్వయప్రేమవైచిత్రి సగుణమగుచు
ద్వైతమనుపేరఁబరఁగు మతంబునందుఁ, దనరు నియ్యది వివిధభేదములతోడ.

సద్వయప్రేమ

క. జీవేశ్వర భేదంబును, భావించెడి మతములెల్ల ద్వైతంబులగున్
జీవుఁడు తనుఁదా నీశ్వరు, భావించుటఁ జేసి యిదియు ద్వైతం బయ్యెన్.

1 రామానుజమతము :—

గీ. భోగ్యమైనట్టి దృశ్యంబు భోక్తయైన, జీవుఁడును దన్నియంతయై చెలఁగు సకల
జగదుపాదాన భూతుఁ డీశ్వరుఁడు ననుచు, నింక మూఁడు పదార్థంబు లేర్పరించి.

ఉ. నేరిమితోడ నిత్యము ననిత్య మెఱింగి విరాగియౌచు సం
సారముఁ రోసి జీవి మనసార విముక్తిని గోరి దేవునిం
జేరి యుపాసనంబున భజించుచు జ్ఞానమునొందె నేని యా
కారుణికోత్తముండు దయగల్గి స్వధామముఁ జేర్చు నాతనిన్.

గీ. దేవగృహమార్జనంబును దివ్యగంధ, పుష్పసంపాదనము దేవపూజ దేవ
తాస్తవము దేవతానుసంధానమనఁగఁ, బంచవిధముగఁ బరఁగు నుపాసనంబు.

గీ. దాన జనియించు విజ్ఞానధార, దాన నగు నిదిధ్యాసనాత్మకమైన భక్తి
కలరి హరి సుప్రసన్నుఁడై యాత్మ భక్తు, నావరించు నవిద్యను బోవఁద్రోచి
మహితమై పునరావృత్తి రహితమైన, యాత్మపద మిచ్చునదె ముక్తి యనఁగఁబరఁగు

1 ఇదియే శ్రీవైష్ణవమనియు, విశిష్టాద్వైతమనియుఁ బేర్లు గాంచెను.

నట్టిముక్తున కాహారి కట్టుకలుగు, నుత్తమగుణాళి కర్తృత్వ మొకటి తక్క
ననుచు రామానుజుఁడు దెల్పె, నరయనిందు, జీవుఁడీశ్వరు సన్నిధిఁ జెందఁగోరి
తనదుముక్తిని బ్రేమించి దానికొఱకు, నతనిఁ బ్రేమింప సద్వాయ మయ్యెఁ బ్రేమ.

గీ. పరమకారుణికోత్తమా! పరమపురుష! భక్తవత్సల! యని పరబ్రహ్మము నెదఁ
గొలిచి యాదేవుధామంబు కోరుకతన, సద్వాయప్రేమఁ జూపు వైష్ణవమతంబు.

పూర్ణప్రజ్ఞమతము :—

క. సత్యము జీవుండాత్మయు, సత్యంబీశ్వరుఁడు సకల సద్గుణుఁడతఁడౌ
సత్యము వీరికి భేదము, సత్యము భేదంబు జీవజడముల కరయన్.

ఆ. జీవుఁడస్వతంత్ర భావుండు విష్ణువు, సుస్వతంత్రుఁడతని సుగుణములను
బొగడియతని కరుణఁ బొందిన జీవుండు, హరిసమీప మేగు నదియె ముక్తి.

క. హరిసేన ముఖ్య మయ్యది, పరమాంకన నామకరణ భజనాత్మక మీ
వెరవున జ్ఞానము పొడమును, నరునకు నది మోక్షసాధనంబగుఁ దెలియన్.

గీ. దుఃఖసంసారమునునుండి తొలఁగిపోయి, శాశ్వతంబగు నీశ్వరాశ్రయము గనుట
మోక్షమయ్యది నిత్యమౌ ముక్తి నిచ్చు, నతఁడె కావున సేవచేయంగవలయు.

చ. కరముల శంఖచక్రముల కాల్చిన ముద్రలు దాల్చి పుత్రులన్
నరహరి పేరులంబిలిచి నాల్క హితప్రియసత్యమంత్రముల్
కరముల దానరక్షణ సుకర్మము లాత్మదయాభిలాష సం
స్మరణము లంతయున్ హరిసమర్పణబుద్ధి భజింపఁగావలెన్.

క. అనిచెప్పిన [1] పూర్ణప్రజ్ఞుని శుద్ధద్వైతమతము సుస్పష్టముగాఁ
గనఁజేయును జీవునకుం, దనయం దీశ్వరునియందుఁ దగలిన ప్రేమన్.

శైవమతము :—

క. పతిపశుపాశములని యీ, మతము పదార్థత్రయంబు మైకొను నందున్
బతి శివుఁడు పశువు జీవుఁడు, వితతమచేతనము పాశ విషయంబరయన్.

ఆ. జీవుఁ డస్వతంత్ర భావుండు శివుఁడును, సుస్వతంత్రుఁ డతని శుద్ధ తత్త్వ
మరసివేత్తయైనయట్టి జీవుఁడు ముక్తిఁ, బొంది శివునిలోకమునకుఁ బోవు.

1. ఇతఁడే మధ్వమందిరుఁ డనియు వాయువు తృతీయావతార మనియు నానందతీర్థు డనియు మధ్వ యనియుఁ బిలువఁబడును. ఈ మతమునకు మధ్వమత మనియు వైష్ణవమత మనియుఁ బేర్లుగలవు.

చ. తలఁపఁగ దీక్ష ముక్తికిఁ బ్రధానము జీవి శివాగమాది వి
ద్యలఁ బఠియించి యీశ్వరమహత్త్వ మెఱుంగుట నిత్యపూజలన్
సలుపుట చేత లందుఁగలసత్య మెఱుంగుట పూర్ణభక్తిని
శ్చలమతిఁ జిత్త మీశ్వరునిసంగతిఁ గూర్చుట దీక్షకార్యముల్.

చ. నరుఁ డనపాయదీక్షల మనంబు శివైక్యముచేసి యర్చనా
పరుఁడయి తన్మయత్వమున భక్తియు భావనసల్పి యమ్మహే
శ్వరు నిజరూపముం దెలిసి శాశ్వతముక్తిని బొంది తా మహే
శ్వరుఁడగుఁగాని యీశ్వరునిసన్నిధినుండెడు నస్వతంత్రుఁడై.

గీ. కాని పరమేశ్వరుఁడు ముక్తులైన యామహేశ్వరులలో సమర్థులహీనపుణ్యు
లైన కొందఱ కిచ్చు లోకాధిపత్య, మనెడి కల్పంబు గూడ నిందరయవచ్చు.

గీ. 1 పాశుపతమును శైవంబు ప్రత్యభిజ్ఞ, యును రసేశ్వర మౌలుక్యమనుమతంబు
లన్నియును ముక్తిమార్గంబులందు వేఱు లయ్యు జీవేశ్వర విభేద మనుమతించు.

ఉ. వైదికకర్మవర్జనము, స్ఫాటికపార్థివశైలసూత లిం
గాదర పూర్వకార్చ, భసితాంగ విలేపన లింగధారణా
క్షాదికధారణాదులు, శివాగమ తత్త్వవివేక పూర్ణదీ
క్షాదు లొనర్చి జీవి పడయంగలఁ [illegible]రూపమోక్షముల్.

గీ. అనుచుఁ దనయంకు నీశ్వరునందుఁ బ్రేమ, జీవునకుఁ గల్గునంచును శివమతములు
చెప్పుచున్నవి యిందు విచిత్రగతుల, సద్వయప్రేమరీతి విస్పష్టమగును.

అక్షపాదమతము :—

గీ. ఆత్మ కానిదియైన దేహాదికమున, నాత్మబుద్ధి మిథ్యాజ్ఞాన మగును, దానఁ
గామమోహాది దోషముల్ గలుగు, వాని-హెచ్చుతగ్గులఁబట్టి దేహియును బాప
కార్యములఁగాని పావనకార్యములను, గాని యొనరించు వాక్కాయమానసముల
నది ప్రవృత్తియనంబడు, నదియె మరల, నధమగతిఁగాని యుత్తమమైన గతిని
గాని జన్మమునెత్తంగఁ గారణమగు, దాని విడువకవచ్చు ప్రాచీనకర్మ
వాసనాత్మక దుఃఖంబు వరుసతోడ, నదియె సంసార మనఁబడు, నందురోఁత
(?)పొడమ జీవుండు గురుబోధఁగాని పూర్వ, పుణ్య పరిపాకమునఁగాని మూలమైన
యాయవిద్యను దలఁగు నుపాయమైన, తత్త్వవిజ్ఞాన మార్జించు, దాన వరుస.

1. ఈ మతకర్తలలో, నకులీశుఁడు, బృహస్పతి, మృగేంద్రుఁడు, సోమానందనాథుఁడు, గోవిందభ త్పాదాచార్యుఁడు, ఔలుక్యుఁడు మున్నగువారు ప్రధానులు.

క. తొలఁగును మిథ్యాజ్ఞానము, తొలఁగునుగా మాది చిత్తదోషము లంతన్
తలఁగుఁ బ్రవృత్తియు దానన్, విలయించును భావిజన్మ బీజము లంతన్.

ఉ. ఈయఖిల ప్రపంచ ముదయింపఁగఁ జేసిన యామునీశ్వర
ధ్యేయుఁడనా ద్యనంతుఁడగు నీశ్వరు సత్కృప దుఃఖవాసనల్
పాయుటఁ జేసి జీవుఁడనపాయము నిత్యము సత్యమైన ని
శ్శ్రేయస మొందునంచు మునిశేఖర గౌతమవాణి తెల్పెడిన్.

జైమినిమతము :—

చ. శ్రుతివిహిత ప్రవర్తనుఁడు శుద్ధమనస్కుఁడు నయ్యు నీశ్వరా
శ్రితమతి ధర్మతత్త్వము నెఱింగిన జీవుఁడు నిష్ఠతోడ స
త్క్రతువు లొనర్చి పూర్వదురితంబులఁ బాసి యపూర్వపుణ్య సం
గతిఁగను నిష్టసిద్ధినని గట్టిగ జైమినివాణి మ్రోఁగెడిన్.

క. ధర్మానుష్ఠానము భవ, కర్మహరం బనెడికోర్కెఁగని యీశ్వరుపై
నిర్మలభక్తిని వైదిక, కర్మము లొనరించి జీవి గను నభిమతమున్.

సేశ్వరసాంఖ్యము :—

చ. *ఇరువదియాఱు తత్త్వముల నేర్పడె నీమత మిందు జీవుఁడ
న్పురుషుఁడు పూర్వకర్మఫలముం బడయంగ నిజానురూప సం
సరణముఁ జొచ్చి క్లేశపడఁజాలక తత్త్వమెఱుంగఁగోరి యీ
శ్వరు నెదనిల్పి యోగమును సల్పి కనుంగొనుఁ గేవలత్వమున్.

క. ఆది సేశ్వరసాంఖ్యంబనఁ, జను నుత్తమమైన యోగశాస్త్రంబు రచిం
చినపూజ్యుఁడగు పతంజలి, ముని జీవేశ్వరుల తత్త్వమును బోధించెన్.




*1. ప్రధానము, 7 మహదాదిప్రకృతివికృతులు, 11 ఇంద్రియములు, 5 భూతములు, 1 జీవుఁడు, [1] ఈశ్వరుఁడు అని యీమతమున 26 తత్త్వములు. నిరీశ్వరసాంఖ్యమున నీశ్వరుఁడు లేఁడుగావున 25 తత్త్వములు.




(మహారాష్ట్రమునుండి అనువాదము)

శ్రీ వాసుదేవరావుగారు

౧

శాంతిపురముపై సువర్ణరసాభిషేచనముఁ గావించి, భగవంతుఁడంశుమాలి యప్పుడే యస్తంగతుఁడై యుండెను. ముక్తావలీనది యానందనివాస భవనముఁ బ్రదక్షిణము చేసి మందగమనమున, మృదుధ్వనితోఁ బ్రవహించుచుండెను. ఆనదీకోమలతరంగములు తీరమున కాఘాత మొనర్చుచుండ, స్నిగ్ధగంభీరఘోష లుదయించుచుండెను. నదీప్రాంతమునఁ బ్రసరించియుండు విస్తీర్ణ వాలుకామయప్రదేశమునుండి యర్ధవర్తులాకారముగఁ బ్రవహించు ముక్తావలీవాహిని, యాసమయమున, నీలాకాశముపైఁ బ్రకాశించుఁ జతుర్థీచంద్రరేఖవలె నతిసుందరమై చూపట్టుచుండెను. ఆనందనివాసభవనము చుట్టునున్న యుద్యానవన మావాలుకాప్రదేశమువఱకును వ్యాపించియుండెను. ఆయుద్యానమునుండి నదిలోనికి దిగుటకు సోపానశ్రేణియుండెను. ఆసోపానశ్రేణిలో నొకదానిపై నిరువు రాసీనులై ముచ్చటలాడుచుండిరి. నిరాశాపూర్ణహృదయమందలి యాశావేశమువలె, నభోమండలముపైఁ జందురుని క్షీణకిరణములు శోభించుచుండెను. ముక్తావలీ చంచలప్రవాహముపై, మెఱయుచుండు వాలుకాప్రదేశముపై, అల్లలనాడుచుండుతరులతలపైఁ జంద్రునిమందప్రకాశము ప్రసరించియుండెను. మాలతీహాసన్ముఖముపైనను నాప్రకాశము పడియుండెను. మాలతి కప్పుడే పదియాఱవ సంవత్సరము ప్రవేశమైయుండెను. ఆ యువతి చంద్రికారసనిర్మితమూర్తి; మృదుహాసవికసిత కుసుమకలిక. మాలతి మాటలాడుచునె యొక్క పరిఁ జందురునిఁ దిలకించు; వెంటనే, జ్యోత్స్నాధౌత ముక్తావలీతరంగమాలికలపై దృష్టి ప్రసారించు; సమీపస్థ జా కుసుమముల నేరి గుచ్ఛము సేయు; ఇటు లొక గుచ్ఛ చేసి యాముగ్ధ తనప్రక్కనున్న యువకుని కర్ణముల దగిలించి, మందహాస విలసితవదనయై "ఇంక నెన్ని ది ములు మిగిలియున్నవి, దాదా?" యని ప్రశ్నించెను.

తరుణుని యుత్సాహపూర్ణముఖమండలము నధికతరోత్సాహకాంతివిలసితమయ్యెను. అతఁడు మంద తము మూలముననె యామె ప్రశ్నకుఁ బ్రత్యుత్తరమిచ్చె

మాలతి:—ఇంత విశాలమగు నీ యానందనివా మున మన మిరువురమే యుండు టెంతకష్టము? నీ 'కోర్టు'నకు వెడలిపోవుదువు. దాదా! నేనొంటి వి నుండ నేమి తోఁచఁగలదు? నిమేషకాలము, మా డుటకైన నెవరున్నారు? ఈ యేకాంత వా మి కెంతకాలము? ఆహా! ఆమెయుఁ ద్వరలోనే వచ్చి నాకెంతో సంతోషమగును.

శ్రీనివాసరావు, 'బారిస్టర్' పరీక్షకై యాం దేశముల కరిగియుండెను. అతని ప్రయత్నము వి మాటచే మగిడి తన జన్మభూమికి, శాంతిపురమున వచ్చి న్యాయవాదవృత్తి స్వీకరించియుండెను.

అతఁడు మాలతిప్రశ్నవిని : "ఇందుకొఱకేన నీ వామె రాక కింతాత్రముతో నెదురుచూచుచున్నావు అనెను.

మాలతి:—(లజ్జావనతవదనయై) "అది కాద య్యా! నేను శాంత నెంతగఁ బ్రేమించుచున్నానో కెట్లు తెలియును?"

శ్రీని:—శాంతను నీవింతవఱకును జూడనైన లేదు. ఒరులం జూడకమున్నే ప్రేమించు నీ మహావిద్య యెచట నేర్చితిరి తాయీసాహెబా?

మాలతి:—మరి, చూడకున్న నేమాయె? ఆమెను గూర్చి నీవు పలుమారుం జెప్పుచుందువుకాదా! ఎన్నెన్ని సంగతులో నీవలననే నాకుం దెలిసియున్నవి. వీనింబట్టి



మాలతి:—ఏమి? శాంతయు ననుం బ్రేమించుచున్నదా?

యామె నామనసున కెక్కినది. ఆమెం గాంచుటకు నా డెంద మెంత యాతురంపడుచున్నదో నీ కేమి తెలియును? దాదా! నిజమేనా, నిజముగనేనా, వివాహమునకు ముహూర్తమే? జూడరాదు? నన్నొకమారామెకడకుం గొనిపోవా?

శ్రీని:—ఛీఛీ; ఇంక మిగిలియున్న యీ యెనిమిది పది దినములలోనే యింతటిప్రయాస యేటికి? అచటికిం బోవలెనన్న నొక్కదినమంతయు 'రైలు' ప్రయాణము. అటుపై నిరువదైదుమైళ్ల యెద్దులబండ్ల ప్రయాణము! అటుగాకున్న నేను తరుచుగం బోవుచుండనా? నా కొకరడ్డమా? అదియుంగాక, శాంతయు నినుంజూడం గుతూహల మందుచునేయున్నది.

మాలతి:—ఏమి? శాంతయు ననుం బ్రేమించుచున్నదా?

ప్రత్యుత్తరము నిరీక్షింపకయే యాముగ్ధ వెండియుం బలుకసాగెను. "దాదా, అమ్మ మనల వీడిపోయినప్పటి నుండియు నీ వొక్కండవె నాకుం గనంబడుచుంటివి. అన్య మెద్దియుం గాన్పించుటలేదు. అనంతరము నీవు నాంగ్లదేశమున కరిగితివి. అప్పుడు నాకుం బిచ్చిపట్టినట్లైపోయెను. వినాయకరావు నన్ననేకవిధముల శాంతవచనములచే నూఱడింపం బ్రయత్నించుచుండును. కాని యేమిలాభము? ఇంక నీవువచ్చితివి. శాంతయు వచ్చినచో నీయానంద నివాసమున శాంతి పూర్ణీభవించునుగాదా! ఈ 'యానంద నివాసము' నిక్కవముగనే మన కానందనివాసస్థానము కాంగలదు. ఉండనిమ్ము. అం చెప్పుము. తొలుత నీవామె నెచట సందర్శించితివి?"

శ్రీని:—ఇంక నెన్నిమారు లుచ్చరింపవలెను?

మాలతిబిగ్గరగనవ్వి "ఔనౌను. మరచితిని. రావుబహదూర్ ఆప్టేగారింట భోజన సమారంభకాలమున కాదూ? ఆహా! అప్పుడు నేనేల పోకుంటినో? ఏమేమి వింతలు జరిగెనో! మీ రిద్దఱును నేమేమి ముచ్చటించితిరో? ఎటుల నవ్వితిరో? అన్నియుం జూచియుందునే. దాదా, నిజముగానే, శాంత నీకుం బత్నియగుచున్నదని విని నా కెంతటి సంతోషమగుచున్నదో నీ కెట్లు తెలుపుదును? ఈతోటలో, ఇందే కూర్చుండి, మేమిద్దఱ మెన్నిరీతులనో ముచ్చటించుచుండెదము. ఎంతో మాటలాడవలెను." అని ప్రేమపూర్ణస్వరమున ననెను.

శ్రీని:—అంత ముచ్చటల కేమివ్యవహార మున్నది? మాటాడవలసిన విషయము లన్ని యేమున్నవి?

కాని, మాలతి యీవినోదానుభవమున కర్హమగు స్థితిలోనుండలేదు. ఆమె ప్రఫుల్లవదనము మ్లానమయ్యెను. సోదరుఁ డడిగిన ప్రశ్న యామె వినిపించుకొనలేదు. ఒక్కవేఁడినిట్టూర్పు వెలిపుచ్చి "దాదా, అమ్మ యిప్పుడు బ్రతికియున్న నెంతగ సంతోషించునో కదా!" అని కన్నీరొలుక ననెను.

ఈ భాషణమువలన శ్రీనివాసుని హృదయము కఱఁగెను. నిస్తబ్ధుఁడైయుండెను. అల్పకాల మూరకుండి యతఁడు "అమ్మ జీవించియుండిన నాకీ పెండ్లియే యైయుండ"దనెను.

మాలతి:—ఆశ్చర్యచకితయై "అమ్మ జీవించియుండిన నీకీపెండ్లి యైయుండదా? ఎందుకన్నయ్యా?" అని కుతూహలముతో నడిగెను.

శ్రీనివాసుఁడు గంభీరవదనుఁడై మాలతియెడ నిస్తబ్ధుఁడై చూచుచుండెను. ప్రత్యుత్తర మీయలేదు. మాలతి మరలఁ బ్రశ్నించెను; "దాదా, అమ్మ జీవించియుండిన నీకెందులకీ పెండ్లి యైయుండదు?"

శ్రీనివాసుఁడు కాలయాపనమొనర్చుటకై యిట్టులనెను. "అది కాదు, మాలూ! అమ్మ బ్రతికియున్న నేనాంగ్లదేశములకు,విద్యార్జన నిమిత్త మరిగియుందునా? ఇంతవఱకు నవివాహితుఁడుగనే యుండియుందునా?"

మాలతి:—అట్లేటికి, దాదా? అమ్మ, నిన్నాంగ్ల భూములకంప వలెనని యేయనుచుండెఁగాదా! నీవేదియో నాకుఁజెప్పక దాఁచుచున్నావు.నిజము నాకుఁదెలుపవా?

శ్రీనివాసుఁడు క్షణకాల మామెఁ జూచుచుండి గంభీరముగా నిట్లనెను. "మాలతీ! నీవు పెద్దదాననైతివి ఇప్పు డన్నియు నీకుఁ దెలియుచున్నవి. ఇప్పటివఱకును నిజముగానే, యొక్క విషయము నీకుఁ దెలుపక దాఁచుచున్నాను. కాని, యిప్పుడు చెప్పివేయుదును. మాలతీ, నీవు నాకు నిజముగ సోదరివి కావుసుమా!"

మాలతి శ్రీనివాసునకు సోదరికాదు; మఱి, భూమండలమున నేఁడీ మాలతి కెవ్వరును లేరు! శ్రీనివాసుఁడు తన కగ్రజుఁడు. అతఁ డొక్కఁడే తనకు 'నా' యనుకొనుటకర్హుఁడని యింతవఱకుమాలతిభావించియుండెను. కాని, యతఁడును నేఁటినుండియు నామె కెవ్వఁడును గాఁడు? ఆమె హృదయము ద్విధావిదారిత మయ్యెను? లోకమంతయుఁ గిరగిరఁ దిరుగుచున్నట్టు లాబాలికకుఁ దోఁపసాగెను. తన యుత్తమాంగము నిరుచేతుల గట్టిగ నదిమి పట్టికొని, యామె పుడమిపై దృష్టి నిలిపెను.

శ్రీని:—మాలతీ! నీవు మాయమ్మకు నెచ్చెలియై యుండిన యొక యనాథకు బిడ్డవు. నీ వేకవత్సర ప్రాయవై యుండ నీజనని పరలోకగత యయ్యెను. అప్పటినుండియు నీవు మాయమ్మయొద్దనె పెరిగితివి. నే నప్పు డేడేండ్లవాఁడను. కావున నివన్నియు నాకుఁ దెలిసియున్నవి. నిన్నే నాకిచ్చి వివాహమొనర్పవలయునని మాతల్లి యభీష్టము. కాబట్టియే, యమ్మ జీవించియుండిన నాకీవివాహమయియుండెడిదికాదని యంటిని.

ఈ వాక్యము లన్నియు నాబాలిక వినియెనో లేదో చెప్పశక్యముకాదు. ఆమె హృదయ మీ సమయమున ననిర్వాచ్యగాఢతిమిరాచ్ఛాదితమై యుండెను. అంతఃకరణ మాలోచనాశూన్యమైయుండెను. హృదయమనంత వేదనా పరిపూరితమైయుండెను. కారణ మామెకే తెలియదు!

ఎవ్వని నాబాలిక గాఢాంధకారములో నిప్రకాశమని భావించియుండెనో, యాప్త బాంధవు లెవరును లేనప్పు డెవ్వనిఁ బ్రేమించి తా నానందనిమగ్న యగుచుండెనో, తన సర్వసుఖములకు, సమాధానములకు సర్వాధారమని యెవ్వనిఁ దలఁచుచుండెనో, యెవ్వ నామె తనప్రాణములకన్న నధికునిఁగాఁ దలఁచి ప్రేమించుచుండెనో, అతఁడు- ఆ శ్రీనివాసుఁడు- తన కన్న కాఁడు- కాడు- తనకెవ్వఁడునుగాఁడు! అతనికి నామెకు నెట్టి సంబంధమునులేదు. బాంధవ్యము లేదు. అతని బ్రేమించుట కామె కధికారము, స్వాతంత్ర్యము లేదు. మాలతి, యీ విశాలభూమియం దొక నిరాధారబాలిక అగతిక! ఎవ్వని నామె తనవాఁడని యెంచుచుండెనో యా శ్రీనివాసుఁ డామె కెవ్వఁడును గాఁడు! అతని ప్రేమ భవము ననుభవించుట కామెకు స్వతంత్రతలేదు. ఆమె హృదయము వ్యథితమయ్యెను. ఈ విచారమంతయు భరించుట కామె కోమల చిత్తము సిద్ధమైయుండలేదు. శ్రీనివాసుఁడు తెలిపినవృత్తాంతమువలన నామెకు మహాఘాతమైన ట్లుండెను. అనంతవేదనా ప్రపూర్ణ స్వాంతయై పోయెను.

మెలమెల్లఁగ, చతుర్థీక్షీణ చంద్రికళ లస్తంగతములు కాసాగెను. ఆ యుద్యానము, ఆముక్తావలీ రమ్య ప్రవాహము, ఆ పరిసర సకలసృష్టి, సర్వము నంధకార విలీనమైపోయెను. పాపము! ఆబాలిక యజ్ఞానబాలిక వలె నెలుఁగెత్తి యాక్రందనము సేయఁదొడఁగెను.

శ్రీనివాసుఁడు "మాలతీ, పిచ్చిదానివలె నిట్లు గోడించెదవేల! నీవు నేను సేకోదర జన్ములము కాక పోయినను, నీవు నాకు సోదరివేసుమా! నేను నీకుఁ బూర్వమువలె, సోదరుఁడనే! మనకు వేఱు బాంధవ్య సంబంధము లేకపోయినను, చిన్ననాఁట నంకురించి యింతవృద్ధియైన యీ ప్రేమపాశము తెగఁగలదా? మఱియు, నిక్కమగు ప్రేమ బాంధవ్యసంబంధముపై నవలంబించియే యుండునా? నీవు నాకనుజవు కావు. అని నాకుఁ దెలిసియుండియు, నింతవఱకును నీతో నే విధముగ మెలఁగుచుంటినో నీవెఱుఁగవా? మాలతీ, నీపై నాకుఁ బ్రేమ కలదో లేదోయని శంకించుచుంటివా? ఈ యల్లలనాడు లతలు, ఈ హసించు పుష్పములు, ఈ గానమొనర్చుచుఁ బ్రవహించు ముక్తావలి, ఆ విశాల నీలాకాశము, అందు విలసిల్లు తారకాగణములు, వీని నన్నిఁటిని స్మరించి చెప్పుచున్నాను, వినుము: నేను నీ కిప్పటివలె, సోదరుఁడనే! నీవు నాకెవ్వరవును గాక పోయినను, నీశ్వరునిసంసారమున మనస హోదర ప్రేమము నిర్మింపఁబడియున్నది. రేపు శాంత యిచటికి వచ్చినప్పటికి నీనాసగముహృదయము నీయధీనమే! నా ప్రేమము విశుద్ధమైనది. స్వర్గీయమైనది. ఏనాఁటి కిని నష్టమందఁజాలదు. మాలతీ! నీవు నాకు దేవతలకన్న నధికపూజ్యవు. అధిక ప్రియతమవు!"

శ్రీనివాసుని కంఠము నిరుద్ధమయ్యెను. నేత్రము లవిరళాశ్రుధారలు ప్రవహింపఁజేసి మాలతికభిషేచనముఁ గావించెను. తన యనుఁగు నన్నకంఠము నొకచేతఁ బెన వైచి, యతని భుజపీఠికపైఁ దలను విశ్రమింపఁజేసి, యా ముగ్ధహృదయ యించుక తడ వశ్రుమోచనము చేసెను. అనతికాలములో నిరువుర హృదయములయందును శాంతము స్థావరమయ్యెను. వృష్టిపాతమైన పిమ్మట సర్వసృష్టియు నేవిధమగు నూతన తేజము వహించునో యట్లే వారిహృదయములు, బాష్పవృష్టిపాతమునకనంతరము ప్రఫుల్లములయ్యెను. మాలతి సహోదరుఁడు మాలతికి లభించెను. అతనిఁ బ్రేమించుటకును, నతనిచేఁ దాను బ్రేమింపఁబడుటకును, నామె కిప్పు డధికారము లభించెను. స్వాతంత్ర్య మొదవెను. మఱి మాలతి హృదయమున దుఃఖమునకు స్థలమెక్కడిది? పూర్వమువలెనే యామెమన సుల్లసితమయ్యెను. అందలి పూర్వపు బాంధవ్యము నశించెను గాని, వారి ప్రేమ మాత్ర మిప్పుడు ద్విగుణమయ్యెను.

౨

మూఁడు సంవత్సరములు గడచెను. ఈయవకాశమున ననేకవిషయములు ఘటిల్లెను. కాని యవ న్నియు ననంతకాలప్రవాహమున విలీనమైపోయెను.

ముక్తావలీనదీతీరమందలి శ్రీనివాసరావు గారి "ఆనందనివాసభవన" మం దొక మందిరమున దీపము ప్రకాశించుచుండెను. ఆ గదియంతయు నవీనములగు సామానులు మొదలగువానిచేత సుశోభితమైయుండెను. గదిమధ్యము చెంతనున్న స్ఫటికశిలానిర్మితమైన బల్లప్రక్క శాంత వేత్రాసనాసీనయైయుండెను. గవాక్షమార్గములో పలఁబ్రవేశించు మందశీతలవాతోపభోగ మందుచు, నొక డోలాసనమున శ్రీనివాసుఁ డర్ధశాయియై "రత్నావళీ"నాటకములోని కొన్నిశ్లోకములు పఠించి యామెకు వినిపించుచుండెను. శ్రీనివాసుఁ డాంగ్లభూములకరిగి యాంగ్లవిద్యాభ్యాస మొనర్చియున్నను నాంగ్లాచారవ్యవహారము లతని కలవడియున్నను సంస్కృతభాషయందుఁ బ్రేమను ద్యజించియుండలేదు. అతని కాదినుండియు సంస్కృత కావ్యనాటకాదులయం దధికానురాగము. అటు చదువుచుఁ జదువుచు నాతఁడు "శాంతా! మాలతి యెందున్నది? నేఁడు రత్నావళీనాటక శ్రోత యొకతె తగ్గినందున నేట్లోయున్నది." అనెను.

శాంత, యస్ఫుటముగా నిట్టూర్పు పుచ్చి "నేఁ బోయి పిలిచి వచ్చెద" ననెను.

శ్రీని:—"వలదువలదు. నీవిక్కడనుండవచ్చును. లేచిపో నక్కర లేదు. తోఁటలోఁ దిరుగుచున్నదో,

పక్షులకు మాటలు నేర్పుచున్నదో, నదీతీరమున సంచరించుచున్నదో ! ఏక్కడ నున్నదని వెదకి తెత్తువు ? వచ్చునిప్పుడామె తనంతనే!"

పిమ్మట నొక శ్లోకముఁ బఠించి తదర్థము నామెకు విశదీకరించి శ్రీనివాసరావొక్కమారామెను దిలకించెను. ఆమె కనులం దశ్రుకణములు విలసిల్లియుండెను.



శాంత: "ఏమి ? శ్లోకమా ?" అని యాశ్చర్యచకితయై యనెను

శ్రీనివాసుఁడు నగుమోముతో "శాంతా, నీవెంతటి కోమలహృదయవే! ఈశ్లోకము విని నీకంత దుఃఖమేలఁ కలుగవలెను ?" అనెను.

శాంత "ఏమి ? శ్లోకమా?" అని యాశ్చర్యచకితయై యనెను.

శ్రీనివాసున కిప్పుడు తెలిసెను. ఆమె హృదయమన్యవిచారవ్యాప్తమై యున్నది. హృదయమున నెట్టిదో దారుణ యాతన యగుచున్నది; కవితకడ నామె మన సుండలేదు. ఆకనులందలి యశ్రువు లాశ్లోకార్థ మెఱుఁగుటచేఁ గలిగినవి కావు? అతఁడు చదువుట చాలించెను. పుస్తకము బల్లపైఁ బడవైచి, యాతఁడు శాంతను సమీపించెను. కన్నీరుఁ దుడుచుచు నీవిధముగఁ బలుక సాగెను.

"శాంతా! నీ మధురమందహాస మేటు మాయమై[...] నది? వివాహమునకుఁ బూర్వము నేను మీయింటికి[...] బలుమరు వచ్చుచుంటినిగదా! అప్పుడు నీయానన మపూ[...]ర్వానంద తేజ మొలుకుచుండెడిది: కాని యిప్పుడు [...]వుదాసీన భావముతో నున్నట్లు కనఁబడుచుంటివి! గు[...] విచారమేదియో నీహృదయమున గాఢముగ నెలకొని యున్నట్లు తోఁచుచున్నది. పూర్వము నీవు నా[...] నెంతయో పలుకుచుందువు; ఒకానొక యజ్ఞాన బా[...]కమువలె నెంతో యుల్లాసముతో నుండుదానవు; [...] యన్నియు నిప్పు డేమైపోయినవి? నీ వింత ఖిన్న[...]టకుఁ గారణమెట్టిది? పలుకరించినను బ్రత్యుత్తర[...] దగురీతి నొసఁగుటలేదు. కారణమేమి? నన్ను వివా[...]మాడినందుల కిప్పుడు నీకుఁ బశ్చాత్తాపమగుచుండ[...] కదా, శాంతా !"

ఈప్రేమపూర్వకోపచారభాషణము [...]ర్ణించి, యామె దుఃఖము వృద్ధింగత మయ్యెను. [...] యాస్థితిలోనే గద్గదస్వరముతో నస్ఫుటముగాఁబలికె[...] "ఇట్టిటికి? వివాహమాడినందులకుఁబశ్చాత్తాపముకా[...] నాకు సర్వస్వము మీర! మీ సాన్నిధ్యసహవాస[...]

నాకు నరకము సైతము స్వర్గము! నాయందు మీ రుండ నెట్టి సంకటము లైనను నాకు సుఖదములే; ఆనందమయములే. అట్టియెడ మిమ్ము వరించినందులకు నాకుఁ బశ్చాత్తాప మేల కావలయును? కాని—"

శ్రీనివాసుఁడు ధీరతతో "కాని, యేమి! శాంతా! శ్రమము వచింపుము. నీ యీ సందిగ్ధభాషణము నా హృదయమును విదారించుచున్నది. నీ కది తెలిసిన—"

శాంతాహృదయ మధికాధికవ్యథిత మయ్యెను. ఆమె బహుప్రయాసతోఁ బలికెను: "లేనిపోనివి కల్పించికొని యేటికిఁ గష్టము నందెదరు? మిమ్ము వివాహమాడి నందులకు నేనెంతో సౌఖ్య మనుభవించుచున్నాను. కాని, నామూలమున మీకుమాత్రము దుఃఖ—"

"ఆఁ-దేనినిఁ బట్టి యిట్లనుచుంటివి?" శ్రీనివాసుఁడు కించిదాయాసముతో ననెను. "నా వర్తనమున నీకేపరివర్తనము కనఁబడినదని నిన్నుఁ బెండ్లియాడుట వలన నాకు దుఃఖ మొదవుచున్నదని గ్రహించితివి?"

భర్తకాగ్రహ మొదవుటచే శాంత భయపడెను. "నాలో నేసద్గుణము లున్న వని మీకు నా సన్నిధి నానంద మొదవఁగలదు? రూపమా, లేదు; సద్గుణమా యంతకన్నను లేదు. మీమనసు నేనెట్లు రమింపఁ జేయఁగలను? విద్యావతినైయుండిన, మాటలతోనైన మీ మన్ననందపఱతునేమో! నాయందు మీకుఁగల యపార ప్రేమకుఁ బ్రతిగా నొసఁగ నాకడ నేసాధనమును లేదే! ... నేర్చుకొందునన్న, నాకంత జ్ఞానము నొసఁగఁ ... నాపాపిదైవము! మీకు సంగీతముపై నధిక ప్రీతి; ... యెంత ప్రయత్నించినను, ఎంత కష్టించినను, ... సాధ్యము కాకున్నది. మరి, దేనిఁబట్టి మీరు ... ప్రేమింతురు? రూపము, గుణము, విద్య, బుద్ధి, ... చినను నేను మీ గోరునకైన నెనయగుదానఁ ... నాకు స్పష్టముగాఁ దెలియుచుండలేదా? ... వివాహమునకుఁ బూర్వము నుండియె నే నిట్టి ... మీకుఁ దెలియకుండ లేదు; నా యందు ప్రే ... మీకుఁ జాలినదిగాఁ గనఁబడి యుండనోపు. ...ప్రేమయే—"

శ్రీనివాసుఁ డీ భాషణమంతయు నాశ్చర్య ... పబ్ధుఁడై యుండెను. కాని యిఁక విన ... ఇంచుక నగి యతఁ డిట్లనెను:

"శాంతా, విద్యలో నీవు నాకు యోగ్యవుకావని యెవరందురు? నేఁటి నీ యిప్పటిభాషణముఁ బోలి భాషింపఁగలవా రెందఱుందురు? ఇఁక సౌందర్యవిషయమున నంటివా? నీవు రూపసి వగుదువో కావో నిర్ణయించు నధికారము నీయది కాదు. ఆ యధికారము నాయది!. కాని, యీవిషయమున నీకు దుఃఖ మొదవుచుండు నేని, నిక్కము వచించుచున్నాను. నీదుఃఖము కల్పితము. అర్థహీనము! కాదు, శాంతా! పరిహాసము కాదు. నిజము వచింపుము. నీకన్న నధికతర సౌందర్యవతియు సద్గుణరాశియు నేలోకమందైన దేవతాస్త్రీల లోనైన నుందురేమో చెప్పుము! నీ పాదధూళివలన దేవతలు పవిత్రు లగుదురు; నీ యోగ్యత యట్టిది. నీవు నా హృదయస్వామినివి. నా గృహదేవతవు! మ ఱేమి కావు. నీవు నా సర్వస్వమవు. నిన్నుఁ బెండ్లియాడి నేను దుఃఖినైతివా? శాంతా, యేమంటివి? నీవు నా సౌఖ్యఖనివి!"

పతియాడిన యీ ప్రేమపూర్ణవాక్యము లామె నానందసాగరమున నోలలాడించెను. ఏమి? శాంత కొదవిన దుఃఖమంతయుఁ గేవల కల్పితమేనా? కేవల భ్రమమూలమున నే యామె యింతకష్టమును జెందియుండెను. ఆమె శ్రీనివాసుని పాదములపైఁ దలనిడి, యానంద మిళిత దుఃఖముతో ననెను." నే నత్యంతపాపిని నాకు నరకమందైన స్థానము దొరకదు. మిమ్ముఁబోలు ప్రేమామయస్వరూపు లగు భర్తవిషయమున సంశయము వహించితిని. ఈ పాపమునకు ఘోరప్రాయశ్చిత్త మవసరము. కాని, ప్రసంగము వచ్చినది; కావున మనసున నున్నదంతయుఁ గ్రక్కివేయుదును. నాయంతఃకరణమున కేది నరకయాతన యొసఁగుచున్నదో, దాని నిప్పుడ వెలిపుచ్చెదను. నాయీయపరాధమునకు మీకుఁ దోఁచిన శిక్ష యొసఁగుఁడు. మీచేతులలోఁ జచ్చుటయు నాకు సుఖమే! నా ప్రాణమును మీచేతులలోఁ బెట్టియున్నాను. ఎటు చేసినను సరే! కాని, నేనేమి చెప్పుదును? చెప్పుదు నేమని? నాహృదయ మేకరీతిగ దగ్ధమగుచున్నది! దేవతాసదృశుఁ డగు భర్త నాకు లభించియు, నేను, నాదుర్గుణముల మూలమున, దుఃఖముం దెచ్చిపెట్టుకొంటిని! నాపతి చంచలమైనది. నన్ను క్షమింపుఁడు. నాకుఁ దోఁచినదిక దా! మీరు-నన్నుఁ-బ్రేమించుచుండ-లేదు. మాలతి—"

అటుపై మాట యామెనోట వెడల లేదు. లజ్జానుతాపదుఃఖము లొక్కట, నామెఁజుట్టుముట్టి మౌనముద్రికఁ దగిల్చివేసెను.

ఆమె యాడిన విచిత్రభాషణము విని శ్రీనివాసుఁడు విస్మయచకితుఁ డయ్యెను! ఈభాషణ మందలి భావ మాతనికి స్పష్టముగా గోచరము కాలేదు. అతఁ డది యెఱుఁగుకొఱకు గంభీరముగా "శాంతా, యేమంటివి? 'మాలతి' యని యేమంటివి?" అనెను.

"మీరు—మాలతిని—ప్రేమించు—చున్నారు!" ఎట్టకేలకు శాంత భయముతోనే కొంచెము ధైర్యముఁ దెచ్చుకొని యా యర్ధవాక్యముఁ బూర్తిచేసెను. తల వ్రేలవైచెను. ముఖము లజ్జాపాంశురమయ్యెను. పతి కడఁ గనులెత్తి చూడలేకపోయెను.

శ్రీని:—"మాలతినిఁ ప్రేమించుచున్నానా? మాటల కర్థమేమి? మాలతి నాకు సహోదరి కానంతమాత్రమే మైనది? నాతల్లి పెంచినది. నాతల్లికిఁ బెంపుడు గూఁతురు. నాకుఁ బెంపుడుఁ జెల్లియ. నా ముద్దుల చెల్లియ! నీ విది తెలిసియే యున్నావుకదా! ఇప్పుడేమి? బాల్యమునుండియే నేనామెను మిక్కుటముగఁ బ్రేమించుచున్నాను."

"కాని, మీ ప్రేమ భగినీ ప్రేమకాదు!"

తటాలున ననెను శాంత. తత్క్షణమే యామెకుఁ బశ్చాత్తాప మయ్యెను. శ్రీనివాసున కత్యంతాశ్చర్యమయ్యెను! "ఈ ప్రేమ భగినీప్రేమ కాదు! ఏమీ దారుణాఘాతము!" ఇప్పు డాతనికి శాంతహృద్గతము స్పష్టమయ్యెను. అతని కధికదుఃఖ మొదవెను. కాని, యప్పటికిని విషాదముతో నగి, "అట్లయిన, శాంతా! పూర్వమే నే నామెను వరించి యుండనా? నిన్నేటికిఁ బెండ్లి యాడవలసివచ్చును?" అనెను.

పతి శాంతవృత్తిం గని యామెకుఁ గించిద్ధైర్య మొదవెను. "అప్పుడు మీ హృదయము మీకుఁ దెలిసి యుండలేదు."

"అట్లయిన నిప్పటికిని నా హృదయము నాకుఁ దెలియలేదనియే చెప్పవలసి వచ్చుచున్నది. ఏలన, నేనిప్పటికినిఁ బూర్వమువలెనె, మాలతియెడ భగినీప్రేమ మునిచియున్నాను. నా కామెయందలి పూర్వపుఁ బ్రేమయందును నిప్పటి ప్రేమయందును భేదము కనఁబడ
లేదు."

"ఇంతవఱకుఁ గానరాకున్నను మునుముందైన
గనఁబడఁగలదు. ప్రేమము వృద్ధియగుటకుఁ బూర్వ
దానిస్వరూప మిట్టిదని తెలియుట కఠినము. మ
హృదయములు మన మెఱుఁగుట కష్టము. మనము
యఁజాలము. నే నిది యిట్లని చక్కఁగ నెఱుఁగుదును."

శాంతాహృదయము దృఢసందేహావృతమైనందు
కాతనికి మిక్కిలి దుఃఖమయ్యెను. తనపై వజ్రాఘా
మైనట్లుండెను. ఈమె సందేహము నేవిధముగఁ బరిహ
రింపవచ్చునో తెలియుటలేదు. "నా యే ప్రవర్తనము
గని నీ వీవిధముగ నన్ననుమానించుచున్నావు?"

"మీపలుకులు, చూడ్కులు, నడకలు, మీహృ
తమును బదేపదే వెలిపుచ్చుచున్నవి. అనేక సందర
ములలోఁ గష్టము లొదవుచుండుటవలనఁ, బ్రేమ వృ
యగుచుండెను. మీకు నట్లే యైయున్నది. మీకు మీ
మాలతిపైనున్న ప్రేమ భగినీప్రేమయే యని మీ రిప్ప
కిని భావించుచుండవచ్చును. కాని, నిజముగా న
యది కాదు. నేను దృఢముగాఁ జెప్పఁగలను. మీ
మాలతియెడ నున్న ప్రేమ భగినీప్రేమకాదు—కాదు—
కాదు—మీకు నిజమగు ప్రేమ మాలతిపై నున్న
నాయం దేమాత్రమును లేదు."

"కష్టము లొదవుటవలనఁ బ్రేమవృద్ధి యగు
లోకు లనుకొనుటను బట్టియే నీవు ననుచున్నావు. మా
తిపై నాకు నిజముగఁ బ్రేమ కలదని యెట్టిచిక్కునుబ
యది వృద్ధిఁజెందినదని గ్రహించి యిట్లంటివి!" అ
శ్రీనివాసరావు విరక్తిస్వరమున నడిగెను.

"నన్నుఁ బెండ్లియాడిన చిక్కునుబట్టి; నేను
సౌఖ్యమార్గమునకుఁ గంటక—"

శాంతాకంఠమూ దుఃఖపూర్ణమయ్యెను! విహ
మయ్యెను. అహోరాత్రము లామె యింతవఱకు లో
ననే యణఁచిపెట్టుచుండిన దుఃఖమంతయు నొక్క
ట్టున, నిప్పు డశ్రుప్రవాహమార్గమున వెలువడె
అత్యంత ప్రయాసతో నా దుఃఖము మ్రింగి యి
పలుకసాగెను. "నేన మిమ్ము దుఃఖమునఁ ద్రోసితి
నన్నుఁ బెండ్లియాడుటకుఁ బూర్వ మొక్క మాలతి

మీ కుండెడిది. వేరెవ్వరు నుండలేదు. ఆమెతోఁ బలుకుటలో, నగుటలోఁ, దిరుగుటలో, మీకాలము గడచుచుండెను. మీ మ్మదియేమని యడుగువారెవ్వరు నుండలేదు. కావున, మీరు మాలతినిఁ బెండ్లియాడనెంచి యున్నను నడ్డుపడువా రెవ్వరు నుండలేదు. కాని, మీకట్టి యవసరమేమియు నుండలేదు. మీ మనమును మీ రెఱుఁగరైతిరి. ఇప్పుడు నన్నుఁ జేపట్టుటవలన మీరు పూర్వమువలె మాలతితోఁ బ్రవర్తింపుటకు వీలుగలుగదు. మీకాలమంతయు నేన తీసికొనుచుంటిని. మీరెక్కడనున్న నేను వెంటనుండుటచే మీరు మాలతితోఁ 'బూర్వమువలెఁ' బలుకుట కాటంక మొదవెను. ఆయాటంకముల మూలమున మీకు మాలతితోడ సహవాసము తగ్గసాగెను. సాన్నిధ్యసహవాసము కొఱవడుటచే లోని ప్రేమ వృద్ధింగతము కాసాగెను. మీమనస్సామె సాన్నిధ్యమును, ఆమె సహవాసమును, గోరుచుండుటవలన, నాయందలి ప్రేమము తగ్గెను. నాయందు విరక్తి కలుగఁదొడఁగెను మీయిద్దఱ యా బాల్యప్రవర్ధమానప్రేమలో నేన యడ్డుపడితిని."

ఈ వాక్యము లాకర్ణించిన శ్రీనివాసున కంతటి దుఃఖమున సైతము, నవ్వు రాకమానదయ్యెను. "శాంతా! నీ వొకానొక న్యాయసభలో, న్యాయాధీశునితో వాదించినను నాతనిఁ జిటుకలో నోడింపఁగలవు! నా కం దణుమాత్రమును సంశయము లేదు! కాని పండితమహాశయా, అటుపై నేమైనదున్నదా! మీ యుపన్యాసము ముగిసెనా, కాక, యింకను మిగిలి యున్నదా? కానిండు, ఆఁపుట యేటికి? చెప్పవలసినవాని నన్నిటి నొక్కసారే చెప్పివేయుఁడు!"

శాంతాబాయికినిఁ గొంచెము నవ్వువొడమెను. కాని, మఱుక్షణముననే ముఖమండలముపై విషాదరక్తిమ పొడకట్టెను. "నా పలుకులు నవ్వులపాలైనవా? వలదు, వలదు. మాలతియందలి ప్రేమ నిజమగు ప్రేమయనియు, నాయందలి ప్రేమయే నిజమగు ప్రేమయనియు, మీరు కేవలము నా మీదయనియు, నాకు రూఢిగఁ దెలిపిన— నిదర్శనపూర్వకముగ నాకుఁ దెలిసిన,—ఆహా! నాకంతకన్న నింకేమి యున్నది! అప్పుడు ననుఁబోలిన సుఖి- నన్నుఁబోలిన ధన్య-సౌభాగ్యవతి- యీలోకమున- మఱిలోకముననైన, మఱియొక్కతె యుండఁగలదా? నా డెందమున నెట్టి బాధయగుచున్నదో; ఎట్టి యగ్నిజ్వాల ప్రజ్వలించుచున్నదో యెఱిఁగిన, మీ రివ్విధముగ నవ్వియుండరు. నేను బండితనుగాను. నాయొద్ద నెట్టి పాండిత్యమును లేదు. కేవల మీయొక్క సంశయచింతనమే యనవరతము నా మనసున జరుగుచున్నది. అహోరాత్రములు నీయొక్కటే సంశయపిశాచము నన్నుఁబట్టి పీడించుచున్నది! ఒక్కొక్కప్పు డీసంశయమే నాహృదయమును జీల్చివేయును; మఱొక్కప్పు డీయొక్క సంశయమే మీమీఁద ననేకవిధకల్పనల కెడమిచ్చుచున్నది. అదియే నన్ను బహుభంగులఁ బీడించుచున్నది. ఈయొక్క విషయము నకే- కేవలము నొక్క విచారముననే- నాతల గిఱ్ఱునఁ దిరిగిపోయెడిని; ఈయాలోచనతోనే- ఈవిచారముతోనే- ఈయొక్కటే సంశయముతోనే- నే నున్మాదినై పోవుదునేమో యని యొక్కొక్కప్పుడు నాకు భయమగుచున్నది."

"చాలుఁజాలు. చాలింపు మింక నా సకలసుఖాపేక్షయు నీయం దవలంబించియున్నది. నిన్నెంతగఁ బ్రేమించినను నాకుఁ దనివి తీరకున్నది. నీ సుందర విగ్రహము ననవరతము నాహృదయముననే భద్రపఱిచి, విరాజిల్లఁజేసి, పూజించుచున్నాను. ఇట్టియెడ, నీవే నన్నిట్టు లనుమానించుచుంటివి. నీ నోటనే యిట్టికఠోర వాక్యములు విననలసెనుగదా! ఆహా, యింతకన్నను నాహృదయము చీలిపోయిన నెంత బాగుండెడిది! ఇట్టి పలుకులు వినుటకన్నఁ బిడుగుపడి నాపైఁ బడిన నెంతగ సంతోషింతునో!"

శాంత యత్యంత వ్యాకుల స్వాంతయయ్యెను. తటాలున నామె యతని పాదములకెఱఁగి, యధికోద్వేగమున నిట్టులనెను! "నే నత్యంతపాపిని! నా కెట్టి ప్రాయశ్చిత్తమైనను జాలియుండదు. నే నింక జీవించి యున్నను మీకు నావలన సౌఖ్యమొదవఁజాలదు. నా పాడుమనసు సర్వదా దుఃఖించుచుండును; మిమ్మును దుఃఖపెట్టుచుండును. నాకనుజ్ఞ యిండు! నేను బ్రాణత్యాగమొనర్చి, నాపాతకములకుఁ బ్రాయశ్చిత్తముఁ గొందును. నాప్రాణము నాకిఁక భారమైనది. భరింపఁజాలను!"

శ్రీనివాసున కామెయెడ నిష్కళంకమగు ప్రేమయుండెను. ఆతనిహృదయ మీ దుఃఖపూర్ణ విహ్వలవాక్యములవలన ద్రవించెను, కన్ను లశ్రువుల వెలార్చుచుండెను. అతికష్టముతో నాతఁడామెను లేవనెత్తి, వక్షఃస్థలముపై నామెమొగము సేర్చి మృదు మధురస్వరముతో నిట్టులనెను:

"ముద్దరాలా! నే నాడినపలుకులకు విచారపడకుము. అపరిమితదుఃఖావేశ పరవశుండ నగుటనే నేదియో యనియుందును. నిన్ను నొప్పించియుందును. క్షమింపుమా! నీవు నేఁడు నీహృద్గతమంతయు, నొక్కటియు దాఁచక వెలిపుచ్చుచున్నావు. అదియు నా భాగ్యమే! నా యదృష్టమే. కావున నే యింతటి దుఃఖమునసైత మానందము, సుఖము, నాకుఁ బొడము చున్నది. ఇంకను నేమైన నీ వనవలసియున్నఁ బలుకుము. స్పష్టముగా నాకుఁ దెలిపివేయుము! ఒక్కటియు దాఁచకుము!"

"ఔను. నేనంతయు నిప్పుడు గ్రక్కివేయుదును. పిమ్మట నా వ్రా లెట్లున్నదో యట్లే యగుఁగాక! నన్ను మన్నించి, నా తప్పులన్నిటిని క్షమియించి, మీ పాదములచెంత నాకుఁ జోటిచ్చిన మిగుల సంతసింతును; కాదా, నా ప్రాణము నేమైనఁ జేసికొనుటకును నాకుఁ గష్టముగఁ దోఁచదు. నాకుఁ జావు రావలయునని యెన్ని రాత్రులు దుఃఖముతో గడిపితినో, యాదైవ మొక్కడే యెఱుఁగును!" శాంతా లోచనము లశ్రువులఁ బ్రవహింపఁజేయుచుండెను. శ్రీనివాసుఁడు శూన్యాంతఃకరణముతో నొక యాసనమునఁ బడియుండెను.

"పెండ్లియైన పిమ్మట నే నిచటికివచ్చినక్రొత్తలో మీరు నన్నెంతగఁ బ్రేమించుచుంటిరో నే నెఱుఁగకుండ లేదు. మీరు కచేరీ నుండి యింటి కరుదేరుటతోడనే, నన్నుఁగాంచిన మీ కెంతటి సంతోష మగుచుండెడిదో యదియు నెఱుఁగుదును. నాతో ముచ్చట లాడుచుండఁ గాల మెట్లు గడచిపోవుటయుఁ దెలియదు. కాని, క్రమక్రమముగా, నా దురదృష్టవశమున, నన్నియు మారుట కారంభమయ్యెను. కోర్టులోనుండి వచ్చిన వెంటనే ముందుగ మాలతి కనఁబడకున్న మీకేమియుఁ దోఁచదు; 'ఎందున్నది? ఎందున్నది?' అని పదేపదే గ్రుచ్చిగ్రుచ్చి యడుగుదురు; ఎందున్నను నామెఁదెచ్చి మీయెదుట నిలఁబెట్టినఁగాని మీకు సంతోషము కాదు; ఇవన్నియు నేఁదెలియుటకుఁ జాలకాలము పట్టలేదు; మీ రొక్కొక్కప్పు డెట్టి దీర్ఘవిచారములోనున్నను, నామె కనులఁబడినంత మీకు మహానంద మగుచుండును. మాలతి చెంతలేకున్నఁ జదువుటకును మీకుఁ దోఁపదు. ఆమె వచ్చి మీయెదుటనున్న, నామె సమక్షమునఁ జదువుటయును మీ కింపుజనింపదు. ఆమెతో ముచ్చటలతో నుండు వేళలలో, నెంతటిహర్షము మీమొగముపైఁ దాండవించుచుండెడిదో, చిత్రించుటకు నేనొక చిత్రకారిణినైయున్న నెంత బాగుండెడిది! ఎప్పటికప్పుడ యాచిత్రములను చిత్రించి, సమయ మొదవినప్పు డన్నియును మీకుఁజూపి యుందును. అయినను, మునిఁగిన దేమి? నేను జిత్రకారిణినిఁ గానంతమాత్రమున నేమి? నా హృదయఫలకముపైఁ జిత్రించికొనియేయున్నాను. మాలతీ విషయమున మీకు వృద్ధియగుచున్న యాతురత నేనెంతగ వర్ణించి చెప్పినను స్పష్టము కాఁజాలదు. మీసంభాషణములు, మీయాచరణములు, మీభావములు, ఇత్యాదులపైఁగూర్చి, మీకు మాలతిపైఁ బరుగువారుచున్న ప్రేమ స్పష్టముగఁ గనఁబడి నాయంతఃకరణము దగ్ధమై పోయెడిది. అడుగడుగునకును, మీముందర మాలతియుండ నే నెంతయుఁ గొఱగాని దాననని నాకుఁ దోఁచుచుండును. నాతో భాషించునప్పు డట్టియానందము మీ కగుచుండలేదు. నాతో నావిధముగఁగలసిమెలసి, యాడుచు నవ్వుచు నుండుటలేదు. కాని, మాలతిమాత్ర మెదుటఁ గనఁబడకున్న మీరు బెగడొందినట్లు కనఁబడుదురు!"

"మాలతి యగుపడదేని, నాకిష్టపు జనింపకుండుటయు, మాలతియందు నా కత్యంతప్రేమ ముండుటయు, నిక్కమము లే. నే నెప్పుడును గాదనను. కాని యందున నపవిత్రతయేమో, పాపమేమో నాకుఁ దెలియదు. నాపై నీకు విశ్వాసము కలదేని—"

"ఇంక నొక్క విషయము నామనసున బాధించుచున్నది, అదియుఁ జెప్పివేసెదను. మాలతి సెందరితో యడుగుచున్నను మీ రామె వివాహవిషయము గమనించుటలేదు. ఇప్పు డామెకుఁ బదునెనిమిదవయేఁడు!

ర్థి, వినాయకరావునకే యిచ్చెద నందురు; ఆ వినాయకరావు, ఆంగ్లదేశమునుండి వచ్చినప్పుడుకదా! ఎప్పుడు వచ్చునని కాచియుందురు? అంతకన్నను శ్రేష్ఠవరసంబంధము లెందును లేనేలేవా? అట్టి వారెవ్వరును వదుగనేలేదా? ఈవిధముగా మీరామె వివాహవిషయమున వహించిన నిర్లక్ష్యభావము సైతము నాకు సంశయకారణము!”

“ఆఁ తెలిసినది! మీ రీనాఁ డొడలు మరచియున్నారు. రాణీసాహేబా! మాలతి యిప్పు డజ్ఞానవు వనుకొంటివా? ఆబిడ్డ కిష్టము రానివరున కిచ్చి పెండ్లి చేయుమందువా? మాలతికి వినాయకునిపై పూర్వానురాగము కలిగియున్నది. వాజ్నిశ్చయ మైనట్లే! జాగ్రత్తమైనదే! మరచితివి కాఁబోలును! బహుశః ఈ వారు పరీక్షుడై రాఁగలఁడు. ఒక్కవేళ, రాక తడిసిన వాఁడొక్కనికిచ్చి పెండ్లిచేయుదుమా? శాభాష్! అన్నిటి కన్న నిదిబాగున్నది. నీవివాహ విషయములు స్మృతిపథమునుండి యిప్పుడు తుడువఁబడియెఁ గాఁబోలును! సమయమున మీతండ్రి నిన్నన్యునకిచ్చియుండిన నేమై యుండును? ఎంత వింతగనుండును? ఆహా! మచ్చరము! మాత్సర్య మింతకంటె నింకెంతద వ్వరుగఁజాలదు ?”

శాంతా నేత్రములు తెఱువఁబడెను. ఆమెను ఒట్టి లజ్జ యావరించెను. శ్రీనివాసుఁడు వేదనాపూర్ణముగఁ బలుకసాగెను. “శాంతా! యిట్టి యపవిత్రములతో, హృదయమును గళంకము గావించికొని, బాధింపకుము; నన్నును దుఃఖపెట్టకుము. వచింపనేనిప్పుడేమి చేసిన నీయనుమానము నినువీడఁ దన్నుము. నీవేమిచేయుమన్నను జేసెదను. కాని, వ్యర్థము దుఃఖము ద్యజింపుము. పవిత్రప్రేమను నిన్నుసాక్షిఁగా నిడికొని శపథమొనర్చును మాలతియందలి నాప్రేమ లేశమును దగ్గలేదు! అందు లోపములేదు. కాని, లేనిపోని సంశయములఁ బొందిన బాల్యమునుండియు నేకముగఁ బెరిగిన, కలసియాడిన, ప్రాణులను వేఱుపఱుపకుము. నా మాలతికి-నాకన్న నాప్తు లెవ్వరును లేరు. అట్టి వారి వియోగ మొనర్చిన నింకెవ్వ రాదరింతురు? దిక్కులేని యొవరివంకఁ గనులెత్తిచూడఁగలదు? వినాయకుఁడు మరలివచ్చినపిమ్మటఁ జింతలేదు. కాని, యప్పటికిని భ్రాతృప్రేమ మేమగును? అతఁడామె నావిధముగఁ బ్రేమించునా? పోనీ, నీవైన నాలోపమును భగినీప్రేమను బూరింపఁగలవా? పత్నీప్రేమ మెంతటి శ్రేష్ఠమైనను, నది సోదరీప్రేమస్థానమును బూరింపఁగలదని యా నీవిశ్వాసము? నీకదియె యిష్టమైన, నిప్పుడె మాలతిని వినాయకునింటఁ జేర్చివైచెదను. కాని, యిందువలన మాయిరువురహృదయములును దుఃఖవిదూరము లగునని మాత్రము తలఁపకుము. అంతయేకాక మాప్రేమ మఱియు వృద్ధియగును. ఆవిధముగానే, పత్నీప్రేమమెంత మహోత్తమమైనను-మహత్తర మైనదైనను-ఇట్టి కళంకముతోఁ గూడిన-ఇట్టియకారణ మాత్సర్యముతో మిశ్రితమైన-యాప్రేమవలన నేమాత్రము సౌఖ్య మొదవఁగలదో యదియు విచారణీయాంశమే! లోకమందలి యన్నిటికంటె నాకు నీవ యధికతమవు; అత్యంత ప్రియతమవు; కాని, యగతికయగు నాసహోదరిని, నన్ను, వేఱుచేయు నీచాతినీచకృత్యమునకుఁ బాల్పడకుము. నాసహోదరిని, నాకు మఱపుఁగలిగించు నధమాధమకృత్యమును బోధింపకుము. నీ వట్టిస్వార్థహితవు గాకుము. ప్రియురాలా! నాయంతఃకరణ మందంతట నీయందలి పవిత్రనిశ్చలప్రేమయే వ్యాపించియున్నది. నేనెచట నున్నను, నీమధురమూర్తినే స్మరించుచుందును. నీవు-నీవు - శాంతా! నీవే నాప్రేమ కధిస్వామినివి! నాహృదయాకాశమున విహరించు చంద్రరేఖవు నీవొక్కరితవే! అందు నక్షత్రములు సైతము వలదనకుమా! పాపము, మాలతి మందభాగ్య! ఆమె నీముందెంత? నీవామె విషయమున మత్సరగ్రస్తవు కావలయుఁగా! ఆమె విషయమున నీవన్యవిధముగ నాపై సంశయము వహింపవలయుఁగా! ఆహాహా! ఇంతకన్న నొక్కమారె యీప్రాణము లైదు నెగిరిపోయినను దుఃఖమొదవదు! శాంతా, శాంతా, నామాలతిని నన్ను వేఱుచేయకుమా. నీముం దామెకు యోగ్యతలేదు. కాని, యాదీనను బొత్తిగా మఱచిపోవుటకు నే నసమర్థుఁడను. నాశాంత! నామాలతి! ఆహాహా! ఈదివారాత్రములసంయోగము కలుగుటెట్లు? పత్నికి భగినియందు మాత్సర్యము! శాంతా, శాంతా! ఇట్టియకారణానుమానము నాపై నుంచకుమా! నన్ను క్షమింపుము!

ఈనీయవిశ్వాసము నాకు దుస్సహముగనున్నది. ఇంకను నన్నుఁగష్టపెట్టకుము. నాహృదయ మధికాధికదుర్బలమై యున్నది. అందుపై నిర్దయతో నింకను నధికఘోరతరాఘాత మొనర్పకుమా!"

అంత మాలతి యెందుండియో పరువిడి వచ్చి నవ్వుచు, నొక్కగులాబిపువ్వును శాంతాకేశబంధమున ముడిచి రెండవది శ్రీనివాసరావు నెదుటఁ జూపి "చూడుము. చూడుము, దాదా! ఈపూవు లెట్లున్నవో! మొన్న నేను నాటిన మొక్క లీరెండును బుష్పించినవి." అనెను.

శోకనిమగ్నమై యుండిన యాప్రదేశమంతయు మాలతీయాగమనము మూలమున నానందమయమయ్యెను. మాలతి సహజసారళ్యముఁగని శ్రీనివాసున కానందాశ్రువులు గిరఁకునదిరిగెను. మాలతి యజ్ఞానబాలిక. తనకై, తన సోదరుఁడును, వదినయు నేఁ డింతటి దుఃఖ మందుచున్నారని యామెకుఁ దెలియదు. తనయగ్రజుఁడు తన్న పరిమితముగాఁ బ్రేమించుటచేతనే యతనికింతటి దుస్సహదుఃఖ మొదవుచున్నదని తెలియదు. శ్రీనివాసుఁ డాపుష్పమును మందహాసముతో నందుకొని యాఘ్రాణించెను.

పునరగ్నిజ్వాలోదయ మయ్యెను! ఈహాసముఁగని నంత శాంత యస్థిరహృదయ యయ్యెను. శ్రీనివాసుఁడింతవఱకు నాడిన భాషణములవలన నామె డెంద మొ... కుదుటఁబడి యుండెను. ఇట్టియపవిత్రకళంకల నా... హృదయ మెట్లు తెడమిచ్చెనో తెలియక యామె లో... ననే చింతింపసాగెను. ఇట్టి కళంకల కిక నెడమీయ... దని నిశ్చయించియుండెను. ఆమెహృదయము కళంక... వర్జితమై నిష్కళంకమై యుండెను. క్షణకాల... ఇంతలో మాలతివచ్చుటయు, శ్రీనివాసుఁడు నగుటయు... గనులఁబడెను. శమించినదావాగ్ని మరలఁ బ్రజ్వరిల్ల... సాగెను. ఇట్టిప్రేమ మయమైన-ఇట్టి సౌఖ్యపూర్ణమై... హాసమెప్పుడు నామె చూచి యుండలేదు! ఇతనికిం... దనమనసు తనకుఁ దెలియ నేలేదని యామెకుఁ దోఁచె... ఈనవ్వు సాధారణమైనది కాదు. ఇట్టినవ్వు తనయద్దు... భాగమున లేదు! ఇట్టినవ్వు నెన్నఁడు నాతఁడుతన్నుఁగాం... నవ్వలేదు! అట్లయిన, నింతదనుక నాతఁడు చెప్పినదంత... నసత్యము లేనా, అనృతము లేనా? నిశ్చయముగా, శ్రీని... వాసరావు, తనవాఁడు కాఁడా? అతఁడు మాలతియా... డే నా? నిజము, నిజము. అతనికిఁ దనయందలి ప్రేమ... ము ప్రేమకాదు. మాలతియందలి ప్రేమయే నిజ... ప్రేమ! శాంతహృదయమున మరల నిర్భరనిరా... దుఃఖము వ్యాప్తమయ్యెను.

## 3

ఆదినము మొదలు శాంత నగుట నెవ్వరును జూడరైరి. వెనుకటివలెఁ గొంతతడవు సంశయపిశాచగ్రస్తయైయుండదు; కొంతతడవు పశ్చాత్తాపతప్తహృదయయై యుండదు. ఆమె సంశయపశ్చాత్తాపచక్రముల నడుమఁజిక్కి గిరగిరఁ దిరుగుచుండెను. కాని, సాధ్యమగునంతవఱకు నామె హృద్గతము శ్రీనివాసు నెదుటఁ బ్రకటించు చుండలేదు. ఆవిషయమునుగూర్చి యామె మరల నోరెత్తలేదు.

జరిగినదేమియు మాలతికిఁ దెలియదు, తనకై యింట నెంతటి యనర్థములు గలుగుచున్నవో యామె కణుమాత్రము దెలియదు. ఎప్పటిరీతి నామె యాడుచు నవ్వుచునుండెను. కాని, కొన్నిసమయములలో నింట దానౌసీన్యమామెకు గోచరమగు చుండెను; అప్పుడు మనసున కొక్కింత వెతకలుగును. ఈనడుమ, శాంత య... తోఁగూడి యుద్యానమునకుఁ గాని, ముక్తావలీన... మునకుఁగాని విహరింపఁబోవుట మానియుండెను. ... తితో దాఁగుడుమూత లాడుచు నామె కన్నొ... పోయి శ్రీనివాసుని చెంగట డాఁగుటయు లేదు; న... కత్యంత ప్రియములగుఁ బుష్పములనుగోసి, య... యలుఁగ, నామెను బహుభంగులఁ బ్రతిమాలి శాంతింప... నవ్వించుటయు లేదు; భర్తతోఁదా రాత్రివేళల నే... మున నేమేమి పలుకుచుండు నదియుఁ గొతుక... నామెకుఁ జెప్పి తొనగుటయులేదు. శాంత యిప్పుడు... రభావము వహించియుండెను; ఉదాసీనయై కను... చుండెను. మాలతి యెప్పుడైన నడిగిన "నేనింకను పిల్లనా నీతోఁగూడి యాడుచుఁబాడుచు నగుచుం... టకు? అని బదులు సెప్పును.

సంసార మహాసాగరమునఁ బడిన స్త్రీ లుదాసీన ...యుందురనియు, గంభీరలై యుందురనియు మాలతి ...ఱుఁగును. శాంతయే యామెకుఁ దెలిపియుండెను; ...మె ప్రవర్తనమును మాలతి చూచుచుండెను. కాని ...శ్రీనివాసరా విట్టులుండనేల? ఆమె కాహారముఁ గడు ...ఁ బోవనయ్యెను. ఎన్నిరాత్రులో యామె నిరాహా ...యై గడపెను. శ్రీనివాసుఁ డానందచిత్తవృత్తినుండ ...చిన నాతనితోఁ గొంతతడవు ముచ్చటలాడుచుం ...ను అప్పట్టున నింట నౌదాసీన్యము కొంతవఱకు మాయ ...పోవును. కాని, యాతఁ డొకింత నుదాసీనుఁడై కన్ప ...త, నెవ్వరును నాతనిఁ బలుకరింప సాహసింపరు! అంత ...న్నికడలను నౌదాసీన్యము, నిస్తబ్ధత, వ్యాపించును. ...నాఁటిరాత్రి, సోదరు నీ దుఃఖకారణము నాను ...నాఁడనుగ నామె నిశ్చయించెను. కాని, తెలవారిన ...పు, నామె నిశ్చయము చలించిపోయెను. ఆనాఁడం ...నాతఁ డుదాసీనభావముతో నుండెను. కావున ...ఱుంగుటకును నామెకు మనస్కరింపనయ్యెను. ధైర్యము ...ంగ లేదు. ఆమెకు వేదన దుర్భరమయ్యెను. ముక్తా ...నదీతీరమునకు వెడలిపోయెను; ప్రవాహము ప్రక్కన ...దిన్నెయపైఁ గూరుచుండి పేరెలుఁగున రోదింపఁ ...గెను. కాఁ డామె దుఃఖము నణంపఁజాలకపోయెను. ...బంచప్రాణములకంటె నధిక ప్రేమాస్పదుఁడగు ...డింతగ దుఃఖించుచుండ, నామెకుఁ దత్కార ...దెలియకుండ వలయునా? ఈవిచార మామెను ...వ్వాలఁగావించివేసెను.

"మాలూ! యేఁడ్చుచున్నా వేటికే తల్లీ? నీకేమగు ...?"

మాలతి తల పైకెత్తి చూచెను. అదే, శ్రీనివాసరా ...చెంత నిలిచియుండెను. ఆబాల దుఃఖము నిఁకఁ ...పోయెను. తన దుఃఖముఁ గాంచి సోదరునకుఁ ...గలదను సంగతి మఱచి పోయెను. ఆయార్ద్రదే ...సరలమనస్క యాతనిఁ గంఠాలింగన మొనర్చి ...బాష్పవిమోచనము సేయుచుండెను. ప్రత్యు ...గలదు? తనదుఃఖమునకుఁ గారణ ...నైన నెఱుఁగునా? శ్రీనివాసునకుఁ గనులు ... మాలతీ నేత్రబాష్పములను దుడుచుచు "బిడ్డా, యెందులకేడ్చుచుంటివే? శాంత నిన్నేమైన ననెనా? నీతోఁ గలహించెనా?" అని యను రాగార్ద్రస్వరమున నడిగెను.

"లేదు. శాంత నాతోఁ గలహింపలేదు. నన్నేమియు ననలేదు." మాలతి బహుకష్టముతోఁ బ్రత్యుత్తర మొసఁగెను. అప్పుడామె కంఠమున విషాదము పూర్ణీభవించి యుండెను. శ్రీనివాసుఁడు స్తబ్ధుఁడై పోయెను. "మఱి, యేడ్వనేటికి?"

"ఆమె నాతోఁ గలహింపలేదనియే నాకు దుఃఖమగుచున్నది."

"మేలు, మేలు! బాగున్నది నీదుఃఖకారణము! రా, రమ్ము; నిన్ను శాంతకడకుఁ గొనిపోయెదను. పిచ్చిపిల్లా!" అని యతఁడు నగుచు ననెను.

మాలతి కూర్చున్నచోటు విడిచి కదలలేదు; లేవలేదు. నవ్వనైనలేదు. విషణ్ణాననముతో నామె యందే కూర్చుండి యుండెను. శ్రీనివాసుని యౌదాసీన్యమునకుఁ గారణ మెట్టిదని యడుగ నామె కత్తరిఁ బ్రారంభింపవలయునో తోఁచుటలేదు.

"శాంత నీతోఁ గలహించుటలేదనియేనా నీ కింతటిదుఃఖము, మాలూ!"

"ఇంకనొక్క కారణమున్నది". మాలతి భయమందుచుఁ బలికెను. దాదా! నీకీనడుమ నేమగుచున్నది? నీవు నాతో వెనుకటివలెఁ బలుకుట లేదేల? నీకు నావలన నేదైన నపరాధము ఘటిల్లెనా?"

పూర్ణవిచారహృదయముతో గద్గదాస్పష్టస్వరముతో, మాలతి యడిగిన యీప్రశ్నవలన నాతని హృదయ మొక్క పెట్టున స్తంభించెను. అతని లోచనము లశ్రువుల వెలార్చెను. ఆ బాష్పబిందువు లామెపైఁ బడెను. మాలతి యులికెను. సోదరునిఁ దిలకించెను. ఆమె ముఖమండలము వాడిపోయెను. నిజముగనే, తనవలన నేదియో యపరాధము ఘటించి యుండవలయును. కాకున్న నీప్రశ్న వినినంత నతఁ డిట్లు బాష్పవృష్టి గురియనేటికి? ఆమె యత్యంత వ్యాకులచిత్తముతో దీనముగా "దాదా నిజమున నే నేయపరాధ మొనర్చితిని, చెపుమా? నాపై నీకుఁ గోపముగలిగెనా? దాదా! వలదు. ఇంతకోపమువల దీయనాథసోదరిపై దాదా!"

కంఠము స్తంభిత మయ్యె.— నోట మాట వెడల లేదు.

"లేదు, లేదు, మాలతీ! నీవెట్టియపరాధము నాకొనర్చియుండ లేదు. ఊర కేడ్వకుము." అతడు కన్నులు గుడుచుకొని, కష్టముతో ననెను.

"అట్లయిన నీవు నాతో వెనుకటివలె మాటాడుచుండ లేదేటికి? ఇప్పుడు కారణమడిగిన దుఃఖించెదవేటికి?"

"సౌఖ్యములో మాత్రమే నవ్వ నౌడదు" ననుటకు వీలు లేదు. ఆరిపోవునప్పుడును దీపము పెద్దదిగ వెలుగును గాఢాంధకారమునను విద్యుల్లత ప్రకాశించును. మాలతి యడిగిన యీ ప్రశ్న శ్రీనివాసుని దుఃఖభ్రాంతుని జేసివైచెను. కాని దుఃఖము పైకగుపడనీయక చిరునవ్వు దెచ్చుకొనెను. "మాలూ! నేనెన్నడైన నీపైఁ గోపింతునే? నాకుఁ గలిగిన దుఃఖమిట్టిదని నీ కెట్లు తెలుపుదును! ఏదుఃఖాగ్నిచే నాహృదయ మీరీతిగ దగ్ధమగుచుండ నాకనులలో నశ్రువులు వెడలుచున్నవో నీకు నే నేమని చెప్పుదును? నీకెట్లు తెలియఁగలదు? మాలతీ! నీవింకను నజ్ఞానబాలికవు. నీకు నే నేమని చెప్పఁగలను?"

మాలతీహృదయము ప్రౌఢస్త్రీల కుచితమగు గాంభీర్యమునువహించెను. "దాదా! నాకు నీదుఃఖము తెలియఁ జాలదు? నేనింకను నజ్ఞాన బాలికనేనా? మూఁడు సంవత్సరములకుఁ బూర్వము నీవేవిధముగ నీహృదయమును స్పష్టము గావించితివో యావిధముగ నేఁడు చేయ వేల? ఈమూఁడేఁడులకును నేను గొంచెమైనఁ బెద్దదానఁ గాలేదా?

శ్రీనివాసుడు విశుద్ధప్రేమామృత పిపాసి. అతఁడీప్రశ్నలువిని మెత్తపడియెను. తనహృద్దౌర్బల్యము నడంపఁజాలఁడయ్యెను. హృదయకవాటముఁ దెఱచివైచెను. ఇంత ప్రేమతో, ఇంతటి యాతురముతో, ఇంతటి కరుణార్ద్రమనముతో నెవ్వరు నాతనిదుఃఖకారణ మరయరైరి. ఆతఁడావేశమున నీవిధముగ నుడివెను! "మాలతీ! నాదుఃఖచరిత్రము నీకుఁ దెలుపనేవలయుఁగా? కానిమ్ము. మాలూ! ఎవ్వతె సహవాసమున నే నీజగమున నింతటి యఖండసౌఖ్య మనుభవించుచుంటినో, యామెవలన నే, నేఁడు నేనీ నరకయాతన లనుభవించుచున్నాను. కేవల మకారణకల్పిత సంశయములతో శాంత తాను దుఃఖించుచున్నది; నన్నును వ్యథలో ముంచుచున్నది!"

శ్రీనివాసుఁడు మెలమెల్లఁగ సకలము ని[...] చెను. అన్నిటిని నామె వినియెను. ఆమె ము[...] పాండుర మయ్యెను; అధరోష్ఠములు కంపింపసాగె[...] దృష్టి శూన్యమయ్యెను; అల్పకాల మున్మాదగ్రస్త[...] స్తబ్ధయైయుండి; యాకస్మికముగా నాక్రందనము సే[...] దొడఁగెను. ఆసాయంసమయమున నాతని యా నీరవా[...] శ్రు వృష్టి జలము ముక్తావళీచంచలజలప్రవాహ[...] లో విలీనమై పోయెను. సోదరీ సోదరు లాకాలమ[...] వ్యవహారజ్ఞాన శూన్యులై యుండిరి. బాష్పములఁ దుడు[...] కొనుటకును, దుఃఖావేగము నడంచుటకును, వారి[...] గారణ ముండలేదు. ముక్తావళీనదీవిశాలసైకతప్రదే[...] మున నా యిద్దఱే యుండిరి. మనసుదీర నేడ్చి దుః[...] మంతయు వెలిఁగ్రక్కుటకు వారికి వలసినంత సావకా[...] మొదవియుండెను.

శోకావేగ మొకింత యోసరిల్లినపిమ్మట మా[...] యిట్లు నుడివెను! "దాదా! నిజమేనా, శాంతకుఁ దన[...] నీకుఁ బ్రేమ లేదనియు నీనిజమైన ప్రేమ నాపై నున్న[...] దనియుఁ దోఁచుచున్నది? అయిన నేనే మీయిరువు[...] దుఃఖమునకుఁ గారణము! ఈ నిర్భాగ్యమూలము[...] నీయింట సుఖము, శాంతి, ఆనందము, లేకపోయిన[...] నాకారణమున నీకు వ్యథయగుచున్నది! శాంతయు వె[...] గుందుచున్నది! దాదా, నేనేమి చేసినచో నీవు పూర్వ[...] మున్నట్లు సౌఖ్యవంతుఁడ వగుదువు? ఏమైనచో నీ[...] సుఖము కలుగును?"

ఈ నిస్వార్థ ప్రశ్నలవలన శ్రీనివాసుని డెంద[...] వ్రిండివచ్చెను. అతఁడు కలవరపడియెను: "మాలూ[...] మాలూ! నీవా నాదుఃఖమునకుఁ గారణమవు? కా[...] కాదు. నాదురదృష్టమే నన్ను నిష్కారణ......"

మాలతి యతనిఁ బల్కనీయ లేదు. "కా[...] దాదా! నన్నీరీతి సమాధానపఱుపఁ జూడకుము. [...] వాక్యములు నిజములని నాకుఁ దోఁపదు. దా[...] నిక్కము వచింపుము; నే నేమి చేసినయెడల నీకు సుఖ[...] గలుగఁగలదు? నేను మరణించిన మీరు సుఖులగుదురా[...]

శ్రీనివాసుఁ డీప్రశ్నవిని లోలోన నే యే[...] సాగెను. దురంతదుఃఖయాతనావిహ్వలుఁ డగుటచే నా[...] డేమియుఁ బలుక లేదు. మాలతి మరల నీవిషయము[...]

...రపలేదు. ఆ స్వల్పకాలమును నక్కడఁ దానకాక ...క్కడుండుటయు నాతనికిఁ దెలియలేదు. తానేకాం ...ముగ నున్నానని భ్రమించి యాతఁడాత్మగతము వలె ...గానే యిట్లనెను. "ఆహాహా! ఎవ్వతెను నేను ...మనఃపూర్వకముగఁ బ్రేమించుచుంటినో, యామెయే ...యందింత యవిశ్వాసముఁ బ్రకటింప వలయుఁగా? ...పవిత్రప్రేమ మీవిధముగ శంకించి దారుణాఘాత ...తో నను సంభావింపవలయుఁగా!"

మాలతికి తంద్రాభంగ మయ్యెను. ఆమె జడస్వర ...న నిట్లనెను: "దాదా! నీ కామెపైఁ బ్రేమలేద ...యు, నాపైననే నీ ప్రేమయంతయుఁ గలవని శాంత ...భావించుచున్నదియా? నిజమేనా?"

"ఆఁ" ఒకానొక యంత్రము భంగి శ్రీనివాసుఁ ...దుత్తరమిచ్చెను.

మెల్లమెల్లగ శాంతయు నిచటికి వచ్చి చేరెను. ...మాలతి కడపటి ప్రశ్నయు, శ్రీనివాసుని యుత్తరము, ...త్రమె యామెకు వినఁబడియెను. నేఁటివఱకు శాంతకు ...నలము సంశయమే! నేఁడామె మాలతీ శ్రీనివాసుల ...లాపములను బ్రత్యక్షముగఁ వీనుల విని ...అత్యంత దుఃఖమొందెను. అంతట నామె తుఱ్ఱున ...యెను. గాఢాంధకారమున ముక్తావలీనీలప్ర ...మామెపాదముల కడఁ బ్రవహించుచుండెను. ...మా టామె యాకసమువంకఁ జూచెను; గాఢాంధ ...మైన సృష్టిభయంకర స్వరూపము నామె ...యు దిలకించుచుండెను. ఆ సమీపముననే, ...సుఁ డతికుతుకముతో నామ మొసఁగిన "శాంతి ...భవన మస్పష్టముగ గోచర మగుచుండెను. ...వంకఁ గాంచుచుండెను. మనసున నెన్నెన్నియో ...లు, మెఱుపులుఁ గలిగెను. శాంత మనసున ... నేనెవ్వరితను? ఎవ్వరిదానను? నా పతికి నేను లేను. మఱి, నే నెవ్వరిదాన? నాథ ర్తయే నన్నుఁ బరామర్శింపకున్న, నింక ననుఁ బలుకరించువా రెవరు? ఇంట నెవరు పలుకరించువారు లేరు. లోకులైన నన్నె వ్వతెనుగ భావింతురు? లోకులమాట లటుండ, నాకే నా యందసూయ కలుగుచున్నది. ఇఁక నే బ్రదుకు టెందులకు? ఈ దుఃఖ మంతయు ననుభవించు టెందులకు? నే నిప్పుడు మరణించినను నెవ్వరికి నష్టము? ఈ తారక లుదయించుట మానునా? ఈముక్తావలి ప్రవహించుట మానునా? దినముఁ గడున దినమువచ్చును. పుట్టినింటివారు నాలుగు దినము లేడ్తురు. ఊరకుందురు. పిమ్మట నందఱు నన్ను మఱతురు! కాని, నాసర్వస్వ ధనము, నాపతి, నేను జచ్చిన నేమిచేయుదురు? ఒక్క మా రింత యేడ్తురు; కన్నీరుఁదుడుచుకొందురు; కంటకము తొలఁగిపోయెనని యానందింతురు; కాని, కాని—"

చంచల దృష్టులతో నామె యొక్కమారు నలువంకలఁ జూచెను. ఆమెయుత్తమాంగము భ్రమణ మందసాగెను. పుడమిపై నంధకారము; ఆకసముపై నంధకారము; ముక్తావలిపై నంధకారము; శాంతపైనను నంధకారమే. ఆమె హృదయము శూన్యంగసాగెను. తల బ్రద్దలగునట్లు వేదన కాసాగెను. ఆవ్యాకులస్థితిలో నామెయొక్క పరుగునఁ బోయి ముక్తావలీనదిలోఁ దటాలున దూకెను!

శాంత యటుఁ దుఱ్ఱున వెడలిపోవుటను మాలతీ శ్రీనివాసులు చూచియుండిరి. ఆమె మనసున నేమున్న దియుఁ దెలియకుంటచే వా రామె కొక్కింత దవ్వుల నిలచి యుండిరి. శాంత ప్రవాహమున దూకిన యామరు క్షణమే శ్రీనివాసుఁ డత్యాత్రముతో నానీట దూకెను. మొదటి మునుఁగుతో శాంతను బట్టి యొడ్డునకుఁ దెచ్చెను. ఈ విచిత్రదారుణదృశ్యమంతయుఁ దిలకించుచు మాలతి పాషాణవిగ్రహము భంగి స్తబ్ధయై నిలిచియుండెను.

## ౪

...శ్రీనివాసరావు శాంత నామూర్ఛవస్థయందే తడి ...మాలతితోడనే స్వభవనమునకు మోసికొని వచ్చె ...మున నామెనుబరుండఁజేసి స్మృతిగలిగించు ...నుపచారము లొనర్చెను. స్వల్పకాలమున కామె కొండలు తెలిసెను. మెల్లమెల్లగఁ గనులు దెఱచెను. ఏప్రదేశము తనకంటఁ గంట బడదని యామె గంటఁ కాలముక్రింద భావించి యుండెనో యాప్రదేశముననే యిప్పు డామె యున్నది. ఎందామె యీమూఁడేఁడులును

గడపెనో ఇది యే యాభవనము! ఎప్పటివలెనే ఇప్పుడును నామె శయ్య సుసజ్జితమై యుండెను. బల్లమీద రత్నావళి, ఉత్తరరామచరితము, శాకుంతలము మొదలగు నామెకతిప్రియములగు గ్రంథము లుండెను. దీపము వెలుఁగుచుండెను. చము రారిపోవుచుండుటచేత దీపము మందమగుచుండెను. కాని యారిపోవలేదు. శాంతజీవితము ను శుష్కముగానుండెను. కాని, యింకను నష్టమగుచుండ లేదు. శాంత దీర్ఘకాలము శూన్యదృష్టితోఁ గూర్చుండి యుండెను. పతి ముఖమును జూడఁ జాలదు. ఏహృదయ రత్నమును దన కింకఁ జూడఁ లభింపదని యామె తలఁచియుండెనో, యారత్నమే, ఆప్రాణేశ్వరుఁడే, తనచెంగటఁ గూర్చుండియున్నను, నామె చూడఁ జాలదయ్యెను. భీతచకితనేత్రములతో, నదురుగుండియలతో ఆమె యొక్కపరి శ్రీనివాసునిఁ జూచెను. ఆతనిగంభీరమైన, విషాదపూర్ణమైన, రూపము



శ్రీనివాసుఁడు... మొదటి మునుఁగుతో శాంతను బట్టి యొడ్డునకుఁ దెచ్చెను.

కనులఁబడ నామె యులికిపడెను. కన్నులు నేల వ్రాల్చెను. శాంత పొట్టపొంగ నేడువసాగెను. శ్రీనివాసుఁడు నామె ననుకరించెను.

నేఁటి సాయంతన మొదవిన యసామాన్యసాహస కృత్యమువలన శాంతహృదయము పరివర్తనమందెను. ఆమె కిప్పుడు జగమంతయు నూతనముగఁ గన్పట్టెను. ముక్తావళీ పవిత్రస్పర్శనము మూలమున నామె కీనాఁడు నవీనమగు నాత్మ లభించియుండునేమో! ఈ శ్రీనివాసరావు తనకుఁ బూర్వమువలెనే ప్రియపతియని యిప్పు డామెకుఁ దెలియసాగెను. తన పతిఁబోలిన కరుణార్ద్రహృదయుఁడు, పవిత్రాంతఃకరణుఁడు, ఉదారచిత్తుఁడు, జగమున మఱొక్కఁ డుండఁడు అను నామె పూర్వభావన యిపుడు పునరుద్దీప్త మయ్యెను. అతని విషయమునఁ దాను బూర్వ మేమని సంశయము వహించియుండెనో యిప్పు డామెకు బొత్తిగాఁ దోఁచుటలేదు!

క్రమక్రమముగా మాటలు ప్రారంభమయ్యెను. అవి ప్రేమాలాపములందు రూపాంతర మొందెను. శ్రీనివాసుఁడు మరల నొకమాఱు తన్ను క్షమింపుమని యామెను వేఁడెను. ఆమెయు నిష్కళంకహృదయముతో, ఉదారాంతఃకరణముతో, క్షమించెను. యావద్వృత్తాంతము నామెకుఁ దెలిసెను; ఆమెకుఁ బశ్చాత్తాప మొదవెను. ఈ పశ్చాత్తాపము మనఃపూర్వకమైనది; స్థిరమైనది. హృదయము విశుద్ధమయ్యెను. ఇఁక మీఁద నెన్నఁడును నిట్టి నిష్కారణసంశయము తలసూపు ననుభీతి యామె కావంతయు లేదు.

అప్పుడు రాత్రి రెండుజాములు గడచియుండెను. అతనికి తన తడిసినవస్త్రముల జ్ఞాపక ముండలేదు. ఇంతటి యవకాశమున నవి తనుంత నెండిపోయి యుండెను. శాంత కాకస్మికముగా స్మృతికి వచ్చెను. అతని వస్త్రముల నంటిచూచెను. ఇంకను దడిపొడిగ నుండెను. ఆమె కరుణార్ద్రస్వరమునఁ బలికెను! "నా కొఱకు మీ కెన్నికష్టము లొదవుచున్నవో కదా! ఇంత

కన్నను నేను బుట్టినయప్పుడ గిట్టియుండిన నెంతో బాగుండెడిది. మత్పూర్వసంచితపుణ్యఫలమున నాకీ జన్మమున లభించినవారిని సుఖింపఁజేయుటకు మారుగ, చండాలిని; నేనెంత దుఃఖ మిచ్చుచున్నాను!"

"ముద్దరాలా! యిప్పుడు వ్యర్థముగాఁ జింతింప నేల? ఇప్పుడు ననుఁబోలిన ధన్యతముఁ డింకొకఁ డెవ్వఁడును లేఁడు. నీహృదయము పవిత్రమైనది. సంశయ విదూరమైనది. నిన్నింతటియానందములో నుండఁజూచిన నాకింకెట్టి విచార ముండఁగలదు?" అని శ్రీనివాసుఁ డామె బాష్పములు దుడుచుచుఁ బలికెను.

ఆకస్మికముగా నా నిశీథనితాంతని స్తబ్ధతను భంగ మొదవెను. సౌఖ్యమయప్రేమాలాపతన్మయు లగు నీదం పతులకు స్మృతి యొదవెను. ఈసమయమున నాప్ర శాంతనిశీథగగనమంతయు మధురగీతధ్వనితో వ్యాపించి పోయెను. శ్రీనివాసుఁడు మాలతీ కంఠస్వరమాధురిని గుర్తించెను. ఇంతరాత్రి గడచినను, మాలతి యింటికి రాకున్నది. నదీతీరమున నేకాకినియై తిరుగాడు చున్నది. శ్రీనివాసుఁ డచ్చెరుపాటున "శాంత! మాలతి యింక నింటికి రాలేదు! ఒక్కరితయె త్రిమ్మరుచున్నది!" అనెను.

కొంచెముగ నవ్వి యతఁడు మరల నిట్టు లనెను: "కాని, యామెవిషయమై నే నితంటికరుణతోను ఇంతటి ప్రేమతోను బ్రశ్నించుటకు, నీసమక్షముననైనఁ బలుకు టకు, వీలులేదు కాఁబోలును!"

"నిజమేనా? ఆమె యింకను రాలేదా? నేఁడామెకు మిక్కుటముగ దుఃఖ మగుచుండఁబోలునని నాకుఁ దోఁచుచున్నది. కాఁబట్టియే రాలేదేమో! నేఁడు నామూర్ఖతవలన నామె కాయాసమయి యుండును. మాలతి యెడ నేను మహాపరాధ మొనర్చితిని. నేనుబోయి యిప్పు డామెను నెమకి తెచ్చెదను. నే నెన్నితప్పు లొనర్చినను నామాలతి యణుమాత్రమును నాపై నలుగదు. కోపింపదు. నేఁడుమాత్ర మామె నన్ను క్షమింపకుండునా?" శాంత లజ్జించి యనెను.



"వలదు వలదు, శాంతా! ఎంత చీకటి! మాలతి యెచటఁదిరుగుచున్నదో యెవ రెఱుఁగుదురు? నీ విందే యుండుము. నేఁ బోయి శోధించి పిలిచికొని వచ్చెదను."

సంగీతధ్వని మరల స్పష్టముగా వినవచ్చెను. గవాక్షమార్గమున నాకరుణాధ్వని గదిలోఁ బ్రవేశించి శ్రీనివాసుని కర్ణరంధ్రములలోఁ జొచ్చెను. తప్తతైలము చెవులఁబోసిన ట్లుండెను:

దూర మతిదూర మున్నకాం
　　తారములఁ
బాపలేశంబు నంటక
　　వరలు వనికి
నిర్జనంబయి శాంతమై
　　నెగడు నడవి
కేగ మనసయ్యె నాకు
　　నేఁ డేకతంబ.
మందభాగ్యను, బాపిని,
　　మనుట యేల?
ఎవ్వ రున్నారు నన్నాద
　　రించు వారు?

ఎవ్వరినిఁ జూచి జీవింతు నింకమీఁద?
ప్రేమ కేప్రతి నే సమర్పింతు దాన?
నాదు ప్రేమస్థలంబు వినాశ మయ్యె?
కన్నులు గనవయ్యెఁ జీకట్లె క్రమ్ముకొనియె,
ఆశ లడుగంటె, హెచ్చె నిరాశ యొక్కఁడె;
చావు లోనన పడయుము సౌఖ్యమనుచుఁ
బంపెఁ గాఁబోలు నిటకు నన్ బద్మభవుఁడు!
వాడిన సుమంబు పుడమిపైఁ బడకయున్నె?
ప్రేమఁ బోషించు వారి నేడ్పించు టయ్యె
నెందుఁ జూచిన లేరు నా కెవరుదిక్కు.
ఎంత కాలంబు బ్రతికిన నింతకాదె!
సారరహితంబు సంసారసాగరంబు!
అర్థహీనంబు నాజన్మ మవనియందు
ప్రాణమే నాకు నిక్కలి భారమయ్యె.
శాంతి పూరితాకాశమా! సాక్షి నీవు
తారలారా! కనుం డిదే మీరుఁ గలరు;
తల్లి, ముక్తావళీ! నీవ తల్లివి భవ
దుదరమునఁ జేర్చుకొనుమమ్మ! యొక్కసుతను,
గప్పికొనియెడ జలరాశి దుప్పటిగను
సైకతస్థలంబును మృదు శయ్యఁ జేసి
ప్రీతి నొసఁగుమా, పోయెదఁ బెద్ద నిదుర.

ఈసంగీతధ్వని, ఈగీతభావము, శ్రీనివాసుని హృదయమును విదారింప సాగెను. అమృతమును వర్షింపఁజేయు, నాకంఠస్వరమున వెడలిన విషాదపూర్ణ గీతము నాకర్ణించి యతఁడు స్తంభితుఁడై పోయెను. అతని చిత్తవృత్తి యత్యంతచంచలమైపోయెను. డెందమున భయంకర వేదన పొడమెను. తటాలున లేచి యతఁడు ద్వారమును దెఱచెను. అంతట బయటినుండి ఘోరమగు గాలి లోనికిఁ జొచ్చి దీపము నార్పివేసెను. భవనమంతయు నంధకారబంధురమై పోయెను. శాంత కంధకార మన భ్రమము లేదు. కాని, యేదో విచిత్రమైన నూతన భీతిచే నా మెరోదవమునకుఁగడంగెను. శ్రీనివాసుఁడొక్కమాఱు లోపలఁ దిలకించెను. ఆసాయంతనమె ఘటించియుండిన దారుణప్రసంగ మాతనికిప్పుడు స్మృతి పటలముపై గోచరమయ్యెను శరీరము రోమాంచిత మయ్యెను. సంగీతధ్వని యాఁగిపోయెను. ఆ గాఢాంధకార మయనిశీథసమయుని స్తబ్ధత వెండియు నెల్లకడలఁ దోఁపసాగెను. ఆ స్తబ్ధతయుఁదోడుగనే, శ్రీనివాసుని యంతఃకరణమున, నొకవిధమగు యాతనామయ విషాదము పొడసూపెను. అత్యధిక వ్యాకులచిత్తముతో నాతఁడందుండి వెడలి, యతి త్వరితగమనమునఁ బోవుచుండెను. అతనిహృదయ మత్యంతదుఃఖజడమై యుండుటచేఁ, బాదములు కంపితములగుచుండెను; సర్వాంగమునుఘర్మమయమైపోయెను.

"హా! హా! ఇదేమి? ఆ సైకతప్రదేశమందలి భీషణ నిస్తబ్ధత కేవిధమగు భంగ మొదవెను? ఇప్పుడేమియు విన బడుచుండలేదు. నదీప్రవాహమున నేదియో జడపదార్థము పడిన ధ్వని యేనా యిది."

ఆసాయంతనమే సంభవించియుండిన భయంకర దృశ్య మాతనికిఁ గనులకుఁ గట్టినట్లయ్యెను. శరీరమున రోమములు నిక్క పొడిచెను. శ్రీనివాసునకు స్మృతి కలిగెను. ఆతని శరీరమున నపరిమితబలము సంచరించెను. "మాలతీ! మాలతీ!" అని యతడు బిగ్గరగా నఱచుచు నా సంగీతారవ ముదయించిన స్థలమును బట్టి పరుగిడెను. తీరమునఁజేరెను. ఇచ్చోటనే వెనుక విన్న యాధ్వని వచ్చియుండెను. కలవరముతో శ్రీనివాసుఁడు క్రింద నీరుజూచెను. నదీ ప్రవాహ మతిశాంతముతోఁ బ్రవహించుచుండెను. అం దొక్క తరంగమైన లేదు. తన యుదరమున నేమున్నదియు నేవిధముగనైనను వెలికిఁదోఁపఁ జేయుచుండలేదు. ఎప్పటివలనే సహజ గంభీరముతో శాంతముతో ముక్తావళి ప్రవహించుచుండెను. శ్రీనివాసుడు బెదరుదృష్టులతో నలుదెసలఁ బరికించెను. మాలతిచిహ్న మెందును గనఁబడలేదు. ఒకానొక భ్రమిష్ఠుని చందమున "మాలతీ! మాలతీ" యని పేరెలుఁగునఁ బిలిచెను. నదీ జల ప్రవాహముపై, సికతాతలముపై, ఆకాశముపై, అన్నికడల అతని యార్తనాదమే ప్రతిధ్వనించెను:—

"మాలతీ, మాలతీ!"





# యోచనానిమగ్నుఁడు

చింతలపూడి సీతారామయ్య గారు

ఒకతఱి నేలఁ జూచు మఱియొక్కతఱిన్ గగనంబుఁ జూచు వే
ఱొకతఱి పార్శ్వముల్ గను మఱొక్కతఱిన్ దనమేనుఁ గన్గొనున్
వికటవిమర్శభావముగ వీక్షలు గూరుచుఁ గూనురాగ మిం
చుక పచరించుఁ గన్మొగుచు స్రుక్కఁగఁ జేయు బొమల్ గడున్ గడున్.

చ. పలుమరు నెవ్వరేఁ బిలువఁ బల్కు నొకానొకవేళ ‘నో’ యటం
చలుకను; వేయుప్రశ్నముల కొఁదల ‘నూఁ’ యని యూఁచు నెంతయో
పలుచను; మాఱువల్కు వన వేసరుచున్ వినలేదు నీదుప్ర
శ్నలననుఁ; బల్కినన్ వెడలు నాలుగుపల్కు లసంగతంబుగన్.

ఉ. అంధుఁడు గాఁడు కన్నుగవ కంధత యేలొకొ? మూఁగ గాఁడు వా
గ్బంధన మేలొకో? చెవిటి గాఁడు సెవుల్ వినవేలొ? నిద్రకున్
బంధుఁడు గాఁడు గన్మొగపు వాటిలె నేలొకొ? కిన్కలేఁ డహో!
సంధిని లేఁడు భ్రూకుటి యసంగత వాక్క్రియ లేల గల్గెనో!

* * * * * *

చ. అమితరయంబునన్ బవను నాశుగమున్ జవదాఁటుమేటిగ
ర్వమున సమస్తభాగములు వాయక రోయుచు నెట్లొ కామితా
ర్థము గొనితెచ్చియిచ్చెడుమదంబున నేమెడకేని పోయెఁబో
నెమకుచు హృద్విహంగ మవనీస్థలి; నింద్రియపాళి స్రాల్వడన్.

చ. అరయఁగ నీవ ధన్యుఁడ వయారె! నియామకవృత్తిఁ జిత్తమున్
గరము సదర్థసంగ్రహణకార్యముఖంబుగఁ జేయుమయ్య! నీ
కిరవుగఁ దెచ్చియిచ్చునది యెట్టిమహార్థమునేని యోచనా
పరుఁడ! ప్రమోదవారినిధిభంగపరంపర నోలలార్చుచున్.



కామూరి లక్ష్మణరావు గారు

# * విద్యుచ్ఛక్తి అనగా నేమి?

ప్రస్తుతకాలమున విద్యుచ్ఛక్తి సృష్టికిఁ బ్రతిసృష్టి చేయుచున్నది. అది చేయలేని పనులు కానరావు. తంతిసహాయము లేకయే వార్తలను నలుదెసల ఎన్నిమైళ్లదూరమునకైనఁ గొన్నినిమిషములలో నందఁజేయుచున్నది. నిప్పుపుడకసహాయ మక్కఱలేకయే దీపములు వెలిగించుటకుఁ దోడ్పడుచున్నది. ఎక్కడనో లండనులో ఒకానొకయుపన్యాసకుఁడు చర్చించుచున్న విషయములు మన యెదుట మనచెవిలో వినఁబడునట్లు చేయుచున్నది. చివరకిది వైద్యశాస్త్రమునకుఁగూడఁ దోడ్పడుచున్నది.

• విద్యుత్తు ఒకవిధమైన శక్తి

(Electricity is a kind of energy)

ఇన్నివిధముల నేఁడు ఉపయోగపడుచున్న 'విద్యుచ్ఛక్తి' ఏమిటో దానిని గుఱించి సంగ్రహముగఁ జర్చింతము. దత్తాత్రేయునకు మూఁడు ముఖములు ఉన్నవందురు. అట్లే యీభౌతిక ప్రపంచములో శక్తికి మూఁడు ముఖ్య రూపము లున్నవి. శక్తి అనఁగా పనిచేయఁగలుగుటకు గల సమర్థత. రాముఁడు చాల శక్తికలవాఁడు. అనఁగా అతఁడు బలవంతుఁడనియు, ఆతఁ డేపనినైనను అతని సమర్థతకు మించకుండనున్నచో చేయగలఁడనియు అర్థము. సూర్యునిశక్తి చాలగొప్పదే. అయినను ఆశక్తివల్ల ప్రతికార్యము చేయులేము. మోటారుబండి నడపించుటకు స్వల్పశక్తి సరిపోయినను చాలగొప్పశక్తిగల సూర్యుని ఎండవేడిమి దానిని నడపింపఁజాలదు. ఇట్లని సూర్యునికి అసలు శక్తియే లేదని చెప్పుటకు వీలులేదు. వేసవికాలపు ఎండవేడిమిని పరికించిన ప్రతిమనుష్యునికి సూర్యునిశక్తి తెలియకమానదు. కాని సూర్యునిశక్తికిని, ఆశక్తియొక్క మరొకరూపమై మోటారుబండిని నడపించుచున్న శక్తికిని భేదముకలదు. వరాహావతారమునకును, నరసింహావతారమునకును భేదమేమి? రెండును విష్ణువుయొక్క అవతారములే కదా? అయినను వేఱువేఱు ప్రయోజనములకై రూపభేదమును దాల్పవలసివచ్చినది. కాని మూలస్వరూపము ఒక్కటే. ఇట్లే శక్తి అనునది వేఱువేఱు రూపములతో నుండవచ్చును. అందు ముఖ్యమైనవి మూఁడురూపములు.

* ఇది ప్రకటింపఁబడవలసిన 'విద్యుచ్ఛక్తిశాస్త్రము' అను గ్రంథములోని మొదటి ప్రకరణము.

ఈ మూఁడు రూపములతో శక్తి వేఱు
వేఱుకార్యములను నెఱవేర్చుచున్నది. కొన్నిటి
యందు మూర్తిమంతమై ఈచర్మ నేత్రము
లకుఁ గానవచ్చుచున్నది. మరికొన్నిటియందు
అదృశ్యరూపమువహించి తనస్వరూపమెట్టిదో
వ్యక్తముకాకుండ చేయుచున్నది. కాని వేఱు
వేఱురూపములతో నున్నను ఈ మూఁటికి
మూలము ఒక్కటియే యైనందువ వీటిని ఒక
దానిలోనుండి వేఱొక దానిలోనికి మార్ప
వచ్చును. అగ్నిహోత్రుఁడు, భాస్కరుఁడు
అను పిన్నవయస్కులైన యిరువురు బాలురు
ఉన్నారనుకొనుఁడు. వారు చెరి రెండు చెకు
ముకిరాళ్లు ఎక్కడనో సంపాదించినారు. వా
టిని అగ్నిహోత్రుఁడు చిన్నతనపు చేష్టలచేత
ఒకదానితో నింకొకటి రాయుచున్నాఁడు. ఆ
రాపిడికి వేఁడి యెక్కినది. చేతులకో ఆచెకు
ముకిరాళ్లు పట్టుకోలేని స్థితిలోనికి దిగినది.
భాస్కరుఁడు మాత్రము ఊరుకొనునా? అగ్ని
హోత్రునిచూచి తాను వెనుకపడనేల అని
గబగబ ఆచెకుముకిరాళ్లను ఒకదానితో నొకటి
రాయుచున్నాఁడు. అగ్నిహోత్రునికి చేతులు
మండుటయే కాని మరియేమియుఁ గనిపించుట
లేదు. భాస్కరుని కట్లుకాదు. ఆతనికి నిప్పు
కణములు కనఁబడినవి. అగ్నిహోత్రుని
కట్టి విస్ఫులింగములు కనఁబడక తన
కొక్కనికే కనఁబడుటచేత అతనికి విజయో
త్సాహ మెక్కువయ్యెను. ఇంతలో వారి
ద్దఱికంటె పిన్నవయస్సువాఁడును, పట్టుపీతాం
బరధారియునైన ముద్దులు మూటఁగట్టు విద్యు
త్కుమారుఁడు అచ్చటి కరుదెంచెను. పాప
మాతనికి చెకుముకిరాళ్లు దొరకలేదు. వాటి
కొఱకెంత వేఁడినను అగ్నిహోత్రుఁడు కాని,
భాస్కరుఁడు కాని కనికరము చూపరైరి.
అందువలన ఆతఁడు విసుపుచెంది అచ్చట పడి
యున్న ఒక గాజు
పెంకును తానుధరిం
చిన పట్టుపీతాంబర
ముతో ఉద్దుట ప్రా
రంభించెను. ఆతని
యదృష్ట మేమో
కాని ఇతరులవలె
నంత ఎక్కువ కష్ట
పడక పోయినను
మిగిలినవారి నిరువు
రను తనయొద్ద కాక
ర్షించుకొనెను. ఎందు
వల్ల ననఁగా విద్యు
త్కుమారుఁడు



అగ్నిహోత్రుఁడు   భాస్కరుఁడు   విద్యుత్కుమారుఁడు

అట్లు రాయుచున్నప్పుడు ఆతనికిఁ దెలియకయే ఆతని జేబులోనున్న కాగితపుముక్క ఆ రాయుచున్న వైపునకు కదలుట ప్రారంభించెను. అది అగ్నిహోత్ర భాస్కరు లిరువురును గని పెట్టిరి. అందువలన వారు తమపరికరములు పారవేసి విద్యుత్కుమారుని యొద్దకు వచ్చిరి.

ఈ పైనిచెప్పిన మువ్వురు శక్తిని వినియోగించినారు. కాని అది వేఱువేఱురూపముల వారికిఁ బ్రత్యక్షమైనది. అగ్నిహోత్రునకది కాంతిలేనివట్టివేఁడిగా కనఁబడినది. భాస్కరునికి వెలుతురు రూపముతో సాక్షాత్కరించినది. విద్యుత్కుమారునకు ఈ రెండు రూపములును గాని ఆకర్షణశక్తిరూపమున వ్యక్తమైనది.

శక్తి ఆకారము దాల్చునెడల కొంత ప్రయాసపడియైనను దానితత్త్వము గ్రహింపవచ్చును. మాటిమాటికి కోపమువచ్చుపురుషునిగుణములు సులభముగా గ్రహింపవచ్చునుకదా కాని అంతర్వికారములను వెలికిఁదోఁపనీయని మనుష్యుని అంతర్యము కనుఁగొనుట కష్టసాధ్యముకదా! అట్లే శక్తి ఉష్ణరూపమునఁగాని, వెలుతురురూపమునఁగాని ఉన్నయెడల అదియేమిటో, దానికి, దానిరూపాంతరములకు సంబంధ మెట్టిదో కనుఁగొనవచ్చును. అందువల్లనే ఉష్ణశాస్త్రము,ద్యుతిశాస్త్రము సంపూర్ణముగ నభివృద్ధి చెందినవి. కాని ఈమూఁడవరూపమగు ఆకర్షణగుణముగల విద్యుచ్ఛక్తి ఎట్టిదో తెలియుటలేదు. విద్యుచ్ఛక్తి యనఁగా శక్తియొక్క రూపములలో నొక్కటి యనుకొనుటయే కాని యది దృష్టిగోచర మగుట లేదు.

ప్రవాహ సిద్ధాంతము (Current theory)

అందువలననే అనేక సిద్ధాంతములు, ఊహలు బైలుదేఱినవి. కొందఱు అది



నది పుట్టి, ప్రవహించు విధము.

అదృశ్యముగఁ బ్రవహించు ద్రవపదార్థమనుచున్నారు. ఇట్లనుటచేత విద్యుచ్ఛక్తి ద్రవరూపము కలదని తలంపఁగూడదు. పేరులేని అర్జిలకన్నిటికి ఆకాశరామన్న యేకదా గ్రంథకర్త. అట్లేరూపమేదో నిశ్చయముగఁ దెలియనప్పుడు అది ద్రవరూపమనుట తప్పుకాదు. ఇట్లనుకొనుటకును కారణములు కొన్ని కలవు. విద్యుత్ప్రవాహమునకును, నదీ ప్రవాహమునకును చాల పోలికకలదు. అందుచేత మొట్టమొదట నదీతత్త్వమును బరిశీలింతము. సముద్రపు నీరు సూర్యరశ్మిచేత ఆవిరిగా నేర్పడి పై కెగసి మేఘరూపమును దాల్చుచున్నది. మేఘములు ఆకాశమార్గమునఁ బోవుచు చల్లగాలి తగిలినప్పుడు బిందురూపమును దాల్చుచున్నవి. అవి పర్వత ప్రదేశములలో పడినప్పుడు చిన్న చిన్న సెలయేళ్లుగాను, ఇవి యన్నియుఁగలిసి నదిగాను ఏర్పడుచున్నవి. ఈ నదీధాటి అమోఘము. మిక్కిలి ఉరవడితోఁ బోవుచుఁ, దనత్రోవలోని యడ్డంకులనెల్ల దాటుచు వైభవముగఁ బ్రవహించుచుండును. ఉరవడి ఎక్కువయినప్పుడు మార్గరోధము కలిగించు అడ్డంకు లేవియున్నను అవి తలవంచి సేవకుని మాదిరి గంగాభవానికి లొంగిపోవును. ఇట్లు ప్రవహించునట్టి నది పల్లపు ప్రదేశములలోఁ బ్రవేశించునప్పుడు దానివలన అనేకోపయోగములు కలుగుచున్నవి. ఆనది ప్రవహించు ప్రదేశములు సౌఖ్యవంతములై, ఫలవంతములై అలరారుచుండును. కాని ఒక సంగతిమాత్రము మనము చెప్పవలయును. మేఘములు దట్టముగ ఆకాశమును క్రమ్మియుండు వర్షఋతువులో నది వెల్లువలై పాఱినప్పుడు ఆనదీప్రాంతముల నుండువారికి అమితనష్టము సంభవించుచుండును. ఒక్కొకప్పుడు పంటలకే కాక ప్రాణులకుఁగూడ నష్టము వాటిల్లును. నదీ ప్రవాహమునకు ఒక తెన్ను, ఒక త్రోవకలదు. అడ్డుకట్టలు కట్టి నదీప్రవాహమును ఇతర పనులకు వినియోగించునప్పుడు నదిలోని నీరు తగ్గుచుండును. నీరు ఇట్లు వినియోగింపఁబడుటవలన ఒకప్పుడు కావేరి వంటినదిలో తుదకు నీరుకూడ లేకపోవచ్చును. తుదకు నది పోయిపోయి సముద్రమునఁగలియుచున్నది. సముద్రములో పుట్టినది. సముద్రములో గిట్టినది. మఱల పైనిచెప్పిన రీతుల నీ సముద్రపునీరు ప్రయాణమునకు సిద్ధమగుచున్నది. ఇట్లు సూర్యునిశక్తిచేత నీరు ఇన్ని రూపముల ఒకచుట్టు చుట్టి వచ్చుచున్నది. సూర్యునిశక్తియే నీటిని మనపొలములలోనికి పాఱునట్లు చేయుచున్నది. చదువరుల కీవిషయము తెలిసినదియేయైనను ఇంత విపులముగ వ్రాయుటలోఁ గొంత యర్థము కలదు. పైని నీటిప్రవాహమునకు వ్రాసిన యంశములన్నియు విద్యుత్ప్రవాహమునకు కూడ అనువర్తించుచున్నవి. నిర్గుణుఁడైన ఈశ్వరుని విగ్రహము చేసి సగుణునిగఁ జూపునట్లు అదృశ్యముగనున్న విద్యుచ్ఛక్తి తత్వమును నదీప్రవాహోపమానమున తేటతెల్లము చేయఁ బ్రయత్నించుచున్నాను. విద్యుచ్ఛక్తిశాస్త్రమును సంపూర్ణముగఁ బఠించిన పిదప నీ రెంటికినిగల పోలికలు ఆశ్చర్యమును గలిగింపకమానవు.

తిరుపతి వేంకటేశ్వరుని సాన్నిధ్యమునకుఁ బోవునపుడు మనకుఁ జాలచోట్ల రాళ్లు రప్పలు కనఁబడుచుండును. ప్రకృతిపై భవముచేత అవి ఆనందమును గలిగించునేమోకాని భక్తిని గలిగింపలేవు. కాని వాటియొద్ద నొక మనుష్యుఁడు నిలబడి వాటిని గుఱించి ఏదో యొక పురాణకథ నల్లినా పామరులు అమాయకముగ దానిని నమ్మి భక్తిప్రపూర్ణు లగుచుందురు. అట్లే విద్యుచ్ఛాస్త్రపఠనమున మన మింకను ఓనమాలలోనే యున్నను విద్యుత్ప్రవాహము నదీ ప్రవాహము నెట్లు పోలియున్నదో క్లుప్తముగనైనఁ దెలిసికొననిచో పైని చెప్పిన సాదృశ్యవర్ణనము వ్యర్థమును, పరిహాసాస్పదము నగును.

విద్యుచ్ఛక్తి పుట్టించుటకుఁ గొంతసామగ్రి యుండవలయును. దానిని పుట్టించుటకు శక్తిని వినియోగింపవలయును. అది ప్రవహించుటకుఁ ద్రోవఁ జూపవలయును. ఉపయోగకరములైన మార్గముల దానిని వినియోగింపవలయునన్న విద్యుచ్ఛక్తియొక్క ఒత్తిడి ఎక్కువచేయవలయును. ఈయొత్తిడి అతి విస్తరమైన, ప్రాణాపాయకర మగునని మాత్రము జ్ఞాపక ముంచుకోవలయును. విద్యుత్ప్రవాహము ఎన్నియో సౌఖ్యములకు, సంపదలకుఁ గారణభూత మగుచున్నది. ఇట్లు ఉపయోగకరములైన కార్యములను నెఱవేర్చి అది తిరిగి తానెచ్చట పుట్టుచున్నదో అచ్చటికిఁ బోవును. ఇట్టి పోలిక యుండుటచేతనే ఈవిద్యుచ్ఛక్తి ద్రవరూపమని చెప్పుటకుఁ గారణమైనది. విద్యుచ్ఛాస్త్రపఠనమునకు నద్యుదాహరణము జ్ఞాపకముంచుకొనుట మిక్కిలి లాభకారియే యైనను అది నిరాకారమై అదృశ్యముగనే యుండునది యని మాత్రము మఱువఁగూడదు. విద్యుచ్ఛక్తి యెట్టిదో తెలియదనియే చెప్పవచ్చును. పైనిచెప్పిన ప్రవాహసిద్ధాంతము మిగిలిన సిద్ధాంతములలో నెల్ల ముఖ్యమై, సర్వసాధారణముగ నందఱికి నర్థమగుటచే నదియే యిచ్చటఁ బేర్కొనఁబడినది. ఇంతియేకాని యిదియే సిద్ధాంతమని బల్లగుద్ది చెప్ప వీలులేదు.

విద్యుత్ప్రవాహఫలితములు (Effects of electric flow)

విద్యుచ్ఛక్తి ప్రవహించుటకు ఒకత్రోవ యుండవలయునని యంటిమికదా! దానికి వ్యాపకము (Conductor) అని పేరిడెదము. విద్యుచ్ఛక్తి వ్యాపకములోఁ బ్రవహించుచున్నప్పుడు వ్యాపకములోఁగాని, దానికి చుట్టుప్రక్కల నున్న క్షేత్రములలోఁగాని ఏవైన ఆశ్చర్యజనకము లగు ఫలితములు కలుగునా యని విచారింతము.

అట్లుకలుగు ఫలితములలో మొట్టమొదటిది వేడిమిపుట్టుట అనఁగా విద్యుచ్ఛక్తి ప్రవహించుచున్నప్పుడు ఆ వ్యాపకమునకు వేడిమిపుట్టును. ఆ ప్రవాహము, దానికి ఒత్తిడి (Pressure) మఱింత ఎక్కువయినచో చేతితో తాకుటకు వీలులేనంత వేడిమిపుట్టును. ఇది సహజమేకదా! శీతకాలమునందు వెట్టపుట్టవలెనన్న మనము* పరుగెత్తుదుము. ప్రవాహము, గమనము ఎక్కడ ఎక్కువ త్వరితగతిలో నుండునో అక్కడ వేడిమి యుద్భవించును.

రైలుబండి పట్టాలమీఁదఁ బరువెత్తుచున్నది. అది మెల్లగ నడచుచున్నప్పుడు పట్టాలు చేతితో తాఁకవచ్చును; కాని యత్యంతత్వరిత



మొదటిఫలితము వేఁడిమిపుట్టుట

గతిం బోవునప్పుడు వాటిని ముట్టుకొనుటకు వీలులేనంత వేఁడిమిపుట్టుటయేకాక కొన్ని డబ్బాలు మండిపోవుటకూడ అప్పుడప్పుడు తటస్థించుచుండును. కావున విద్యుత్ప్రవాహవేగమున వేఁడిమిపుట్టునని యెఱుంగవలయును. ఇంతియేకాదు. ప్రవాహమున కడ్డుకట్ట కట్టితి మనుకొనుఁడు. అప్పుడది దానిని దాటవలెనని ఎక్కువ శక్తి నుపయోగింపవలయును. అట్లే విద్యుచ్ఛక్తి ప్రవహించు వ్యాపకము నిరోధము కలిగించు స్వభావముకలది యైనయెడల ఎక్కువశక్తి నుపయోగింపవలసియుండును. అందువలన వేఁడిమి మఱింత ఎక్కువగును. ఈవిద్యుచ్ఛక్తివలన నుద్భవించు వేఁడిమిమూలమున ఆధునిక నాగరికశిఖామణులు 'టీ' మొదలగుపదార్థములు తయారుచేసికొనుచున్నారు.

ప్రవాహమువలన రెండవఫలితము 'ద్యుతి' అనఁగా వెలుతురు. వెలుతురు వేఁడిమియొక్క రూపము. వేఁడిమి ఎక్కువయైనచో వెలుతురు పుట్టును. స్టౌయిలో పెట్టిన కట్టెలు నిమ్మళముగ రగులుచున్నవి. కాని వేఁడిమి ఎక్కువలేదు. పొగ: ఊదుట కష్టము. కొంచెము శ్రమచేసి ఊదినయెడల వేఁడిమి యెక్కువగును: పొగ పోవును: మంట మండును. వేఁడిమి యెక్కువగుటవలననే జ్వాలపుట్టుచున్నది. ఇందువలన ద్యుతి వేఁడిమియొక్క రూపమని గ్రహింపనగును. అందువలన విద్యుత్ప్రవాహరాశి ఎక్కువ యగుచో వ్యాపకము జ్యోతిష్మంత మగును. ఇంతియే కాదు: విద్యుచ్ఛక్తి ప్రవహించు




రెండవఫలితము వెలుతురిచ్చుట

టకు ఒక పరిధిమార్గము ఉండవలెనని యిది వఱలోఁ జెప్పఁబడినది. అనఁగా శక్తి పుట్టిన చోటికి మఱలి వచ్చుటకు ఏర్పాటు చేయవలయును. ఇట్లు చేసిననేగాని విద్యుచ్ఛక్తి పుట్టిన చోటునుండి ప్రవహింపదు.

విద్యుచ్ఛక్తి ప్రవహించు వ్యాపకములలో ముఖ్యమైనది రాగితీగె. ఎక్కువగా మార్గమును నిరోధించునది గాలి. ఒక పరిధిమార్గమున స్వల్పదూరము వ్యాపకము లేదనుకొనుఁడు. అచ్చట నిరోధకమగు గాలికలదు. ఇట్టి సమయములో నీనిరోధకమగు గాలిలోనుండి కూడ విద్యుత్ప్రవాహము ప్రవహింపఁ

ప్రయత్నించును. శక్తి ఎక్కువయున్నచో దానిని దాటఁగలదు. అట్లు దాటునప్పుడు విద్యుచ్ఛక్తిరూప మేదో చూడలేక పోవుదుమా అను సంశయము తోఁచును. కానిఅప్పుడుకూడ అది మాఱు వేషమయిన వెలుతురు రూపముఁదాల్చి బయటఁబడును. ఈ వెలుతురునే విస్ఫులింగము (Spark)




విద్యుత్కృతి (బైక్రోమేటు.)

విస్ఫులింగము కనుబడుటకు పై చూపిన విద్యుత్కృతులు ఏవియైన నుపయోగించవలయును. స్పష్టముగా నుండుటకు, ఒకటిమాత్రమే పటమందు చూపబడినది.

అందురు. ఇది చాల తేజస్వంతముగ నుండును. ఈ కాంతికి ఉష్ణ మెక్కువ. ఇట్టి విస్ఫులింగములతో సాధారణముగ కొలిమిలోఁబెట్టి కాల్చినను కరిగిపోవని లోహములన్నిటిని ద్రవరూపముగ మార్పవచ్చును. ఈ కాంతియే 'సినిమా' ప్రదర్శనములలో తెరపైఁ గాన్పించు వెలుతురు.

మూఁడవ ఫలితము కాంతీకరణము (Magnetisation). మొదటి రెండుఫలితములు వ్యాపకమునందే యిమిడి యున్నవి. వ్యాపకమును స్పృశింపనిచో వేఁడిమి తగులదు.




మూఁడవఫలితము కాంతీకరణశక్తి

కాని ఈ మూఁడవ ఫలిత మట్లుకాదు. ఇది వ్యాపకమునకు చుట్టునుండు ప్రదేశము (Magnetic field) అందురు. కాంతీకరణ శక్తి యనఁగా ముఖ్యముగా ఇనుము నాకర్షించు శక్తి. అయస్కాంతమును జూచియే యుందురు. దానియొద్ద నేదైన ఇనుపవస్తువు నుంచినచో అది దాని నాకర్షించును. ఇట్టిశక్తి విద్యుచ్ఛక్తి ప్రవహించు వ్యాపకమునకును గలదు. దానిచుట్టునున్న ప్రదేశములో నేదైన నినుపవస్తువున్న యెడల నేమాత్రము వ్యత్యాసములేక సూదంటుఱాయివలె నీ వ్యాపకము దాని నాకర్షించును. ఇది విద్యుత్ప్రవాహ ఫలితములలోని కెల్ల ముఖ్యమైనది. దీని యోగ్యత క్రమక్రమముగ మనము గ్రహింపఁగలుగుదుము.

నాలుగవది రసాయన ఫలితము. ఇది రసాయనశాస్త్రజ్ఞుని కెంతయో యుపయోగపడుచున్నది. విద్యుచ్ఛక్తి కొన్నివస్తువులలో నుంచి ప్రవహించుననియుఁ, గొన్నిటిలో నుండి ప్రవహింపదనియుఁ దెలిపియుంటిని. ఎట్లన ఒకకొయ్యను, ఇనుపకడ్డీని నిప్పులోఁ బెట్టుదు మనుకొనుఁడు. అప్పుడు కొయ్య ఒక

చివరభాగమున వెలుఁగుచున్నను రెండవకొన ముట్టుకొనవచ్చును. మనకేమాత్రము వేఁడిమి తగులదు. కాని యినుపకడ్డీ కట్టుకాదు. నిప్పులోఁ బెట్టగనే మనచేతికి వేఁడిమి తగులును. ముట్టుకొనుటకు సాధ్యముకాదు. ఒకకొన మండుచున్నను కొయ్యను రెండవకొన ఏల ముట్టుకొనఁగలుగుదుము? ఇనుము నేలముట్టుకొనలేము? ఇందుకు కారణమిది. కొయ్యకు వేఁడిమిని నిరోధించుశక్తికలదు. ఇనుమున కట్టి నిరోధకశక్తిలేదు. ఇట్లే విద్యుచ్ఛక్తి ప్రవాహమును. కొన్నివస్తువులు ఆశక్తి స్వేచ్ఛగఁ బ్రవహించుటకు వీలిచ్చునవి. మఱికొన్నివస్తువులట్లుప్రవహింపకుండ నిరోధించునవి. ఈవిద్యుత్ప్రవాహము ప్రవహించుటకు వీలిచ్చు, అనఁగావ్యాపించుట కవకాశ మొసఁగుస్వభావము కలవాటికి వ్యాపకములనియు, నిరోధించుస్వభావముకలవాటికి నిరోధకములనియుఁ బేరు పెట్టెదము. వ్యాపక, నిరోధకములపట్టిక ఈ వ్యాసముచివర చూడనగును. ఆపట్టికననుసరించి ద్రావకబిందువు కలిసిననీరు వ్యాపక మని తెలి-




నాలవఫలితము రసాయనపదార్థ విభజనము

యఁగలదు. ఇట్టి నీటిలోనుండి విద్యుచ్ఛక్తి ప్రవహించుచున్నదనుకొనుఁడు. అప్పుడు దాని ఫలితమిది. నీరు మిశ్రమపదార్థము. నీటిలో తూనికప్రకారము ఎనిమిదివంతులు ప్రాణవాయువును (Oxygen), ఒకవంతు ఉదజనియును (Hydrogen) ఉండును. ఈ రెండు వాయువుల సమ్మేళనమే నీరు. ద్రావకబిందువు కలిసిన నీటిలో విద్యుచ్ఛక్తి ప్రవహించునప్పుడు నీరు విచ్ఛిన్నమై ఉదజనిగాను, ప్రాణవాయువుగాను విభాగమగును. ఇట్లే ఇతర మిశ్రమపదార్థములు విద్యుచ్ఛక్తి మూలమున మూలద్రవ్యములుగ విడిపోవును. ఇట్లు విడిపోయిన ద్రవ్యముల పరిమాణము విద్యుత్ప్రవాహపరిమాణమును బట్టి ఉండును. ఇట్లు మూలద్రవ్యములుగ విభాగించు విద్యుత్ప్రవాహమునకును విభజింపఁబడు ద్రవ్యమునకును అన్యోన్యసంబంధ ముండుటవలన విభక్తమగు పదార్థమును బట్టి విద్యుత్ప్రవాహ ప్రమాణమును తెలిసికొనవచ్చును.

### శాస్త్రవిభాగములు- (Divisions)

అసలు విద్యుచ్ఛక్తి రెండువిధములు: ఏకముఖమని, ద్విముఖ మని. ఒకే వైపు ప్రవహించు విద్యుచ్ఛక్తికి ఏకముఖ విద్యుచ్ఛక్తి (Direct-current) యనియు, రెండు వైపులఁ బ్రవహించు దానికి ద్విముఖ విద్యుచ్ఛక్తి (Alternating-current) యనియుఁ బేరు. విద్యుచ్ఛక్తి ఒకవ్యాపకము గుండఁ బ్రవహించుచున్నపుడు ఎప్పుడు ఒక్కవైపుననే ప్రవహించుచుండవలెనని లేదు. అది రెండువైపులఁ బ్రవహించుచుండవచ్చును. అనఁగా ఒక సెకనుకు ఒకమార్గమునను, రెండవసెకనుకు ఎదురు

తిరిగి రెండవమార్గమునను ఇట్లు సెకనుకు గమనముఖమును మార్చుచు ముందుకు, వెనుకకుఁ బోవు వానపాముపలెఁ బ్రవహించుచుండును. ఇట్లు సెకనుకన్న త్వరగా గమనముఖము మార్చు నీద్విముఖవిద్యుచ్ఛక్తి ఏకముఖవిద్యుచ్ఛక్తివలెనే కనవట్టును గాని యీ రెంటికి మూలభేదములు కలవు. ఈ రెండు విధములైన విద్యుచ్ఛక్తినిఁ దెలుపు శాస్త్రము స్థూలదృష్టిని మూఁడు భాగములుగ విభాగింపవచ్చును మొదటిది ఏకముఖవిద్యుచ్ఛక్తి. రెండవది ద్విముఖవిద్యుచ్ఛక్తి. మూఁడవది విద్యుచ్ఛక్తి ప్రయోగములు.

ఇట్లు విద్యుచ్ఛక్తిశాస్త్ర మనువృక్షము మూఁడువిభాగములను ఊడలచేత బలిష్ఠమై నిరాటంకముగ వర్ధిల్లుచు, నిప్పుడు మిక్కిలి యౌన్నత్యదశ నొందినది; పుష్పించి ఫలవంతమై శోభిల్లుచున్నది. ఇట్టి వృక్షమును వసుచరిత్రకారుఁడు చెప్పినట్లు మహనీయులైన శాస్త్రవేత్తలెందఱో తమ యమూల్యమైన కాలమును, సర్వస్వమును ధారవోసి మేనిచెమట యూడ్చి విత్తనము వేసి కాపాడియున్నారు. ఇది చాల పూర్వకాలమునాఁటిది కాదు. రెండువందలయేండ్ల క్రితము ఈవిద్యుచ్ఛక్తిభావమునకు బీజములు పడినవని చెప్పుదురు. కాని యవి యంతముఖ్యమైనవి కావు. ఆదికర్తలని ప్రాచీనవిద్యుచ్ఛాస్త్రవేత్తలను గౌరవింపవలెనే కాని పేర్కొనఁదగినంత గొప్ప పరిశోధన లేవియు వారు చేసియుండలేదు. కాని పందొమ్మిదవ శతాబ్ది ఆరంభమున అదినఱకు నాటఁబడిన బీజములు అంకురములై వర్ధిల్లఁజొచ్చినవి. ఈయంకురాభివృద్ధి కెక్కుడుగఁ దోడ్పడిన వారిలో ఓల్టా, ఓమ్, ఆంపియర్ అనువారలు ముఖ్యముగఁ బేర్కొనఁదగినవారు. వారు చేసిన గొప్ప పరిశోధనలకు వారిని గౌరవించుటకై విద్యుచ్ఛాస్త్రములోని కొన్ని ఆదిమ ప్రమాణములకు వీరిపేళ్లు పెట్టఁబడినవి.



గుగ్లీల్మో మార్కొనీ

వాయువార్తాపద్ధతిని గనిపెట్టినవారిలో ముఖ్యుడు.

ఈ శాస్త్రవృక్షమునకు దోహదముచేసి దానియభివృద్ధికిఁ గారణభూతులైనవారు వీరే కాక యింకను పెక్కురు గలరు. ఫ్రాంక్లిన్, ఫారడే, ఆలివరులాడ్జి మొదలగువారిని మనము మఱువరాదు. ఇందు ఫారడే 'విద్యుచ్ఛక్తి కాంతీకరణము' అనుభాగమునకు ప్రధానాచా

ర్యుఁడు. ఇదియే విద్యుచ్ఛాస్త్రమున మిక్కిలి ముఖ్యమైనది. తంతిలేని వార్తలు మొదలగునవి దీని ప్రయోగముననే నడపఁబడుచున్నవి. విద్యుత్ఫలితములలోఁ గొన్నిటిని ఈ యాచార్యుఁడు తన విద్యుత్పరిశోధనశాలయందు కనుఁగొనెను. వాటికై ఆయన ఎంతయో పరిశోధనచేసి వాటిని శాస్త్రపద్ధతిని వ్రాసి పదిమందికి వినిపింపవలయునని కుతూహలముఁ గలవాఁడయ్యెను. ఎప్పుడును గొప్పవారు తాముకనుఁగొనిన నూతనవిశేషములను లోకసంగ్రహార్థము లోకమునకు వెల్లడిచేయవలయునని ఉవ్విళ్లూరుచుందురుకదా! ఆర్కిమిడియస్ శాస్త్రవేత్త పదార్థవిజ్ఞానశాస్త్రమున నొకసూత్రమును కనుఁగొనెను. ఆతఁడు స్నానముచేయుచుండఁగా ఆతని కాయూహ తట్టెను. అంతటితోఁ దా నేస్థితిలో నున్నది మఱచిపోయి దిగంబరుఁడుగ నున్నను ఉత్సాహావేశమున నీటిలోనుండి వెలుపలికివచ్చి 'నేను కనుఁగొంటిని, నేను కనుఁగొంటిని' అని కేకలు వైచుచు వీధులలో గంతులువైచెను. ఇట్లే ఫారడే విద్యుత్తుయొక్క కాంతీకరణశక్తిని కనుఁగొనఁగానే వెంటనే సభకావించి ఆసభలోఁ దాను కనిపెట్టినవిశేషమును వెల్లడించెను. సభ ముగిసినపిమ్మటఁ గొంద ఱతనిని పిచ్చివాఁడనిరి. మఱికొంద ఱాతఁడు గొప్పశాస్త్రవేత్త యని తలంచిరి. వారిలో నొకస్త్రీ తనపిల్లను జంక నిడుకొని ఆయాచార్యుఁడు తెలుపు విషయములు సావధానచిత్తముతో వినుచుండెను. సభ ముగిసినపిదప ఆమె ధైర్యముచేసి ఫారడేయొద్దకరిగి యించుకనవ్వుచు మీరిప్పుడు



మైకేల్ ఫారడే

కనుఁగొనిన యీ కాంతీకరణసూత్రమువలని ప్రయోజన మేమిటని ప్రశ్నించెను. అందు కాయన కోపపడలేదు. విసుకుకొనలేదు. ఆయన ముఖమునకు మందహాసవికాసము శోభ తెచ్చెను. ఆయన ఆమెవంకఁ జూచి 'అమ్మా! నేనుకనుఁగొనిన నూతనవిషయము ప్రస్తుతము నీవూహించుచున్నట్లేమియుఁ బ్రయోజనము లేనిమాట వాస్తవము. నీచంకలోని శిశువు వలనఁగూడ ప్రస్తుత మేమియుఁ బ్రయోజనము లేదు. ఆశిశువు పెరిగిపెద్దవాఁడై ఘనకార్యములు చేయుట కెట్టి యవకాశములుకలవో అట్లే యీ నాఁటి యల్పవిషయములు వృద్ధిచెంది గొప్పశాస్త్రముగ వృద్ధిఁ గాంచవచ్చును.' అని నుడివెను.

## వ్యాపక, నిరోధకముల పట్టిక.

| నెం. | వ్యాపకములు | నెం. | నిరోధకములు |
|---|---|---|---|
| 1. | వెండి | 8. | సీసము |
| 2. | రాగి | 9. | జర్మన్ సిల్వరు |
| 3. | బంగారము | 10. | పాదరసము |
| 4. | అల్యూమినము | 11. | మాంగనిన్ |
| 5. | ఇత్తడి | 12. | నీరు |
| 6. | ఇనుము | | |
| 7. | ద్రావకముతోఁ గలిపిన నీరు | | |

అన్నివస్తువులకు నైరుధ్యము కలదు. అందుఁ గొన్నిటికి చాల తక్కువ. ఈ పై పట్టికలో నైరుధ్యము మొదటివస్తువునుండి హెచ్చుచుఁబోవును. వెండికి అన్నిటికన్నను తక్కువ నైరుధ్యమున్నను అది వెలగలది యగుటచేత రెండవస్థాన మాక్రమించు రాగిని విద్యుద్వ్యాపకముగ సాధారణముగ నుపయోగింతురు.



## మిత్ర వియోగము

నోరి నరసింహశాస్త్రి [సాహితీ సమితి]

నీ నికటభూమి నున్నమాత్రాన నాదు
చింతలు శమించు చిత్తంబు శాంతి గాంచు
నీ కరస్పర్శలాభంబు నాకు గలుగ
హృదయ మానందపూర్తి నిర్వేల మగును.

అవిరతోత్సాహకారి సమస్తకలుష
హారి భవదీయ వాక్ప్రవాహంబు గన్న
మానుషాతీత శక్తిసంపన్నుడ నయి
తేరి గనరాక దివ్యదీధితుల బొలుతు.

నీవు కడు దూరవర్తివైనావు నేడు,
నా నికటభూమి నాప్తులు కానరారు,
హృదయదౌర్బల్యమున బ్రవహించు బాష్ప
వారి నాపగ సమర్థు లెవ్వారు లేరు.

పిరికి వడ్డ మదాత్మ జృంభించు నట్లు
పలుకలె న్నడు నా వెన్ను చరతు వీవు!
సడలి జారిన నా మానసంబు నెపుడు
స్థైర్యయుక్తి నిల్పెదు యథాస్థానమందు!

ఓ సఖా, అల్పకాలవియోగమువ కె
క్షీణతం గన్న నన్ను వీక్షించుకొన్న
తలపరాని దొక్కటి తలపునందు
బారుచున్నది యుపమానవాక్య మగుచు.

భూతసంఘంబునకు నెల్ల చేతనమయి
వెలయు శ్రీకృష్ణభగవాను విరహమునను
విజయుని ప్రతాప మవలీల విజితమయ్యె,
నిలువలే నిక నిమిషంబు నీవు గనక!

# సుందర ప్రకృతి

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

మవ్వంపుమొలకలు మలకలఁబడుఁగాక!
తలిరుటాకులు వన్నె దఱుఁగుఁగాక!
అందంపునును మొగ్గ లావులించునుగాక!
పూవుగుత్తులు తెల్లపోవుఁగాక
కమ్మనితెమ్మెరల్ కడ కోసరిలుఁగాక!
యామని మార్మ్రోగం బగునుగాక!
ఒప్పులొల్కెడిచుక్క లొక్కల గగుఁగాక!
పున్నమనెల చిన్నఁ బోవుఁగాక
ఏది యెట్టులైన నెప్పటి కప్పుడే
వింతచక్కఁదనము వింతహొయలు,
వింతచవులు వెలయ విలసిల్లుప్రకృతి క
వంద్యమధురగతికి వందనములు.

# ప్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులుకారా?

చిలుకూరి వీరభద్రరావు గారు

[నాల్గవ సంచిక తరువాయి]

ఇంతవఱకు వ్రాసినదానినిబట్టి యాంధ్రులు గంగాతీరవాసులని తెలిసికొన్నారము. ఈయాంధ్రులు ఋగ్వేదమునకు సంబంధించిన యైతరేయబ్రాహ్మణమున దస్యులుగ వర్ణింపఁబడుటచేత భరతఖండముయొక్క యాదిమనివాసులని పెక్కండ్రు పాశ్చాత్యపరిశోధకులును వారిమార్గము ననుసరించినప్రాచ్య పరిశోధకులు కొందఱును తలంచుచున్నారు. కాని వారియభిప్రాయములు సత్యమునకు దూరములైనవిగ నున్నవి. ఈయాంధ్రుల యొక్క ప్రాచీననివాసభూమి ఉత్తరధ్రువ ప్రదేశములని మన వైదికవాఙ్మయమును బట్టి గోచరింపఁగలదు. దానివివరణము ముందు తెలిపెదను. ఆంధ్రు లర్యులలో నివారనియును, ఉత్తరకురుభూములలో వీరు నివసించునపుడు ఋగ్వేదవైదికార్యమతము మొలకెత్తిన దీయాంధ్రసంఘములోనే యనియును నాయభిప్రాయము. దానివివరణము కూడ ముందు తెలిపెదను. ఒక్కవిషయమును జదువరులు జ్ఞప్తియం దుంచుకొనవలయును. ఆర్యశబ్దమునకుఁగాని, ద్రావిడశబ్దమునకుఁగాని, చర్మములరంగులతోను, రూపరేఖావిలాసములతోను, సంబంధ మెంతమాత్రమును లేదు. ఆర్యశబ్దము మతాచారకర్మలతో సంబంధించి వాఙ్మయమున వక్కాణింపఁబడినపదమై యున్నది గాని కేవలము జాతిపరమైనది కాదు.

ఆర్య, ఆంధ్రశబ్దములవలె ద్రావిడశబ్దము ప్రాచీనమైనదిగాక నవీనమైనదిగ నున్నది. ద్రు-గతౌ='తఱుమఁబడినవా' రని సంస్కృత పండితులు ద్రావిడశబ్దమున కర్థము చెప్పుదురు. ప్రాచీనవైదికవాఙ్మయమునం దాంధ్రశబ్దము గన్పట్టునుగాని ద్రావిడశబ్దము గన్పట్టదు. అయినను నేఁటికాలమునఁ దమిళభాషకును, ఆభాషను మాట్లాడు తమిళులకును ద్రావిడశబ్దము వర్తింపఁజేయఁబడుచున్నది. తమిళులలో నాగజాతులవారి ప్రాకృతస్థితిగతులను వేషభాషలను దెలుపుతెగలు పెక్కులు గలవు. ఈనాగజాతులవారుకూడ నాదిమనివాసులుగారు. వీరుకూడ కొంతనాగరికతకలవారేకాని యనాగరికులుకారు. వీరు మరవర్, కళ్లర్, ఎయినర్, ఒలియర్, ఓవియర్, అరవలర్, పారదవర్, ఫులర్, మొదలగు ప్రత్యేకనామములతో నొప్పి

[illegible] వీరికి తమిళులనువ్యవహారనామ మెట్లువచ్చెనని చదువరులకు సంశయము కలుగకమానదు. ఆవచ్చినవిధాన మిట్టిదని నేను దెలుపుటకు బదులుగా స్వదేశాభిమానమును స్వభాషాభిమానమును మిక్కుటముగా గలిగియుండిన తమిళ్ భాషాపండితులయిన వి. కనకసభాపిళ్లగారు పదునెనిమిది శతాబ్దములనాటి తమిళులు (Tamils eighteen Hundred years Ago) అను గ్రంథములో వ్రాసినవాక్యముల నీదిగువ నుదాహరించుచున్నాను.

"Most of these Mangolian tribes emigrated to southern India from Tamalitti, the great emporium of trade at the mouth of the Ganges, and this accounts for the name "Tamils" by which they were collectively known among the more ancient inhabitants of the Dekkan. The name Tamil appears to be therefore only an abbreviation of the word Tamalittis. The Tamraliptas are alluded to, along with the Kosalas and Odras, as inhabitants of Bengal and the adjoining sea-coast in the Vayu and Vishnu Puranas."

(P. 46)

"ఈమంగోలియా తెగలలో పెక్కుతెగల వారు గంగానదీ ముఖద్వారమున గొప్పవర్తక స్థానమై రేవు పట్టణముగా నున్న తమలిట్టీసునుండి దక్షిణ హిందూదేశమునకు వలస పోయిరి. దెక్కనులోని మిక్కిలిప్రాచీననివాసుల నడుమ 'తమిళు'లని సామూహికనామము తో (దెలియబడుటకిదియే కారణము. కాబట్టి 'తమిళ్' అనునది తమలిట్టీసుశబ్దముయొక్క సంక్షేప రూపముగా (గనుపట్టుచున్నది. వాయు, విష్ణుపురాణములలో (దామ్రలిప్తులు ఓఢ్ర కోసలులతో (గూడవంగదేశస్థులనియు, ప్రాక్సముద్రతీరవాసు లనియును, జెప్పబడిరి."

(పుట. 46)

ఈతామ్రలిప్తినగరము 'తమ్‌లుక్' (Tamluk) అనుపేరుతో రూపనారాయణనది హుగ్లీనదితో సంగమించిన స్థానమునకు (బండ్రెండుమైళ్లదూరమున నాఖాతముతీరమున నిలిచియున్నది.

ఈకనకసభాపిళ్లగారి పై వాక్యములను బట్టి తామ్రలిప్తీపురప్రాంతవాసులయిన ప్రజలకే తమిళులనునామము వచ్చినట్లుగ బోధపడుచున్నది. కాని వీరిని వారు మంగోలియా గుంపు లనుచున్నారు. వీరిప్రథమనివాసస్థానములు మంగోలియాప్రాంతభూములయిన వగునుగాక! గంగాతీరమునం దానామములతో వ్యవహరింపబడినట్లు గనుపట్టదు. మన సంస్కృతవాఙ్మయమును బట్టియు, సంప్రదాయసిద్ధము లయిన గాథలనుబట్టియు వీరార్యద్రవిడులుగ (గనుపట్టెదరు. ఈవివరణమును గూర్చి నేను మీకు దెలియ(జెప్పగలను, దస్యుశబ్దమునకు బ్రప్రథమమున శత్రువని కాని, అసురుడని కాని, దొంగయని కాని యర్థ మున్నట్టు గానరాదు. ఇటీవలిసంస్కృతవాఙ్మయమున దస్యులన దొంగలనునర్థము ననే రూఢపదమయినది. కాని ఋగ్వేదములోని ప్రాచీనమంత్రములు రచింపబడుటకు బూర్వము దస్యుశబ్దము సామాన్య ప్రజావాచకశబ్దముగ నుండెను. అదెట్లన్న వినుడు: ప్రాచీనకాలమున, పారస, పార్థియా, మాడియా, అస్సీరియా మొదలగుదేశముల

లోని ప్రజలు దస్యులనునామముతో వ్యవహరింపఁబడుచున్నట్టు ఇప్పటికి రెండువేల యేనూఱు (2500) సంవత్సరముల క్రిందట నున్న దరియవసు (Darius) అను అచిమినియన్ రాజు ప్రాచీనపహ్లవీభాషలో వ్రాయించినశాసనములలో దస్యులనువారు ఆదేశపు ప్రజలుగా వర్ణింపఁబడి యున్నారు. (See the Behisteen Tables) రెండవకలములో పదవపేరాలో నిట్లున్నది. హియాక్ దరియవస్ కోసాన్రి=మఱియు దరియవసురాజు చెప్పుచున్నాఁడు; హు=నేను, అర్మినియ-ఫా-ఇక్కి=అర్మీనియనులకు, హులిబురాదియు ఫ్రి=నాభృత్యుఁడగువానిని, వామిస్సాయేసి=వామిసెస్ అనుపేరుగల, పర్సర్ కిర్ = పారసికునినొకని, తిఫప=రాయబారినిగా, తవెః = పంపుచు, యెచితు=ఈప్రకారముగా, యే తెరి=వానితో చెప్పితిని. హునినా=నన్ను, ఇన్నితిరివాన్ పి=తలపెట్టని, యుపిపా=వారిని, పతిఫా=తిరుగబడినవారిని, దస్యునోస్ అప్పి = ఆప్రజలను, వితఃపోయి, అఫపిస్=నాశనముచేయుము. వస్ని=పిమ్మట, వామిస్సా=వామిసెస్, తక్=వెళ్లెను.

౧౧.వ పేరాలో నిట్లున్నది. బతియూరాయను దేశమున తన శత్రుసైన్యమునకుఁ దనసైన్యమునకు యుద్ధముజరిగెనని చెప్పు సందర్భమున నిట్టివాక్యము గన్పట్టుచున్నది. అవుర్ మస్దా = ఆహుర్ మజ్దా (పారశీకదేవుఁడు), హు=నాకు, పి త్తి=సహాయుఁడుగా, తస్=ఉండెను. అవుర్ మ స్తనా=ఆహుర్ మజ్దా యొక్క, సావిన్=సహాయముచేత, హునినా=నాయొక్క, దస్సునోస్=ప్రజలు, పతి[illegible] బడినవారు (అయిన), దస్సునోస్=ప్రజలను, ఇర్సిక్కి=పూర్తిగా, అఫపిస్ = నాశనము గావించెను. ఇట్లే దస్సునోస్ అరావతీస్=అరోచీసియా ప్రజలనియు, దస్సునోస్ పర్సర్=పారసీప్రజలనియు, దస్సునోస్ బపిలుఫా=బాబిలోనియన్ ప్రజలనియు, హునినాదస్సునోస్=నా ప్రజలనియు, దస్సునోస్ అస్సురాన్=అస్సీరియాదేశ ప్రజలనియు, విస్పష్టముగా పెక్కుతావుల దస్సుశబ్దము ప్రజావాచకశబ్దముగా వర్ణింపఁబడియున్నది.

ఈదస్సుశబ్దమే వైదికవాఙ్మయమునందు దస్యుశబ్దమైనది. దీనినిబట్టి మనము గ్రహింపవలసిన దేమనఁగా, ఆహుర్ మజ్దానుబూజించు జరాత్రుష్టులను నార్యశాఖలవారితో పైందవార్యులు విడిపోక యుత్తరకురుభూములలో (దేవతాస్థానములు) గలసిమెలసి నివసించి యుండుకాలమున దస్సుశబ్దము ప్రజావాచకశబ్దముగ వ్యవహారముల నుండెనని తేటపడుచున్నది. ఐతరేయబ్రాహ్మణమున నాంధ్రాదిజాతులవారు దస్యులుగను వైశ్వామిత్రులుగను వర్ణింపఁబడుటచేత నైతరేయబ్రాహ్మణము రచింపఁబడుటకుఁ బూర్వమే యీయాంధ్రాదిజాతులవారుకూడ నుత్తరకురుభూములలోని ప్రజలై యుండిరని చెప్పక తప్పదు. ఋగ్వేదములోని కొన్నిమంత్రములలో దస్యుశబ్దమును విశేషణముగ గ్రహించి వృత్రాదివాచిగను, అసురవాచిగను బ్రయోగింపఁబడెను, అసురశబ్దమువలెనే దస్యుశబ్దమునకు మొదట దుష్టార్థము లేదు.

అసురశబ్దము ఋగ్వేదములో ౧౦౫ గి తావుల మాత్రమే కన్పట్టుచున్న దనియు, వీనిలో తొంబదిస్థానముల మంచియర్థము లో నేవాడఁబడియున్న దనియు వేదవిమర్శకులు వక్కాణించుచున్నారు. మొత్తమున నేడవ వంతు శబ్దములు దేవతలకు శత్రువులను నర్థమున వ్యవహరింపఁబడినవిగఁ జెప్పుచున్నారు. అసురః డనఁగా బలవంతుఁడు, పరాక్రమవంతుఁడు, అని మాత్రమే మొదటియర్థము. ఋగ్వేదమంత్రములలోఁ గొన్నిట, ఇంద్రుఁడు మిత్రుఁడు, వరుణుఁడు మొదలగుదేవత లసురులుగనే వక్కాణింపఁబడిరి. దేహబలముగల వాఁడనుసందర్భమునసింద్రునకువిశేషముగను, నీతిబలముగలవాఁ డనుసందర్భమున మిత్రావరుణులకువిశేషణముగను, వాడఁబడినది. దేవతలు "దివస్పుత్రాసః, మహస్పుత్రాసః, అసురస్య వీరాః" అని వేదములో వర్ణింపఁబడిరి. అసుర్యము అనగాఁ బలము. అసురత్వమనఁగా మాయ. నీతిధర్మములను వ్యాప్తిచేయుటయందు అసురుఁడు (వరుణుఁడు) మాయ ప్రయోగించును. కాలక్రమమున వరుణోపాసకులయిన జరాతుష్ట్రులకును (పారసీలు), ఇంద్రోపాసకులగుహైందవార్యులకును బూజాకర్మవిధానముల భేదములు కలిగి యొండొరులకు ద్వేషములు ప్రబలి యుద్ధములుకూడ జరుగుచువచ్చినవి. వరుణుఁడును, ఇంద్రుఁడును, మిత్రుఁడును ద్వాదశాదిత్యులలోనివారు. అదితిసంతాన మాదిత్యులయిరి. అదితి కశ్యపప్రజాపతిభార్యలలో నొకతెగాఁ బౌరాణికవాఙ్మయమునందుఁ జెప్పఁబడియుండెను. ఇంకను దితి, దనువు, వినత, కద్రువ మొదలగుభార్యలు పెక్కండ్రు గలరు. వీరలకును, దైత్యులు, దానవులు, వైనతేయులు, కాద్రవేయులు మొదలగువారు సంతానముగ వక్కాణింపఁబడిరి. వీరిలో మొదట నాదిత్యులలో నార్యమతము మొలకెత్తినది. కాఁబట్టి యాదిత్యులలో వరుణోపాసకులకు, ఇంద్రోపాసకులకు జరిగినయుద్ధములే దేవాసురయుద్ధములుగఁబరిణమించినవి. మనసంస్కృతవాఙ్మయమునందును, వైదికవాఙ్మయమునందును దేవాసురులు జ్ఞాతులుగఁ బేర్కొనఁబడిరి. "దేవాశ్చాసురాశ్చోభయే ప్రాజాపత్యా అస్మిన్ లోకే స్పర్ధంతా, తేదేవా అసురాన్ సపత్నాన్ భ్రాతృవ్యా నస్మాల్లోకా దనుదంత." అనిశతపథబ్రాహ్మణములో జ్ఞాతులుగ వక్కాణింపఁబడిరి. వీరికి స్పర్ధలు జనించినపిమ్మట జరాతుష్ట్రుల దేవతలను అసురులని మాయావులని హైందవార్యులును, హైందవార్యుల దేవతలను, దయ్యములనియుఁ బరస్పరము నిందించుకొనుట ప్రారంభమైనది. ఈస్పర్ధలేర్పడిన పిమ్మటనే అసుర, దస్యుశబ్దములకు దుష్టార్థము లేర్పడి యవి రూఢములయినవి. కనుక అసురపదవాచ్యులును, దస్యుపదవాచ్యులును అర్యగణములోనివారే కాని, అన్యేతరులుగారు. అర్యులన నెవ్వరు? అర్యశబ్దము ఈశ్వరవాచిగ వేదనిఘంటువునందు గలదు. అర్యశబ్దముపైన అపత్యప్రత్యయము రాఁగా ఆర్యశబ్దము సిద్ధించుచున్నది. కావున ఆర్యులన సదాచారసంపత్తిగల శ్రేష్ఠులు, లేక పూజ్యులని పూర్వాచారపరాయణులు కొంద

అర్థము చెప్పుచున్నారు. నిఘంటుకారులు కొందఱు 'ఋగతౌ' అను ధాతువునుండియు, మఱికొందఱు 'అర్చ' ధాతువునుండియు, ఆర్యశబ్దము పుట్టినదని వ్రాసిరి.

అర్ ధాతువునకు సముద్రోదకమును గాని భూమిని గాని కలియఁగొట్టుట యను నర్థము కలదు. ఆర్యులలో దక్షిణోత్తర శాఖ వారయిన జరాతుష్ట్రులలో అర్ ధాతువు కృషితో సంబంధించిన కార్యములను దెలియఁజేయుటకుమాత్రమే వాడుకలో నుండఁగా హైందవార్యులలో నీధాతువునకు బదులుగా "కృష-విలేఖనే" అను ధాతువు వాడుకలోనికి వచ్చినది. దీనినుండి కృషి, కృషీవల, కర్షక శబ్దములు పుట్టినవి. ఈధాతువునుండి పుట్టిన కృష్టి చర్షణిశబ్దములు దున్నుకొనువాఁ డను నర్థము మొదట గలిగియున్నను, ఆర్యశబ్దము వలె సామాన్యముగా మనుష్యవాచకము లయ్యెను. తెడ్లచే నీటిని గదలించి పడవలను నడుపునావికులును, నాగటిచే భూమిని గలియ దున్ని పంటలు పండించెడి కర్షకులునుగూడ నర్యులే. అర్యులనుశబ్దము తెలుపు నలుపు రంగుల భేదములతో సంబంధించినది కాదు. రూపరేఖావిలాసములతో సంబంధించినదియు కాదు.

మఱియు "అర్యః స్వామివైశ్యయోః" అని పాణిని నుడివినదానినిబట్టి వైశ్యులే అర్యులుగ నున్నారు. వైశ్యశబ్దము విశ్ అనుధాతువు నుండి పుట్టినది. విశులనఁగా ప్రజలు. వ్యవసాయాదికృత్యములనిర్వహించు ప్రజలే వైశ్యు లనంబడుచున్నారు. ప్రాచీన కాలమున కొన్ని దేశములలో వి[illegible] మును, మఱికొన్ని దేశములలో దస్యులనుపదమును ప్రజావాచకపదములై యుండుటచేత నీరెండుపదములును మనము పర్యాయపదములుగ గ్రహింపఁదగును. కనుక దస్యులుగూడ నర్యులలోనివారనుటకు సంశయింపఁ బనిలేదు. ఆంధ్రులు దస్యులని వక్కాణింపఁబడిరి గావున వీరుకూడ నర్యులలోనివా రనుటకు సంశయింప నక్కఱలేదు.

భరతఖండములోఁ జల్లాఱిపోయిన యగ్నిహోత్రుని బ్రజ్వాలింపఁజేసి లంకాద్వీపమువఱకుఁ దీసికొనిపోయి భారతీయులకు నార్యత్వ మిప్పించినవారు లేక భారతవర్షమును బవిత్రవంతముగాఁ జేసినవారు అంగీరసులనువా రాంధ్రులలోనివారేయని కొన్ని యైతిహ్యములవలనఁ దేటపడఁగలదు.

స్వాయంభువమన్వంతరమునందు ప్రజోత్పాదనార్థమై బ్రహ్మదేవుఁడు పదిమందిమానసపుత్రులను బుట్టించెననియు వారిలో నంగీరసుఁ డొకఁడనియు భాగవతపురాణము పేర్కొనుచున్నది. (భాగవతము 3 వ స్కంధము) ఈమన్వంతరమున బ్రాహ్మణమతమును వృద్ధిపొందించిన బ్రహ్మమానసపుత్రులందఱును మహాదేవునిశాపముచే భస్మీభూతులైరి.

పూర్వపుబ్రహ్మమానసపుత్రులు మరణముఁజెందఁ బ్రజోత్పాదనార్థమై బ్రహ్మదేవుఁడు వారిని మరల వైవస్వతమన్వంతరారంభమునందుఁ బుట్టించెను. వరుణుని యజ్ఞమునందుఁ బుట్టిన ముగ్గురు ఋషులలో నీతఁ డొక్కఁడు. ఇతనికి [illegible]

...డని పేరుగలడు. వరుణుని యజ్ఞము నందలి యగ్ని యీతనిని పుత్త్రత్వమున స్వీకరించెనట! (మత్స్యపురాణము అ. 194) ఈ యైతిహ్యముయొక్క తాత్పర్యమేమి? మనది వైవస్వతమన్వంతరము. బ్రాహ్మణు లిప్పటికిని 'వైవస్వతమన్వంతరే' అని సంకల్పము చెప్పునప్పుడు స్మరింపుచుందురు. బ్రహ్మమానస పుత్త్రుఁడన్నను, అగ్ని పుత్త్రునిగ స్వీకరించెనన్నను అగ్న్యుపాసకుఁడగు బ్రాహ్మణునకు దత్తపుత్త్రుఁడనియేకదా యర్థము. వరుణ యజ్ఞమన్నలోడనే వరుణోపాసకులయిన బ్రాహ్మణులుచేయు యజ్ఞమనియే తాత్పర్యము. ఆహుర్ మెజ్డాయను వరుణదేవుని నుపాసించు జరాతుష్ట్రుల దేశములోని ప్రజలు దస్యులుగదా! ఆంధ్రులు దస్యులే. ఈదస్యులను బ్రహ్మణ్యులను గావించినది వరుణోపాసకులయిన బ్రాహ్మణక్షత్రియులు చేయు యజ్ఞములయందు బ్రహ్మలుగ నుండు వసిష్ఠులని చెప్పఁదగును. ఆర్యవసిష్ఠుఁడు (Arya Vashistar) ప్రధాన దేవదూతయని జెండావెస్టాయను పారసీలవేదమునందు గలదు. మఱియు అంగీరసులనువా రాంధ్రులలో నేర్పడిన యొకశాఖ వారని యీక్రిందియైతిహ్యములుగూడ బలపఱచుగలవు. అంగుడు, వంగుడు, కాళింగుడు, పుండ్రుడు, సింహుడు, అంధ్రుడు బలిక్షేత్రము నందుఁ బుట్టిన పుత్త్రులని భాగవతపురాణము నందు :—

"అంగవంగకళింగాద్యా
స్సింహపుండ్రాంధ్రసంజ్ఞితాః;
జజ్ఞిరే దీర్ఘతమసో
బలేః క్షేత్రే మహీక్షితః."

అనియుదాహరింపఁబడినది. అనఁగా అంగులు, వంగులు, కళింగులు, సింహులు, పుండ్రులు, అంధ్రులు సోదరజాతులని భాగవతపురాణకర్త యొక్కయభిప్రాయము. కాని దీర్ఘతమస్సను ఋషి యాంధ్రబ్రాహ్మణుఁడే. కావున అంధ్రుఁడను వానిని యాతనిపుత్త్రునిగా వ్రాయుట యుక్తముగా లేదని కాఁబోలు నాతని విడిచి యైదుగురుపుత్త్రులనే వక్కాణించి సింహునికి బదులుగా వానిస్థానమున సుహ్మునిఁ జేర్చి మహాభారతములోనివి లేఖకుఁడిట్లు చెప్పియున్నాఁడు.

"భవిష్యంతి కుమారాస్తే
తేజసాఽఽదిత్యవర్చసః,
అంగో వంగః కళింగశ్చ
పుండ్రస్సుహ్మశ్చ తే సుతాః"

వీరినామములనుబట్టి వీరు పాలించిన దేశముల కానామములు కలుగుచున్నవని యీ క్రిందిశ్లోకములలోఁ జెప్పియున్నాఁడు.

"తేషాం దేశాస్సమాఖ్యాతా స్స్వనామ కథితా భువి, అంగస్యాంగోభవ ద్దేశో వంగో వంగస్య చ స్మృతః; కళింగవిషయ శ్చైవ కళింగస్య చ సస్మృతః, పుండ్రస్య పుండ్రాః ప్రఖ్యాతా స్సుహ్మా సుహ్మస్య చ స్మృతాః" (శ్రీమహాభారతే ఆదిపర్వాంతర్గత సంభవ పర్వణి చతురధికశతతమోధ్యాయః శ్లో. ౪౨. ౪౩. ౪౪.) కొన్ని ప్రతులలో సుహ్మ శబ్దమునకు బదులుగా శుంగశబ్దము మహాభారతమునఁ గనబట్టుచున్నది. వీనితాత్పర్యమేమి? మహాభారతములో భీష్ముఁడు చెప్పిన

కథ యిది, "పూర్వకాలమున ఉతథ్యుఁ డను ఋషి గలఁడు. వానికి మమత యను భార్య యుండెను. ఉతథ్యునకు దేవగురువైన బృహస్పతి తమ్ముఁడు. ఒకనాఁడు బృహస్పతి కామపరవశుఁడై మమతను రమ్మనెను. మమత తన దేవరునితో (పెనిమిటి తమ్ముఁడు) నిట్లు పలికెను. 'నీ జ్యేష్ఠునివలన గర్భముధరించి యున్నాను. నీవు నన్నిపుడు తలఁపరాదు. ఓ దేవగురువైన బృహస్పతీ! నాగర్భముననున్న బిడ్డఁడు షడంగములతోఁ గూడ వేదము నభ్యసించియున్నాఁడు. (ఔతథ్యో వేద మత్రైవ షడంగం ప్రత్యధీయత). నీబీజముకూడ నిరర్థకమైనది కాదు. ఏకకాలమునందు నిరువురుబిడ్డలు నిలుచుటకు గర్భమునఁ దావెట్లు సాధ్యమగును? నేఁడు నీవు నన్ను గోరఁగూడదు.' అని మమత మొత్తుకొనెను." కాని దేవగురువైన బృహస్పతి దౌష్ట్య మిట్టిదని చెప్పరానిదిగావున నాభాగమును గ్రంథమునం జదువుకొనుఁడని సూచ్చరించుచున్నాఁడను. "బృహస్పతియొక్క శాపవశమున షడంగములతో వేదము నేర్చిన వాఁడైనను జాత్యంధుఁడై పుట్టెను. అందువలన దీర్ఘతమస్సను నామమును వహించెను. ఈయంధఋషి వేదము చదువుకొన్నవాఁడును యోగ్యుఁడు నగుటవలన ప్రద్వేషి యను నొక బ్రాహ్మణకన్యను వివాహము చేసికొనియెను. ఆమె మంచిరూపసి, ఆమెవలన నీతనికి గౌతమఋషి మొదలగు కొడుకులు కొందఱు జనించిరి. ధర్మాత్ముఁడు, మహాత్ముఁడు, వేదవేదాంగపారగుఁడు నైనదీర్ఘతమస్సు సురభికుమారునివలన గోధర్మమును నేర్చుకొన్నాఁడఁట. ("ధర్మాత్మాచ మహాత్మాచ వేదవేదాంగపారగః, గోధర్మసౌరభేయాశ్చ సోధీత్య నిఖిలం మునిః" మూలము). ఇతఁడు పాపాత్ముఁడై భిన్నమర్యాదతోఁ ప్రవర్తించుచున్నాఁడు గావున నీతని నాశ్రమమునుండి బహిష్కరింపవలసినదని యెల్లఋషులును బలికిరఁట. ఇతనిగురించి ఋషు లనేకవిధములుగాఁ బలికిరఁట. భార్యయైన ప్రద్వేషియును బ్రాహ్మణికిఁగూడ అనురాగముతప్పి భర్తతో నిట్లు పలికెనఁట, 'ఓఋషీ! భార్యను భరించువాఁడుగనుక భర్తయనియు, భార్యను రక్షించువాఁడుగనుక పతియనియుఁ బెనిమిటికిఁ బేరులు వచ్చినవి. నీవు నాకు భర్తవునుగావు; పతివినిగావు నీ వంధుఁడవగుటచేత నిన్నును నీబిడ్డలను నింతకాలము బోషించితిని, ఇంక నేను బోషింపఁజాల' నని పలికెను, అంతటనాతనికిఁ గోపము వచ్చి 'నన్ను క్షత్రియులకడకుఁ గొనిపోయి మీరు భాగ్యవంతు లగుఁడు'రని పలికెను. అందుకామె 'ఓ బ్రాహ్మణుఁడా! నీవలన సంపాదింపఁబడినధనముతో నాకుఁ బ్రయోజనము లేదు అది దుఃఖమునకే కారణమగును. ఓ బ్రాహ్మణశ్రేష్ఠుఁడా! నీయిష్టమువచ్చినట్లు చేయుము. నేను మాత్రము పూర్వమువలె నిన్నుఁ బోషింపను' నని ప్రత్యుత్తర మిచ్చెను. పిమ్మట దీర్ఘతమస్సిట్లు పలికెను.

"ఈరోజు మొదలుకొని ప్రతిస్త్రీయును తనజీవితకాలమంతయు నొక్కభర్తతోనే గడుపవలయునని కట్టడ చేయుచున్నాను."

"భర్త బ్రదికియున్నను, మృతుఁడైనను భార్యకు మఱియొకమనుష్యునితో సంబంధ ముండరాదు. అట్లుండినయెడల నామె పతిత స్త్రీ నాఁబడు. భర్తలేకయున్నస్త్రీ యెప్పుడును బాపమున కున్ముఖురా లగుచున్నది. ఆమె ధనవంతురాలయినను దానిని నిజముగా ననుభవింపఁజాలదు. ఎప్పుడును అపనిందలు వెంటాడించును."

ఇట్లు అంధఋషి పలుకునప్పటికి నా బ్రాహ్మణస్త్రీకి కోపమువచ్చి "బిడ్డలారా! వీనిని గంగలోఁ ద్రోయుఁ" డని గౌతమాదుల కాజ్ఞ నిచ్చెను.

అంతట గౌతమాదులు లోభమోహాభిభూతులై అంధుఁడును వృద్ధుఁడు నైన వీని నేల పోషింపవలెనని యొక తెప్పకంటఁగట్టి గంగలో విడిచిపెట్టిరఁట. పిమ్మట నతఁడు తెప్పతో మునుఁగుచుఁ దేలుచు గంగలోఁ గొట్టుకొనిపోవుచు ననేకరాజుల దేశములను దాఁటి పోయెను. అంతట బలియనురాజు వానినిజూచి సమీపించి యతఁడు మహానుభావుఁడని తెలిసికొని తా నపుత్రవంతుఁడుగావున తన క్షేత్రమునం దాతనిచే సంతానముఁ బడయవచ్చునని తలంచి యాతని బంధవిముక్తుని గావించి దరికిఁ జేర్చి వానికిఁ దనమనోరథమును దెలిపెను. దీర్ఘతమ సందున కంగీకరింప బలి తన భార్యయైన సుధేష్ణ కాసమాచారమును దెలిపి పంపెనఁట. కాని సుధేష్ణ యతఁడంధుఁడును వృద్ధుఁడు నౌటవలనఁ దనదాసిని వృద్ధురాలిని శృంగారించి వానికడకుఁ బంపెనఁట! ఆమె వలన నాతఁడు పదునొకండుగురుపుత్రులను గాంచెను. వారెల్లరు వేదముల నభ్యసించిరి. వారిలోఁ గాక్షీవత్ అనువాఁడు జ్యేష్ఠుఁడు. ఒకనాఁడు బలి వారలను గాంచి వీరేనా నా పుత్రులని యడిగెనఁట. అందు కాఋషి "వీరు నాకొడుకులుగాని నీకొడుకులుగారు నేనంధుఁడననియు, వృద్ధుఁడననియుఁ దిరస్కరించి నీ భార్య నాకడకు రాలేదు. వీరు శూద్రస్త్రీ వలనఁబుట్టినవారు" అని ప్రత్యుత్తరమిచ్చెనఁట! అప్పుడు వానిని సంతోషపఱచి సుధేష్ణను బంపెను. అతఁ డామెశరీరము నంటిచూచి నీకు సూర్యునివంటిపుత్రులు పుట్టెదరని చెప్పి యనుగ్రహించెను. అపుడు నామెకు, అంగుఁడు, వంగుఁడు, కళింగుఁడు, పుండ్రుఁడు, సుహ్మఁడు అనుపుత్రులు పుట్టిరి. వారినామములే వారు పాలించుదేశములకు నామములయ్యెను. ఈప్రకారముగాఁ బూర్వకాలమున గుణవంతులు, పరాక్రమవంతులు, ధనుర్వేదపారంగులునగు క్షత్రియులు బ్రాహ్మణులవలనఁ గలిగిరి." అని యీకథ భీష్ముఁడు సత్యవతికిఁ జెప్పినట్లుగా మహాభారతము ఆదిపర్వము సంభవపర్వములోఁ జెప్పఁబడియున్నది.

ఈ యైతిహ్యములలోఁ దాఁగియున్న సత్యమును మనము తెలిసికొనవలెనన్న సాధనము లేకపోలేదు. చూడుఁడు:

౧. అంగుని, అంధ్రుని, ఏకబీజోత్పన్నులనియు, ఏకగర్భజనితులనియు భాగవతపురాణము పేర్కొనుట.

౨. శాతవాహనులలో వేదసంపత్తుగల 'వేదశ్రీ'యను రాజు వ్రాయించిన గొప్పదగు నానాఘట్టు (Nanaghat) శాసనములో తన

తండ్రిని 'అంగీయ కులవర్ధనుఁ' డని పేర్కొనుట.

౩. శాతవాహనవంశము నాంధ్రవంశమని పురాణము లైకకంఠ్యముగా నంగీకరించి వక్కాణించుట.

౪. శాతవాహను లాంధ్రులని సుప్రసిద్ధ పరిశోధకు లంగీకరించుట.

౫. శాతవాహనవంశము బ్రాహ్మణవంశమని శాసనములవలన స్పష్టమగుట.

౬. పురాణేతిహాసములలో అంగుని, వంగుని, కళింగుని, పుండ్రుని, సింహుని లేక సుహ్ముని, అంధ్రుని, జాత్యంధుని పుత్రులనుగా వక్కాణించుట.

౭. దీర్ఘమైన అంధకారముతోఁ గూడినవాఁ డనునర్థముగల దీర్ఘతమస్సను నామమును వానికిఁ బెట్టుట.

౮. ఈ అంధఋషి గర్భములో నుండఁగానే షడంగములతో వేదముల నభ్యసించినవాఁడని పురాణేతిహాసములలో వక్కాణింపఁబడియుండుట.

౯. అంగీరసవంశములో నుదాహరింపఁబడిన ౩౭ మంత్రద్రష్టలలో ఉతథ్యుఁడు, దీర్ఘతమస్సు, కాక్షీవత్, అనువారు కన్పట్టుట.

౧౦. అంగీరసగోత్రగణములో 'ఆంగీరస, ఔతథ్య, కాక్షీవత్, గౌతమ, దీర్ఘతమస' అను పంచప్రవరలుగల దీర్ఘతమసగోత్రమును, ఆంగీరస, ఔతథ్య, దైర్ఘతమస' అను త్రిప్రవరలుగల దీర్ఘతమసగోత్రము నుండుటయును.

౧౧. అంగీరసగోత్రగణములోఁ జేరిన యనేకగోత్రములలో* ఔతథ్యుఁడు, దీర్ఘతమసుఁడు, గౌతముఁడు, కాక్షీవతుఁడు ఋషులుగా వక్కాణింపఁబడుటయు;

ఈపై వానిని విమర్శదృష్టితోఁ బరిశీలించిచూచిన వీరెల్ల రాంధ్రులని తేటపడఁగలదు,

శాతవాహనులను ఆంధ్రులని పురాణములు వక్కాణించుచున్నవిషయమును, ఇటీవలి సుప్రసిద్ధపరిశోధకులలో నొకరగు శ్రీయుత కె. పి. జయస్వాలు, ఎమ్. ఏ., బార్-అట్-లా గారుకూడ నంగీకరించి భారవేలునికి సమకాలికుఁ డయిన శతకర్ణినిగూర్చి యిట్లు వ్రాసియున్నారు.

"This was a King of the dynasty called the Satavahanas, according to inscriptional records of the family themselves, and the "Andhras" according to the Puranas."

ఇతఁడు శాతవాహనవంశమువారు ప్రకటించిన శాసనముల ననుసరించి శాతవాహనులలోనివాఁడును, పురాణములను బట్టి యాంధ్రులలోనివాఁడును నైన యొకరాజుగా నుండెను.

మఱియు జయస్వాలుగారు తమ్ముఁ దాము పరిపాలించుకొనుకులములలో (Republican people) నుండి శాతవాహను లేర్పడిరని యైతిహ్యమువలన బోధపడుచున్నదని యీక్రింది వాక్యములను వ్రాసియున్నారు.

"The Satavahanas according to tradition arose out of a republican people"

---

* ఈ గోత్రములనుగూర్చి మత్స్యపురాణముఁ జూడుఁడు.

(బీహారు, ఒరిస్సా, పరిశోధకసంఘము వారి హాతిగుంఫాశాసనము, పుటలు ౪౫,౪౬ చూడుఁడు.)

శాతవాహనవంశములోనివాఁడైన 'వేద శ్రీ'యనువాఁడు తనతండ్రిని అంగీయకులవర్ధనుఁడని వక్కాణించుటచేత శాతవాహనవంశమునకు అంగీయకులమను మఱియొకనామము తేటపడఁగలదు. శాతవాహనులశాసనములను బరిశోధించిన జయస్వాలుగారు శాతవాహనవంశము బ్రాహ్మణవంశ మనియును, క్రీ. శ. ౨౧౦-౧౩ మధ్యమున ప్రతిష్ఠానమున రాజ్యము స్థాపించిరని మఱియొకసందర్భమునఁ జెప్పియున్నానని యాశాసనమునుగూర్చి వ్రాసిన వ్యాఖ్యలోనే యిట్లువ్రాసియున్నారు.

"Elsewhere I have shown that it was a Brahmin dynastry who established themselves at Pratisthana (now Paithan) about 210 or 213 B. C."

ఐతరేయబ్రాహ్మణమున ఆంధ్రులు దస్యులుగ వర్ణింపఁబడుటయు, శాతవాహనవంశపు రాజులు కొందఱు ఆర్యులమనియు, బ్రాహ్మణులమనియుఁ జెప్పకొనియుండుటచేతఁ బురాణములలో శూద్రులయిన యాంధ్రులని చెప్పిన విషయములను సమన్వయముచేసి చెప్పుట కిష్టము లేకయో లేక తెలియకయో శాతవాహనవంశ మాంధ్రవంశము కాదనియు, శాతవాహను లాంధ్రులు గారనియు వ్రాయుచున్నారు. కాని యీరహస్యములు, యీమర్మములు, పురాణవాక్యములవైఖరులు తెలిసికొనఁజాలక యీగొప్పపరిశోధకులెల్లరు నక్రమమార్గములనుబట్టి హిందూదేశచరిత్రమును దలక్రిందుగ వినిపించుచున్నారు. శాతవాహనులు మహారాష్ట్రబ్రాహ్మణులని సుక్తంకారభిప్రాయపడిరి. బంగాళీబ్రాహ్మణులని మహామహోపాధ్యాయహరప్రసాదశాస్త్రిగా రభిప్రాయపడినారు. నేనన్ననో, పీ రాంధ్రబ్రాహ్మణులని చెప్పచు, మహారాష్ట్రులు, వాంగులును (బంగాళీలును) ఆంధ్రశాఖలలోనివారేయనియు, శాతవాహను లాంధ్రబ్రాహ్మణులే యనియు వాదించుచున్నాను. గొప్పపరిశోధకులయిన యీపరిశోధకుల వ్యాఖ్యానములం జదివి విజయనగరముకాలేజిలో చరిత్రాధ్యాపకముఖ్యులుగనున్న శ్రీయుత మామిడిపూడి వేంకటరంగయ్యగారు శాతవాహను లాంధ్రులుగారనియు, ఆంధ్రులు నిషాదులనియు వాదించుచు శాతవాహను లాంధ్రులని రుజువుచేయవలసినభారము నాయందున్నదని 'సారస్వతసర్వస్వము' అను పత్రికలో ప్రశ్నించుచున్నారు. (Challenge) "ఇటీవలిపరిశోధకులగు సుక్తంకారు, జయస్వాలు హరప్రసాదశాస్త్రి గారు మొదలగువారివ్యాఖ్యానములను జదివినమీఁదటనే యాంధ్రులనుగూర్చి సమగ్రముగాఁ జర్చింపఁదలఁచియే వారికిఁ బ్రత్యుత్తరముగాఁ "బ్రాచీనాంధ్రు లెవ్వరు? ఆర్యులుకారా?" అను ప్రశ్నముతో సీర్షికనుబెట్టి వ్రాయుచున్నాను. వీరి ప్రశ్నములన్నిటికిని వీరు 'ఛాలెంజి' చేయక పోయినను నేను వ్రాయువాఁడనే అయినను నామిత్రులయిన వేంకటరంగయ్యగారు "నా విమర్శములోని శాతవాహను లాంధ్రులుకారను వాదమును ఖండించుట వీరభద్రరావు

గారికి విధిమైయున్నది. ఈవాదమునేనుక్రొత్తగ తీసికొనివచ్చిపెట్టినది కాదు. పరిశోధకులని ప్రఖ్యాతిఁగాంచిన సుక్తంకారు మొదలగు పండితులచే నీసిద్ధాంతము సమర్థింపఁ బడియున్నది. పరిశోధకశక్తి నాకులేదని యీ ప్రపంచ మంగీకరించునుగాని జయస్వాలు మొదలగువారికి లేదనిచెప్పుట కెవరైన సాహసింపఁగలరా? ఈ పండితులయొక్క అభిప్రాయము లిట్టివనియు, వీనిని వారు కొన్ని హేతువులచే పోషించిరనియు వీరభద్రరావుగారికిఁ దెలియకపోలేదు. వీరభద్రరావుగారు ఆంధ్రులచరిత్రయందు విశేషపరిశ్రమను జేసియున్నారు; చేయుచున్నారు. వారిజీవితమునంతను అందుకై వినియోగించుచున్నారు. ఆంధ్రులనుగుఱించిన వ్యాసములను ఇప్పటికిఁగూడఁ బత్రికలలోఁ బ్రకటించుచున్నారు. ఇట్టి సందర్భమునఁ బ్రతిపక్షుల వాదముల లోని లోపములను సహేతుకముగ ఖండించుట వారికి ధర్మముకదా! అటు వారు వారివిధిని నిర్వహింపకపోవుటచేతనే "అల్పజ్ఞులగు నావంటివారు అపభ్రమలపాలగుట తటస్థించుచున్నది..."ఆంధ్రులచరిత్రమునకుఁబునాదుల నిర్మూలింపఁగల యభిప్రాయములను" ఇతరపరిశోధకు లిచ్చుచుండినపుడు వానినేల ఖండింపకుండిరో? ఇట్టిభిన్నాభిప్రాయము లున్నవని నేను చెప్పుట దోషమంట! ఇప్పటికైనను వారీయభిప్రాయములను ఖండింతురుగాక"అని గట్టిగా హెచ్చరించుచున్నారు.

వీరిహెచ్చరికను శిరసావహించి యిదివఱకు నావిధిని నేను నెఱవేర్పనివాఁడనైనను, ఇఁకముందు నెఱవేర్చుకొనుచున్నానని వినయపూర్వకముగ విన్నవించుకొనుచున్నాను. ఆంగీరసగోత్రగణములును భృగుగోత్రగణములును నాంధ్రులకు సంబంధించినవే యనియు, శాతవాహను లాంధ్రులే యనియు, అంగులు, వాంగులు, కాళింగులు, శుంగులు, పుండ్రులు కూడ నాంధ్రులేయనియు ఈ-న వ్యాసమున సహేతుకముగా సోదాహరణముగాఁ బరస్పరసంబంధములం దెలుపుచుఁ జర్చింపఁబోవుచున్నాను.

## సవరణ

[రెండవ జయసింహుని పెణుకపఱు దానశాసనము-గతసంచిక]

పుట. **141.** వ్యాసాంతమున చివరనుంచి మూడవపంక్తిలో 'కమ్మఃరథ' 'కమ్మఃరత' యనుటకు మారుగ 'కంమాకరథ' 'కంమాకరత' యని చదువునది.

పై పుట క్రిందిభాగమున 3 వార్తికలో **2, 3, 4** వాక్యములకు బదులుగ యీ క్రిందివాక్యము చదువునది. "'నిరవద్య' యనునది పశ్చిమచాళుక్యవంశపు రెండవ విజయాదిత్యుని యపరనామము. ఇతఁడు పృథివిగాముణ్డికి సమకాలీనుడు."

పుట. **143.** **17**-వ పంక్తిలోని 'ఏవచోవధిః' అను మూలమునకు 'ఏవచావధిః' యని సవరణ చదువునది.—సి. ఆర్. కృష్ణమాచార్యులు.

# అపూర్వ గ్రహణము

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రి గారు

భూమిచ్ఛాయ సుధాంశుమండలముపై పోన్ రాహువో కేతువో
హా! మాచంద్రుని మ్రింగెనంచు వగతో నాబింబమోక్షాంతము
దా మాహారము మానుభారతులు జన్మస్థానముం జూడరో!
యేమీ! వింత! విదేశనాగరకతాహీన గ్రహగ్రస్తముః.

ఆ. వె. ఆర్యనాగరత్వ మనుకళానిధి నన్య, రాష్ట్రనాగరత్వరాహు వకట!
మ్రింగి రూపుమాపె మీఁదుచూడుఁడు కొంత, మోక్షచిహ్న మదిగొ దీక్షగొనుఁడు.

ఆ. వె. గ్రహణమోక్షవేళఁ గావించుదానంబు, లల్పమైన ఫలిత మధికమగును
వేళ కిడినదాన వెలసి మహాత్ముండు, ముక్తిపదవిఁజూపు ముందుకైన.

చం. ఇహమున నూర్ధ్వలోకమున నెంతయుఁ దామసవృత్తిఁ బెంచు నీ
గ్రహణ మపూర్వనాగరకరాహుకృతంబును నార్యవైభవ
గ్రహపతి సర్వభక్షకముఁ గాంచి మహాద్భుతమోహమగ్నులై
యిహముఁ బరంబుఁ బాసితిమి యెన్నఁటికబ్బును మోక్షభాగ్యముల్.

చం. గ్రహణ మదెట్లు కాలగతిఁ గల్గెనొ మోక్షముఁగూడ నట్లయా
గ్రహణపువేళ నంధగతిఁ గార్యవివేకము లేకయుంటకున్
గ్రహణవిమోక్షవేళఁ దగు కాంతియుఁ దెల్వియుఁ గల్గి కార్యసం
గ్రహణము చేయఁ బూనుటకుఁ గారణమాత్రులుగారె మానవుల్.

## చంద్రా!

గీ. తే. నూతనోదయతిథి నొక్కనూలిపోఁగు, నిచ్చినంతనె సంపద లిచ్చునీకు
నదియునర్పింపనొల్లదు మది యపూర్వ, నాగరకతాంకురంబులు నాటఁ జంద్ర!

చం. తురకలకార్యజాతికిని ద్రోవలు చూపెడు కాలనేతవై
పరఁగెడుశాంతుఁ గంధిజు నవార్యకళానిధి నీతమోగ్రహం
బురుగతి మ్రింగిమ్రింగి తుది కోడి మహామహు లెంతఁదిట్టినన్
మరల గ్రసింపఁ జూచునఁట మాన్య, మహాత్ముఁడ, నీకు లోపమే!

తే. గీ. వేయికరముల నిను మించి వేఁడివెలుఁగు, ప్రబలుగాక! సుధానిధీ! ప్రజలదృష్టిఁ
జల్లపఱుచుచు మ్లేచ్ఛార్యజాతులెల్ల, భక్తిఁబూజింప ధన్యుఁడో భాగ్యమేది?

తే. గీ. గ్రహణజారిష్టబాధానిరసన మస్తు, సర్వజనసౌఖ్యసౌభాగ్యసంప దస్తు
భరతఖండస్థ సర్వసౌభ్రాత్ర మస్తు, సాధుమానస సంపూర్ణశాంతి రస్తు.




II

## అందుకు పెంచదగిన ముఖ్యసస్యములు

(ఒక కృషీవలుడు)

### జనుము *

ఇది యీదేశమున చాలకాలమునుండి సాగుచేయబడుచున్నది.** తరుచు పశువులమేతకొరకును నారకొరకును పెంచబడుచున్నది. పచ్చియెరువునకుగాను ప్రత్యేకముగ పెంచుట అరుదు. కాని యందుకు మిగుల ననుకూలమయినది.

దీనిని సారువాపరిపైరు కోతకువచ్చుననగా అందు చల్లి మొక్కలు మొలచిన 2,3 రోజులలో వరిచేనిని కోసి వేయవచ్చును. రైతు లిట్లు పశువులమేతకొరకు చాల చోట్ల జనుమును పెంచుచునేయున్నారు. దీనిని దాళువాపంటకు నేలను దమ్ముచేయువరకు నుంచి అపుడు నేలలో కలియదున్ని నాటుట మంచిది. ఇపుడు మేతకొరకు పెంచుజనుమునంతటిని ఇట్లు చేయుమని యభిప్రాయము కాదు. నేల సారహీనముగనుండి యెరువును గోరునపుడును, పశువులకు తగినంత మేత యున్నపుడును ఇట్లు చేయవచ్చును.

పచ్చియెరువునకుగాను జనుముచల్లుటకు తొలకరి మరియొక అనుకూలమయినకాలము. అయినను కృష్ణా, గోదావరిజిల్లాలలో కాల్వనీటియాధారమున నూడ్పులు జూన్ జూలై నెలలలోనే అగుటచే ఇట్లు తొలకరిని జనుముచల్లి పచ్చియెరువుగా నుపయోగించుట కవకాశమంతగాలేదు. కాని విశాఖపట్నముజిల్లాలో వరిసాగు ఇంతకంటె ఆలస్యముగ నగుచుండుటచేతను, తొలకరి వర్షము లచట, పైనిచెప్పినజిల్లాలలోకన్న నెక్కువ కురియుటచేతను, అచట వరిచేలలో తొలకరిలో జనుము చల్లి పచ్చియెరువుగా దున్నివేయుటకు అవకాశ మెక్కువ గలదు. తొలకరిలో మంచివర్షము కురియగనే విత్తులను చల్లివేసి నేలను రెండుసార్లు దున్నినచాలును.

పయర నూవు చేలు కోసిన నేలలలోను, చెరుకు తోటలు తీసివేసి మొదలు త్రవ్విన నేలలలోను జనుము చల్లుటకు డెల్టాలో మంచియవకాశము గలదు. పయర నూవుచేలకు కడపటితడి పెట్టుటకుముందు జనుములను చల్లినయెడల నూవుకోసినవెనుక జనుము బాగుగ నెదుగును. మొదలు త్రవ్వి వేసిన చెరుకుతోటలలో ఒకతడి పెట్టి ఆరగనే విత్తులను జల్లి రెండుసార్లు దున్నవలెను. పయరనూవుచేలు వేసిన నేలలలోను, మొదలుత్రవ్విన చెరుకుతోటలలోను నేల అదివరకుయున్న బడి, లేక త్రవ్వబడి యుండుటచే పదును బాగుగ నిలచి, జనుము బాగుగ నెదుగును. వేసవిలో కారువర్ష మేదేని గురిసినయెడల నిది మరింతబాగుగ నెదుగును. జూన్ జూలై నెలలలో వరినాటుకాలమునకు ఎరువుగా దున్నివేయుటకు సిద్ధముగ నుండును.

దాళువాపంటకోతసమయమునకూడ జనుమును కొన్ని అనుకూలపరిస్థితులందుమాత్రము పచ్చియెరువుగ చల్లవచ్చును. కాని గోదావరిడెల్టాలో నిపుడు దాళువాపంట వెన్నుముదురునప్పటికి నీరులేకపోవుట తటస్థించు

* దీనిని విశాఖపట్టణపు జిల్లాలో 'కట్టె జనుము' అందురు. అచట 'జనుము' అనునది 'గోగు.'

** పాణినిసూత్రములందును, ఆశ్వలాయన సూత్రములందును దీనిప్రశంస గలదు.

చున్నది. కావున నిట్లుచల్లుటయే యసాధ్యమగుచున్నది. ఒకవేళ అప్పటివరకు నీరున్నను అటుపిమ్మట యెండలకు తేమ త్వరలో నారిపోయి నేల బీటలుతీసి మొక్కలు వడలిపోవచ్చును. కావున బాగుగ పదునునిలచుకొన్ని ప్రదేశములందుమాత్రమే యిట్లు చల్లవలెను.

జనుములో చిన్నగింజలరకమే పచ్చియెరువునకు అనుకూలము. ఈవిత్తులు గుంటూరుజిల్లాలో వినుకొండ ప్రాంతములనుండియుగోదావరిఅప్లండుభాగమునుండియు రాజమహేంద్రవరము బజారునకు మెండుగ వచ్చును. క్రొత్తవిత్తులు (అనగాఅప్పుడే పంటకైలుచేసినవి) చల్లుట కనుకూలముగాదు. గతసంవత్సరపు పంటలోనివిత్తులను కొని జాగ్రత్తపెట్టుకొనవలెను. ఎకరమునకు 3, 4 కుంచములవిత్తులు చల్లవలెను. ఎకరమునకు 20,000 పౌనుల పచ్చిరొట్టవరకు కావచ్చును. దీనిని 4,5 ఎకరములకు సర్ది వేయవచ్చును. మంచినేలయయినయెడల 8, 10 ఎకరములకుకూడ సరిపోవును.



జీలుగచేను

## జీలుగ

జీలుగలో ననేకరకములు గలవు. కొల్లేటియందును ఇతరపల్లపుప్రదేశములందును పెరుగుచు 'జీలుగబెండు' నిచ్చురకమును, పొలములం దక్కడక్కడ చిన్న చిన్నముండ్లతో కాడపై బూడిదపారియుండు మఱియొక రకమును చాలమంది యెఱిగియేయుందురు. ఈరెండవరకమునే చాలవరకు పోలియుండి, ముండ్లును కాడపై బూడిదరంగును లేనిరక మొకటి కొన్నిసంవత్సరముల క్రిందట వంగదేశమునుండి తీసికొనిరాబడెను. ఇదియే పచ్చియెరువుగా పైరుచేయుట కనుకూలమయినరకము. వంగదేశమునను ఇపు డాంగ్లమునను దీనిని 'డెయించా' అందురు.

జీలుగను చల్లుటకు తొలకరి మిగుల అనుకూలము. వరినాటు ఆలస్యముగజరుగు విశాఖపట్టణముజిల్లాలో నీపచ్చియెరువు సస్యమును పెంచుటకు చాల అవకాశము గలదు.

జనుమువలె దీనిని సారువావరిపంటకు ముందుగా జల్లినయెడల నంతబాగుగ యెదుగదు. మొక్క 5,6 అంగుళము లెనుగుసరికే పూచి మిగుల మెల్లగ నెదుగును. విస్తారము రొట్టపోయదు. కాని సంక్రాంతిపిమ్మట మరల నెపుడు చల్లినను బాగుగ నెదుగును. అప్పటికి వరికోతలైపోయి నేలయెండిపోవును. కావున నేలకు మరల తడిపెట్టియున్నగాని విత్తును చల్ల వీలులేదు. ఇట్లు దున్నిచల్లుట అన్నినేలలకును శ్రేయస్కరము కాదు. ఈవిషయము ముందు మరల చర్చింపబడును.

జనుమువలె దీనినిగూడ పయర నూవుచేలు వేసిన నేలలలోను, మొదలు త్రవ్వివేసిన చెరుకుతోటలలోను చల్లవచ్చును. దాళువా చేలకోతకుముందును దీనిని కొన్ని అనుకూలముగుచోట్ల చల్లవచ్చును. జనుముకంటె నిది లోతుగ వేరుపోసి యెండకు బాగుగనాగును.

జనుముకన్న నిది మరికొన్నివిషయము లందుకూడ శ్రేష్ఠమని చెప్పవచ్చును. చుట్టుపట్టుల నేసస్యమును లేనిచోట్ల జనుము చల్లినయెడల పశువులబాధ మెండుగనుండును. జీలుగచేలను సామాన్యముగ పశువులు మేయవు. ఇతరమేతలేక ఆకలిగొనియున్న పుడుమాత్రము లేతచిగుళ్లను కొరకును కావున తొలకరిలోగాని, పయర

నూవుచేలు మొదలగువానిలోగాని చల్లుట కిది జనుముకంటె మిక్కిలి అనుకూలముగ నుండును. మరియు తోలకరిలో వర్ష మెక్కువగ గురిసినయెడల జనుము చచ్చును. జీలుగమొక్కలు కొంతవరకు నీరునిలచినను చావవు. జనుమునకువలె జీలుగకు గొంగళిపురుగుబాధ అంతగా లేదు. మరియు జనుము, పెసర మొదలగునవి పైరుకానిచవటి కోడీనేలలలోసైతము ఇది పెరుగును. అట్టినేలలో పెంచుట కింతకంటె ననుకూలమయినపైరు మరియొకటిలేదు.



ఎడమవైపు:—ముండ్లజీలుగ; మధ్య:—వంగదేశపుజీలుగ
కుడివైపు:—జనుము; క్రిందిభాగమున: — తీగపెసర.

జీలుగగింజలను ఎకరమునకు రెండుకుంచముల చొప్పున చల్లిన చాలును. దీనినుండియు నెకరమునకు 20వేల పౌనుల పచ్చిరొట్టకుపైగా నగును. సామాన్యముగ జనుముకంటె హెచ్చుగనే అగుచుండును. ఒకయెకరమున పెరిగినజీలుగరొట్టను బీదనేలలయినయెడల 4,5 ఎకరములకును మంచినేలలయిన యెడల 8,10 ఎకరములకును సర్ది వేయవచ్చును.

జీలుగవిత్తులు గవర్నమెంటుఫారములలోను డిపోలలోను దొరకును. రైతులొకసారి కొన్నివిత్తులనుగొనిన యెడల తరువాత తమ కేటేటకావలసినవిత్తులను వారే పండించుకొనవచ్చును. తొలకరిలో చేలగట్లపైగాని, మెరక సస్యములలో కలుపుగగాని కొన్నివిత్తులను వేసినయెడల దీపావళినాటికి విత్తులను దీయవచ్చును. గోదావరిజిల్లాలోనిఅమలాపురంతాలూకాలో కొబ్బెరతోటలలోను, విశాఖపట్నంజిల్లాలో కొన్ని మెరకభూములందును దీనిని కొందరు విత్తులకొరకు పైరుచేయుచున్నారు. పచ్చియెరువుకొరకు పల్లపునేలలలో చల్లిన జీలుగచేను, నీటిలేమిచే నాభూములు వరిచేనునాటు వీలుగల్గనియెడల, మొక్కలు ప్రత్తిచేనువలె రెండేసియడుగుల కొకటి యుండునట్లు పలుచనచేసి వదలినయెడల నవికాచి వరిచేను నాటకపోయిననష్టమును కొంతవరకు కూడదీయును. తీసివేసినమొక్కలను కుప్పవేసిగాని, గోతిలో వేసినగాని చీకనిచ్చి పిమ్మట మిరపతోటలు మొదలగువాని కుపయోగింపవచ్చును.

సారువారి కోతకుముందు చల్లిన జీలుగచేనినుండి గూడ విత్తులను దీయవచ్చును.

## తీగపెసర

ఇదియొకరకపుపెసర. దీనిని మెట్టనేలలలో జొన్నచేలలో కలుపుగ చల్లుదురు. ఈపంటనుండి తీసినవిత్తనమే వేసవిలో పచ్చియెరువునకుగాను చల్లుదురు. పయర నూవుచేలకు పెట్టు కడపటితడికిముందు దీనినికూడ జనుము, జీలుగ, వలెనే చల్లవచ్చును. మొదటత్రవ్వివేసిన చెరకుతోటనేలలందును దీనిని చల్లవచ్చును. ఇట్లు వేసవిలో చల్లినపుడు ఇది పూతపూయక *రొట్టపోసి నేలనంతటను అలముకొనును. కాని,

ఎకరమునకు $1\frac{1}{2}$, 2 కుంచములవిత్తులు చాలును. ఇదియు నెకరమునకు 20,000 పౌనులరొట్టవర కిచ్చును. దీనిని జనుముతో కూడకలిపిచల్లుట కనుకూలముగనుండును. అపుడురెండునుచేరి 30,000 పౌనుల రొట్టవరకు నీయగలవు. పెసరనేలను క్రమ్ముకొనపలనే జనుమెదుగును. దీనిని పశువుల మేత కుపయోగించి పిమ్మట తీగపెసర రొట్టను మాత్రము నేలలో దున్నివేయవచ్చును.

తీగపెసరరొట్ట నేలలో కలియదున్నినపుడు జనుము, జీలుగకంటె బాగుగను సులభముగను మంటితో

* కావున దీనికి గొడ్డుపెసర అనికూడ పేరు.

కలిసిపోవును. వానిలోవలె దీనియందు చేనుముదిరినయె డల కాడలు కఱ్ఱగట్టి దమ్మున కడ్డుదగలవు.

తీగపెసర దంపనేలలకేకాక మెట్ట, తోటభూము లలో సైతము పచ్చియెరువుగా నుపయోగించుటకు జనుము జీలుగ వీనికంటె నెక్కువ వీలయినది. దీనిని పచ్చియె రువుగా పెంచుమంచిపరివర్తనమొకటి కృష్ణాజిల్లాలోని తణుకుతాలూకాలో గలదు. దాని నిచట వివరించెదను.

తొలకరిలో—బుడమవరి (మెట్టవరి)

పిమ్మట—వెల్లుల్లి

పిమ్మట—పయరనూవు

పిమ్మట—తీగపెసర (ఇది మరుసటి సంవత్సరము తొలకరిలో పచ్చియెరువుగా దున్ని వేయబడును.)

దీనిని మెట్టనేలలలో తొలకరిలో చల్లుఆచారము కూడ గలదు. అపుడిది వెల్లుల్లి మొదలగు శీతకాలపుపైరు లకు పనికివచ్చును.

సిపాయిపెసరయను మరియొకరకము 'పెసర'కూడ తొలకరిలో మెట్టనేలలందు పంటకు చల్లబడి అతివర్షము లచే చెడినపుడు పచ్చియెరువుగా దున్నివేయువాడుక గలదు. వర్షములు మిక్కుటముగ లేకపోయినయెడల అది నూవుచేలతోపాటు పూచి గెలలుగెలలుగ కాయును. వీనిని పండినవెనుక కోసికొని మిగిలినరొట్టను నేలలో కలి యదున్నుదురు. చెడిపోయినయెడల నిది జొన్నచేలకును మిరపతోటలకును ఎరువుగా నుపయోగింపబడును. కాచి నయెడల వెల్లుల్లి కుపయోగించును.

ఎకరమునకు కుంచెడువిత్తులు చల్లిన చాలును.

## నీలి

ఇది షైవానివలెగాక నెమ్మదిగ నెదుగుపైరు. విశాఖపట్టణము జిల్లాలో దీనిని వరిచేలు కోసినవెనుక చేలను దున్ని సంక్రాంతి పండుగసమీపమునందు పెసర, పయర నూవు, నీలితో కలిపి చల్లుదురు. మొదట పెస రయు, పిమ్మట పయరనూవును కోసికొనగా నిదిమా త్రము మిగిలి మరల వరినాటు కాలము (మంచికాలమున జూలై—ఆగస్టు) వరకు ఎదుగుచుండును. వేసవిలోను తొలకరిలోను వర్షములు బాగుగ కురిసిన నిది బాగుగ నెదుగును. ఆగస్టునెలలో దీనిని గోసి నీలికుండలలో వేసి తీసివేసినపిమ్మట రైతు లారొట్టను మరల దెచ్చుకొని వెంటనే వరిచేలకుగాని లేక కొంతకాలము కుప్పచేసి యుంచి మిరప మొదలగుతోట సస్యములకుగాని యెరు వుగా నుపయోగింతురు. నీలిమందు ధర తగ్గిపోయి కుండీలయజమానులు పనినిచూచినపుడు దీనిని పచ్చి యెరువుగ మాత్రమే ఉపయోగింతురు.

గోదావరి లంకలో దీనిని సెప్టెంబరునెలలో జొన్నతో కలిపి చల్లుదురు మార్చినెలలో నొకకోతయు మరల తొలకరించినవెనుక నొకకోతయు వచ్చును. ఈతొలకరి కోతలోని రొట్ట అరటితోటలకును మిరప తోటలకును విశేషముగ నుపయోగింపబడుచున్నది.

పయర చోడిచేలకు గొప్పుత్రవ్వునపుడీవిత్తులను చల్లుటకూడ కొన్నిచోట్ల గలదు.

జొన్నచేలతో కలుపుగా 1½-2 శేర్లవిత్తులు చల్లవచ్చును. ప్రత్యేకముగ చల్లునెడల కుంచెడు విత్తులు చాలును.

దక్షిణాదిని జనుమువలె దీనిని వరిచేలు కోయు టకుముందు చల్లువాడుక గలదు. కాని యీ ప్రాంత ములం దట్లు చల్లినయెడల చలిచే మొలక బాగుగనుం డదు. అవి మొలచినను, పండలినేలలో నేల త్వరలో బీటలుదీయుటచే నవి త్వరలో ఎండిపోవును.

## వెంపలి

ఇది తరుచు తనంత తానే గరుపకొడిగానుండు మెరక భూములలోను పల్లపుభూములలోను గూడ పెరుగుచుండును. బందరు నేలలలో నిట్లు పెరుగు రొట్ట సామాన్యముగ చాలాదూరము బండ్లమీద తీసికొని పోబడి యెరువుగా నుపయోగింపబడుచున్నది. విశాఖ పట్టణము జిల్లాలో దీనిని చెరుకునకును మిర్చికిని విశే షముగ వాడుదురు. దక్షిణాదిని ఈవిత్తులను వరిచేలలో కోతకుముందు చల్లుదురు. అప్పటినుండి మరల వరిచేనికి నేలను దమ్ముచేయువరకును నెదుగుచుండును.

ఈవిత్తులను ఒకసారి చల్లిననేలలో సామాన్య ముగ మరల నేఏట చల్ల నవసరము లేదు. వేసవిలోను

తొలకరిలోను రాలిన విత్తులు ఆనేలను దమ్ముచేసి నీరు పెట్టించినను చెడక నేల మరల ఆరినపుడు మొలచును.

ఈప్రాంతములందు నీలిఫలెనే ఇదియు శీతకాలమున వరిచేలలో కోతకుముందు చల్లినెడల మొలక బాగుగ నుండదు. సంక్రాంతిపండుగ ప్రాంతములందు నేలను దున్ని చల్లిన బాగుగ మొలచును.

### ఉలవ, బొబ్బర, వేరుశెనగ

ఇవి ఇసుకకొడినేలలలో పచ్చియెరువునకుగాను పెంచదగిన సస్యములు. ఉలవలు 8–10 శేర్లును, బొబ్బర్లు 4-6 శేర్లును, వేరుశెనగ (బలచినగింజలు) 4–5 కుంచములును విత్తవచ్చును. కత్తపటిదానిని నాగటిసాలల్లో వేయుటమంచిది. మొదటి రెండుకంటెను దీనికి విత్తనపు ఖరీ దెక్కువగును.

ఆయాజాతుల గొట్టలందుండు నత్రజనిపరిమితియందు కొంచెము భేదముగలదు. కాని ఈభేద మంతగా పాటింప నవసరములేదు. ఏప్రదేశమున నేస్థితిగతులందే సస్యము బాగుగ బెరిగి హెచ్చుగొట్టనిచ్చునో దానినే పెంచి పచ్చియెరువుగా నుపయోగించుట మంచిది.

---

# బాలకృష్ణుఁడు

నరహరిసెట్టి వేంకటరత్నము గారు

నెమలిపురి శిరమందుఁ దాలిచి
హాయలుగా నిలుచుండి హాయిగ
విమలగానముఁ జేసితివిగా
మురళిఁ జేఁబూని
బాలకృష్ణా! వేగరా! వ్రే
పడఁతులెల్లరుఁ బిల్చుచుండిరి
జాలమేటికిఁ జేసెదవురా!
తాళజాలరురా!

నీదుచక్కనిమూర్తిఁ జూచి
మోదమందెడి వల్లవచెలులఁ
గాదనుచునిరసింపనేటికిరా! ఓచిన్నికృష్ణా!
కాదనుచు నిరసింపఁ దగునటరా!
బాలకృష్ణా! ॥

పిల్లలను భర్తలను గృహములఁ
దల్లులను దండ్రులను మఱచియు
ఎల్లరును నిను వలచి వచ్చిరిరా!
ఓచిన్నికృష్ణా!
ఎల్లరును నినుఁ దలపఁ జొచ్చిరిరా!
బాలకృష్ణా! ॥

అరయఁ దొలుబామునఁ గరము దప
మొనరిచితి మల్లగుటచే శ్రీ
హరిని గనులారంగఁ జూచితి
మంచుఁ బలికిరిరా!
ఓచిన్నికృష్ణా! పలికినులికిరా!
బాలకృష్ణా! ॥

ఎట్టియోగులకైన నందని
దిట్టవగు నిను మాసుకృతమునఁ
జెట్టఁబట్టితిమంచుఁ బలికిరిరా!
వ్రేలెలఁదులందఱు
చెట్టబట్టితిమంచుఁ గులికిరిరా!
బాలకృష్ణా! ॥

నందుఁ డెంతటితప మొనర్చెనో
ముందుజన్మమునందు వానికి
నందనుఁడవై చెలఁగితివి భళిరా!
ఓచిన్నికృష్ణా!
నందనుఁడవై వెలఁగియుంటివిరా!
బాలకృష్ణా! ॥




## కామందక నీతిసారము

(ఎనిమిదవ సంచిక తరువాయి)

మామిడిపూడి వెంకటరంగయ్య గారు, ఎం. ఏ.,

అధికారి తనయధికారమును దుర్వినియోగముచేసి దానిమూలమున ప్రజలను బాధింపకుండుటకై యుక్తములగు ఏర్పాటుల కొన్నిటిని కల్పింపవలయునని రాజనీతిశాస్త్రజ్ఞు లందరు అంగీకరించి యున్నారు. ప్రస్తుత కాలమందు శాస్త్రవేత్తలు ఈవిషయమై విపులముగ చర్చించియున్నారు. ఈ ఏర్పాటులు దేశ కాల భేదముల ననుసరించి మారుచున్నను ప్రభువుల యధికారము నిరంకుశము కాకూడదనియే అందరియొక్క అభిప్రాయము. కాని, ఇందుకై కామందకుడు కల్పించిన సాధనములకును పాశ్చాత్యవిద్వాంసులు కల్పించిన వానికిని విశేషభేద మగపడుచున్నది. పాశ్చాత్యులామోదించినవి బాహ్యసాధనములు; కామందకుడామోదించినవి ఆంతరంగిక సాధనములు. ఈవిషయము స్పష్టపడుటకై ఇటీవలి కాలమందు పాశ్చాత్య దేశములందును వాటిననుసరించి రాజ్యాంగవిధానమును మార్చుకొనిన తూర్పు దేశములందును కల్పింపబడిన సాధనములలో కొన్నిటిని ఉదాహరించుచున్నాను.

1. కొన్ని దేశములందు ప్రభువగువాడు పేరునకుమాత్రమే ప్రభువుగాని రాజ్యాధికారమంతయు మంత్రుల యధీనమై యున్నది. దీనికి ఇంగ్లండుదేశమే ప్రధానమగు దృష్టాంతము. ఒకానొకప్పుడు ఇంగ్లండులోని రాజులుకూడ నిరంకుశాధికారులై ఇష్టమువచ్చినట్లు చట్టముల చేయుచు దుర్భరములగు పన్నుల విధించుచు న్యాయాన్యాయ విచక్షణ లేక రాజద్రోహులను నెపముబెట్టి అనేకులను శిక్షించుచు దుర్నీతులై అధికారమును ప్రజల బాధించుటకేకాని బాగుపరచుట కుపయోగింపకుండిరి. ఈకారణముచే ప్రజలు వారిపై కలహించి, ఒకరాజునకు ఉరిశిక్ష విధించి మరియొకనిని దేశబహిష్కృతుని గావించిరి. అది మొదలు రాజ్యాధికారమంతయు ప్రజాప్రతినిధులందు సంక్రమించెను. ఈప్రతినిధులయొక్కయు వీరికి నాయకులగు మంత్రివర్గముయొక్కయు సమ్మతిననుసరించి రాజు దేశపరిపాలనము చేయుచున్నాడు. వీరే రాజుయొక్క నిరంకుశాధికారమునణచు సాధనములు.

2. కాని, ప్రజాప్రతినిధులు సయితము స్వలాభప్రియులై తమయధికారమును స్వార్థముకొరకుపయోగించుకొనుటయు ప్రజలను బాధించుటయు కలదు. ప్రస్తుతకాలమున మన

దేశమందలి శాసనసభలలోను, జిల్లాబోర్డు తాలూకాబోర్డు మునిసిపాలిటీలు మొదలగు వాటియందును, ప్రజాప్రతినిధులుగ నుండు వారు కొందరు తమ యధికారమును ప్రజల లాభమునకుగాక స్వలాభమున కుపయోగించు కొనుచుండుట మనము చూచుచున్నాము గదా ? ప్రజాప్రతినిధు లైనంతమాత్రముచే వారు నిరంకుశాధికారమున కర్హులని మన మెంచగూడదు. ఈ రహస్యమును పాశ్చాత్యు లదివరకే గ్రహించిరి. దీని ననుసరించి వారు కొన్ని దేశములందు "లిఖితమగు రాజ్యాంగపద్ధతులు"ను (Written Constitutions) కల్పించి యున్నారు. అనగా అధికారమందుండువారు ఎట్టిపనులచేయవచ్చునో ఎట్టివానిని చేయ కూడదో, చేయతగినపనులను ఏవిధముగ చేయవలెనో, ఏయేవిషయములందు ప్రజలకు స్వాతంత్ర్య మున్నదో, మొదలగు అంశములను లిఖితపూర్వముగ నిర్ణయించియున్నారు. ఈ లిఖితపత్రములోని క్రమము ననుసరింపక దేశపరిపాలనము చేయు ప్రజాప్రతినిధులను శిక్షించునధికారము న్యాయస్థానములకుకలదు. అందుచే క్రమముతప్పి అధికారవర్గమువారా దేశములలో ప్రవర్తించుటకు వీలులేకున్నది.

3. మరికొన్ని దేశములలో రాజ్యాధికారమును విభజించుటయు, ఒక్కొక విధమగు నధికారమును ఒక్కొకరి కిచ్చుటయు కలదు. ఏఅధికారికూడ సర్వస్వాతంత్ర్యము గలవాడు కాకపోవుటచే ప్రజల కతనిమూలమున విశేషముగ చిక్కులుగలుగుటలేదు. సాధారణముగ రాజ్యాధికార మీకాలమున మూడు రకములుగ నున్నది. చట్టములచేయుట, చట్టముల నమలులో నుంచుట, చట్టముల నతిక్రమించినవారిని విచారణచేయుట—అను కార్యములను ప్రభుత్వమువారు నిర్వహించుచున్నారు. ఒకే అధికారి ఈ మూడుపనులను చేయగలవాడైనచో అతని యధికారము అడ్డులేనిదై వ్యక్తిస్వాతంత్ర్యమునకు భంగకారియగును. తనకు విరోధియగు వానిపై ఏదియో యొక నేరము మోపుటయు, తానే అతనిని విచారణచేసి శిక్షించుటయు సంభవించును. నేరముమోపువాడును విచారణ చేయువాడును ఒక్కడే అగునపుడు న్యాయముగ పరిపాలన జరుగుట దుస్సాధ్యముకదా? కావుననే అమెరికాఖండములోని దేశములందు ప్రభువుల నిరంకుశాధికారమును నణచుటకు రాజ్యాధికారమును విభజించి యున్నారు. ఎవనికి గాని పరిపూర్ణమగు నధికారము లేదు.

4. అధికారము నిరంకుశముగ నుండకుండుటకై మరికొన్ని దేశములందు శాసనసభలను ద్విశాఖాయుతముగ చేసి యున్నారు. పక్షపాతముచేతను అనాలోచితముగను తొందరపాటుచేతను శాసనముల నిర్మించుటచేతనే ప్రజలకు చాల బాధకలుగుచున్నది. శాసనములను చేయగల అధికారము ఒక్క సభకే యుండిన యెడల ఇట్టిలోపములు కలుగుట కెక్కువ అవకాశముండును. అందుచేతనే ప్రతిదేశమందును శాసనాధికారము రెండు సభలయందు కూర్చబడి యున్నది. రెండుసభలలోనివారును ఆమోదించినగాని ఏశాసనముగాని అమలులోనికి రాజాలదు. ఈపద్ధతి నను

సరించియే మన దేశమందుకూడ సామ్రాజ్య శాసనసభ రెండు శాఖలతో కూడుకొని యున్నది.

పై చెప్పినవికాక మరికొన్ని సాధనములు కూడ అక్కడక్కడ ఏర్పరుపబడి యున్నవి. ఈ విషయమును విపులముగ చర్చించుట కిది సమయము కాదు; కావున నింతటితో విరమింపవలసి వచ్చెను. సూచింపబడిన అర్థమేమనగా: అధికారులు నిరంకుశులుగ నుండుట తగదనియు, వారి యధికారమునకు బాహ్య నిర్బంధములు కొన్ని యుండవలెననియు అట్టివి లేనియెడల ప్రభుత్వముమూలమున ఉపకారము కలుగుటకుబదులు చేటు వాటిల్లుననియు అనుభవజ్ఞుల అభిప్రాయము. మనుష్యమాత్రుడగువాడెట్టివాడుగాని సంపూర్ణాధికారమున కర్హుడు కాడు.

కామందకుని గ్రంథమం దుదహరింపబడిన సాధనము లీట్టివి కావు. అవి ఆంతరంగికములు కాని బాహ్యములు కావు. ఎంతటి యుత్తముడైనను అధికారపదవియందుండువాడు మదాంధుడగుట తప్పదు. తెలిసియో తెలియకయో చపలచిత్తుడై యుక్తాయుక్తముల విచారించక పొరబడుచు ప్రజలను బాధించుచుండును. నిజముగ మహానుభావులగు వారలు మాత్రమే రాజులుగ నున్నయెడల ఎన్నటికిని వారి నిరంకుశాధికారము వలన దేశమునకు కీడు రాజాలదు. హరిశ్చంద్రుడు, శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, మాంధాత మొదలగువారలు నిరంకుశులైననేమి? కాని ఇట్టివారు నూటికొక్కరుండుట కూడ కష్టము. వేలకొలది సంవత్సరముల కొక్కపర్యాయమిట్టివారు పుట్టుచుందురు. సామాన్యముగ రాజ్యపదవి నధిష్ఠించినవారు అతీతప్రజ్ఞగాని నీతిగాని కలవారు కారు. ఇంకొక విషయముకూడ మన మీసందర్భమున జ్ఞాపకముంచుకొనవలెను. మన దేశమందు చాలవరకు నిరంకుశ ప్రభుత్వమే ప్రచారముగాంచి యుండెను. బహు ప్రాచీన కాలమందు ప్రజాప్రభుత్వముండెను గాని ఆ ప్రజాప్రభుత్వమునకును మన మీకాలమందు కోరుచుండు ప్రజాప్రభుత్వమునకును హస్తిమశకాంతరము కలదు. సింహాసనాధిష్ఠుడగు ప్రభువునకును సామాన్య మనుష్యులకు ఎంతయో తారతమ్యముండెడిది. సామాన్యుడు తృణప్రాయుడనియే వారి యుద్దేశము. ప్రభువు దైవమనియు ప్రభువునెదుట స్వస్వభావముతో ప్రవర్తించుట మనుష్యునికి తగదనియు మనవారి అభిప్రాయము. ఉద్యోగపదవులందుండి, ప్రభువునకు సచివులై, ఆదరణీయులై యున్నవారు కూడ మానావమానములను లెక్కింపక బానిసత్వముతో సమానమగు ననుచరభావము గలవారై యుండిరి. కామందకములోని "స్వామ్యనుజీవివృత్తము" అను ప్రకరణమును చదివినవారి కిది స్పష్టమగును.

ఇట్టి యధికారుల మూలమున దేశమున కుపద్రవము రాకుండ కాపాడు సాధనము లెవ్వి? (1) రాజపుత్రుడు బాల్యమందు విద్యల నన్నిటిని నేర్చుకొనుట మొదటి సాధనము.

"ఆన్వీక్షికీం త్రయీం వార్తాం దండనీతించ పార్థివః,
తద్విద్యైస్తత్క్రియోపేతైః చింతయేద్వినయాన్వితః."

అను శ్లోకానుసారముగ నాలుగువిద్యలనుకూడ నతఁడధ్యయనము చేయవలసి యుండెను. ఆన్వీక్షికి అనగా ఆత్మవిద్య. సుఖదుఃఖముల స్వభావ మెఱుఁగుట కిదియే సాధనము. స్వసుఖముఁగోరి పరుల దుఃఖపెట్టుట కెన్నియో అవకాశములు గల రాజుల కిదియే ప్రధాన విద్య. ఆత్మానాత్మ వివేకము లేనివాఁడు రాజగుట కర్హుఁడు కాఁడు. ఇఁక త్రయీ అను విద్యమూలమున వర్ణాశ్రమధర్మములను తెలుసుకొని తానెట్టి నియమమం దుండవలెనో ఇతరుల నెట్టి నియమమం దుంచవలెనో రాజు గ్రహింపవలెను. వార్తాశాస్త్రము నభ్యసించి కృషి పాశుపాల్యము వాణిజ్యము లోనగు ఐహికైశ్వర్య సాధకములగు వృత్తులకు క్షయము కలుగకుండ ప్రజలను కాపాడవలెను. దండనీతిని నేర్చుకొని దుష్టుల నెట్లు శిక్షింపవలెనో శిష్టుల నెట్లు రక్షింపవలెనో నిర్ణయింపవలెను. ఇన్ని విద్యల నభ్యసించినవాఁడే రాజగుట కర్హుఁడు. ఇట్టిరాజు నిరంకుశుఁడైనను విద్యయను సాధనమును చేతఁబూనినవాఁడగుటచే ప్రజల కుపకారము చేయునేకాని అపకారము చేయఁజాలఁడు. అధికారి తనయధికారమును దుర్వినియోగపరచకుండుటకై మనవారు రుద్దేశించిన సాధనములలో నిదియే మొదటిది.

**2.** రెండవసాధనము ఇంద్రియజయము.

"ఏకస్యాపి నయః శక్తో మనసః సన్నిబర్హణే
మహీం సాగరపర్యంతాం కథన్ను స విజేష్యతి."

తనమనస్సు నొకదానినీ వశము చేసుకొని శక్తిలేనివాఁడు సాగరపర్యంతమగు భూమండలము నెట్లు జయింపగలఁడు? సామాన్యులకంటె రాజులకే ఇంద్రియనిగ్రహము అత్యంతావశ్యకమని దీనినిబట్టి తెలియుచున్నది. కౌటిల్యునికంటె కామందకుఁడీవిషయమును విపులముగ వివరించియుండుటచే సాధనములన్నిటిలో నిది ప్రధానతమమని అతఁడు గ్రహించినట్లు చెప్పదగియున్నది. ఇంద్రియనిగ్రహము లేని కారణముచేతనే ప్రభువులు సామాన్యముగ విషయలోలురై ప్రజలను పీడించుట తటస్థించుచున్నది. 3. కామందకుఁడు కల్పించిన మూఁడవసాధనము ఆచారసంపత్తి. దీనిని ఆచారవ్యవస్థాపనమను ప్రకరణమున వివరించియున్నాఁడు. గ్రంథమందలి దీర్ఘమగు ప్రకరణములలో నిదియొక్కటి. ఇట్టి ప్రకరణము కౌటిల్యుని గ్రంథమందు కనుపించదు. రాజులయొక్క సహజస్వభావమును బాగుగ గుర్తెఱిఁగినవాఁడగుటచే కామందకుఁడీవిషయమై ఇంత నొక్కిచెప్పెను. ప్రకరణముపేరు "ఆచారవ్యవస్థాపన" మైనను మామూలుగ "ఆచార" మనుమాటను మన ముపయోగించు అర్థమందత డుపయోగించలేదు. స్నానము జపము తపము వ్రతము యజ్ఞము మొదలగువాని ప్రశంస ఈ ప్రకరణమందు లేదు. ఆచారమనఁగా మంచినడత — సత్ప్రవర్తనము — ఈ అర్థమందే కామందకుఁడామాటను వాడియున్నాఁడు. రాజులు సాధారణముగ కఠినహృదయులు. నిర్దయాళుత్వము కరుణారాహిత్యము వారిని చేపట్టియుండును. జన్మప్రభృతి వారు ఐశ్వర్య

వంతులగుటచే దరిద్రులగు జనసామాన్య మెట్టి బాధల పడుచుందురో వారెరుగరు. కుటుంబభరణము సామాన్యుల కెంతకష్టమో, తినుట కన్నములేక కట్టుటకు బట్టలేక నిలువ నీడలేక కృశించువారెట్టి బాధల ననుభవింతురో వారికి తెలియజాలదు. అధికారము చలాయించుటయందే కాలమంతను గడుపుచు వారు మదాంధులై తక్కినవారిని నిరసించుచు వారిని అధమాధములుగ గణించుచుందురు. ఇట్టి దుర్గుణముల కాలయములగు ప్రభువులు సత్ప్రవర్తనగలవారగుట ప్రపంచమున కెంత ఆవశ్యకమో వేరుగ చెప్పవలసినది లేదు. ఇందుచేతనే దీనోద్ధరణము, దయ, ఆనృశంస్యము, సుజనసాంగత్యము,సాధువాక్కు, ప్రియభాషణము, ఆస్తికబుద్ధి, దాక్షిణ్యము, అనుగుణముల సముదాయమే సత్ప్రవర్తనమని కామందకుని మతము. ప్రభువులయం దిట్టిగుణములు లేకపోవుటవలననే ప్రభుత్వమువలన మనకు కలుగవలసినంత లాభము కలుగుటలేదు. సామాన్యగృహస్థులందు సైతము ఇట్టి గుణములు లోపించినయెడల ఎంతయో హాని సంభవించునుగదా ? ఆలోచించి చూచినయెడల మనుష్యుల నధికులనియు నల్పులనియు విభజించుటకంటె గొప్ప పొరపాటు మరియొకటి లేదని తోచకమానదు. సుఖదుఃఖము లందరికి సమానములుగదా? సుఖము వచ్చినప్పుడు సంతోషించుట, దుఃఖము వచ్చినపుడు బాధపడుట,మనుష్యులందరికిసహజముకదా? కర్మఫల మనుభవింపక తప్పించుకొనువారెవ్వరు లేరుగదా? కావున అధికారముచే తామధికుల మనుకొను ప్రభువులుకూడ తక్కినవారియెడల దయాదాక్షిణ్యములు కలిగి ప్రవర్తించుట అత్యంతావశ్యము. రాజు విద్యావంతుడుగ నుండవలయునని చెప్పి అంతటితో తృప్తి చెందక ఆచారసంపత్తిగల వాడుగ నుండవలయునని ప్రత్యేకముగ వివరించుటవలన విద్యావంతులయందు కూడ నిర్దయాళుత్వము మొదలగు దుర్గుణము లుండునని యే కామందకుని భావము. కావున రాజునకు శాస్త్రజ్ఞానము మాత్రము చాలదు; సత్ప్రవర్తనకూడ నుండవలెను.

విద్య, ఇంద్రియనిగ్రహము, సదాచారసంపత్తి—వీటికే నేను ఆంతరంగిక సాధనములను పేరు పెట్టితిని. అనగా, మంత్రులు, లిఖితరాజ్యాంగపద్ధతులు లోనగువాటివలె నివి బాహ్యములుగాక రాజునందే కూర్పబడిన సాధనములని అభిప్రాయము. ఈ రెండింటిలో రాష్ట్రమున కుపచరించు సాధనము లెవ్వి యను సందేహము మనకు కలుగవచ్చును. అనగా అధికారము దుర్వినియోగము కాకుండుటకై బాహ్యసాధనములు మంచివా ? ఈ రెండును సమకూర్చుటకు వీలులేని సందర్భములో బాహ్యసాధనములుండుట ఎక్కువ లాభకరము. బాహ్యసాధనమువలని లాభము అధికారులను క్రమబద్ధుల చేయుటయే. తమఇష్టానుసారముగ పరిపాలించుటకు వీలులేదనియు, తాముకూడ సామాన్యజనులవలె చట్టముల ననుసరించి తమకార్యముల నిర్వహింపవలసిన దనియు, క్రమముతప్పినపుడు శిక్షకు పాత్రులగుదురనియు, బాహ్యసాధనములమూలమున అధికారులకు తెలియుచున్నది. ఆంతరంగిక సాధనములవలన ఇంతటి ప్రయోజనము లభించుట దుస్సాధ్యము. వంశపారంపర్యముగ రాజాధికా

రము ననుభవించు రాజపుత్రులకు శాస్త్రకారు లుదహరించిన విద్యలన్నియు లభించుట దుస్తరము. రాజపుత్రుడు విద్యావంతుడయ్యెనా లేడా యని పరీక్షించి ఆతనికి రాజ్యమొసంగుట లేదు కదా? ఇంద్రియనిగ్రహముకూడ నిట్టిదే. సమస్తైశ్వర్యములతో తులతూగుచు సర్వాధికారము ననుభవించుచుండు రాజులెక్కడ? ఇంద్రియజయ మెక్కడ? కావున బాహ్య నిర్బంధములు లేని నిరంకుశాధికార మనర్థదాయకమని చెప్పకతప్పదు.

రాజకీయవిషయములలో మన దేశ మధోగతిపాలగుటకును, ఏ రాజవంశముగాని స్థిరముగ నుండకుండుటకును నిరంకుశప్రభుత్వమే కారణము. నిరంకుశప్రభుత్వముచే ప్రజలకు ప్రభువులందు బద్ధానురాగము లేకుండెను. "ప్రభువులెవ్వరైననేమి? మనగతి దుర్గతియే," అని ప్రజ లనుకొనుట సంభవించెను. మతము ఆచారము వర్ణాశ్రమధర్మములు లోనగు సాంఘిక వ్యవస్థలందు మనవారు చూపుచుండినంత గౌరవము రాజకీయవిషయములందు చూపకుండుట కిదియే హేతువు. ప్రాచీన సాంప్రదాయములు నశింపక మననాగరికత నిరాఘాటముగ నిప్పటివరకు నిలిచియుండుటకు మనరాజులు హేతువులుకారు. ప్రజల కీనాగరికతయందుండు ఆదరణమే దీనికి హేతువు రాజ్యాంగవ్యవస్థలందు పాశ్చాత్యుల కెట్టి దీక్షయు గౌరవమును కలవో అట్టి దీక్షయు గౌరవమును మనకు మతాచారములందుండుటకు గలకారణము దీనినుండి స్పష్టమగుచున్నది.

నిరంకుశ ప్రభుత్వమువలని అనర్థముల నెరిగినవాడగుటచేతనే కామందకుడు సప్తవ్యసనవర్గమను ప్రకరణమున రాజులకెట్టివ్యసనము లుండునో దానిమూలమున సంభవించు నష్టములెన్నియో వివరించియున్నాడు. స్త్రీ, పానము, వేట, ద్యూతము లోనగు వ్యసనములవలన అనేకరాజులు తాము చెడిపోవుటయే కాక ప్రజలను చెరచిరి. ఇంద్రియనిగ్రహాది సాధనములయొక్క అల్పప్రయోజనత్వమున కిదియే తార్కాణము.

దీనినిబట్టి కామందకునిచే వివరింపబడిన ఇంద్రియనిగ్రహాదులు ప్రభుత్వ విధానమందనవసరములని అనుకొనగూడదు. బాహ్యసాధనములను తగురీతిగ నుపయోగించుట కివి ఎంతయో ఆవశ్యము. ముఖ్యముగ ప్రజాప్రభుత్వము వలని లాభములు దేశమునకు సమకూరవలయుననిన ఈగుణములు ప్రజలయందుండి తీరవలెను. అనేక దేశములందిటీవల ప్రజాప్రభుత్వము నెలకొల్పబడినది; మన దేశమందుకూడ ఆమార్గము ననుసరించియే మనము రాజకీయ సంస్కరణములు కోరుచున్నాము. కాని ప్రజాప్రభుత్వమందుకూడ కొన్నిలోపములుండుట మనకు అనుభవముమూలమున తెలియుచున్నది. ప్రజాప్రభుత్వముయొక్క ప్రధాన లక్షణము ప్రభుత్వశాఖలలోని అధికారులను ప్రజలెన్నుకొనుటయు, ఎన్నుకొనబడినవారు వారిపనులను చక్కగ నిర్వహించుచున్నారో గమనించుటయు. ప్రజలీపనిని చేయవలయుననిన కామందకుడు సూచించిన సద్గుణములన్నియు వారియందుండవలెను. విద్యమూలమున లభించు జ్ఞానము లేకున్న ప్రజలు దేశహితమన నేదియో తెలుసుకొనక అయోగ్యులను

జ్ఞానసభలకు పంపుట సంభవించును. కామక్రోధాదులను విడువనిపక్షమున శాఖాభిమానముచేతను మతాభిమానముచేతను పక్షపాతచేతను పురికొల్పబడి తగుమనుష్యులను ప్రతినిధులుగ నెన్నుకొనకుందురు. సదాచారసంపత్తి లేనిచో ప్రజలలో నున్నతదశయందుండువారు అల్పులయెడ తమకుగల బాధ్యతల నెరుగక సంఘమందుండు బీదలు నిమ్నజాతులు లోనగువారిని ఉద్ధరింప బూనిక లేనివారలై ప్రవర్తించుచుందురు. దేశమున కొక రాజుపరిపాలకుడుగ నుండినపు డీగుణములన్నియు అతనియందుండవలసివచ్చెను. అతనిస్థానమున ప్రజలే ప్రభువులగుట తటస్థించెనేని ఆగుణములన్నియు వారి యందుండవలెను. కామందకుని నీతిసారమువలన మనము నేర్చుకొనవలసిన రహస్య మిదియే.



# నా జ న్మ భూ మి

(బాలగీతము)

తాపీ ధర్మారావు గారు, బి. ఏ.,

పుట్టినదాదిగాఁ బోషించుచుండి
ఆఁకలిగాకుండ నన్నంబు వెట్టి
వలసినట్టులఁ గట్ట వస్త్రంబు లిచ్చి
చదువుసాముల నేర్పి సత్కీర్తి నిచ్చి
నన్నుఁ బెంచినతల్లి నాజన్మభూమి

కొండలెత్తుగ చుట్టుగోడలై యుండ
సంద్ర మావల లోతుకందకం బనఁగ
శత్రురాజుల నుండి చక్కరక్షించు
నావమ్మకపు కోట నాజన్మభూమి

తీయనినదు లెడతెగకుండఁ బాఱు
అందమౌ సరసు లందందును గలవు
ఫలపుష్పముల వృక్షములు లతల్ గలవు
నాయాటలకు తోట నాజన్మభూమి

గనుల వజ్రము మొదల్ గా రత్నములును
కొండల నేలుల వెండి బంగారు
మున్నీటఁ బవడాలు ముత్యాలు నుండు
నాధనంబుల పెట్టె నాజన్మభూమి

పొలములు ధాన్యరాసుల నిచ్చుచుండు
వివిధఫలంబుల వృక్షంబు లిచ్చు
సంద్ర ముప్పును లతల్ శాకంబు లిచ్చు
నాదుకొటారంబు నాజన్మభూమి

ఋషులు విద్యలనెల్ల నిచ్చెడిచోటు
బుద్ధుండుఁ గృష్ణుండు బోధించుసీమ
నిఖిలలోకములకు నేర్పినతావు
నాపాఠశాల యీ నాజన్మభూమి

పరులను యాచింపవలదు సుమ్మనుచు
నీగౌరవమ్మును నిల్పికొమ్మనుచు
బిడ్డలు! సఖ్యంబు విడకుండుఁ డనుచు
నాకుఁజెప్పెడితల్లి నాజన్మభూమి

ఈ శరీరము బలం బీధనంబెల్ల
అమ్మరో! నీవిచ్చినట్టిదె కాదె
నీపూజయే నాకు నిఖిలధర్మములు
నమ్మి నిన్ సేవింతు నాజన్మభూమి

# భావప్రదర్శనము, భావసూచన

భమిడిపాటి పట్టాభిరామయ్యగారు, బి. ఏ., ఎల్. టి.

కవి, చిత్రకారుఁడు, విరహి, వెఱ్ఱివాఁడు నొక్క విధమైన మనోవ్యాపారముగలవా రని యాంగ్లేయకవి శ్రేష్ఠుఁడగు షేక్స్పియరు వ్రాసియున్నాఁడు. తదితరులకు గ్రాహ్యములు గాఁజాలని యంశములు వీరలకు గోచర మగుచుండును. కొండొకచో నితరులకొక రీతిం గన్పడునవి వీరలకు వేఱొకవిధముగాఁ దోఁచుచుండును. వారలకు స్ఫురించునది లోకమునకు వివిధగతుల వెల్లడిచేయుదురు. కవి పద్యరూపముగాఁ దెల్పును. ఛందోనియమములే కాక, రాగతాళయుక్తంబులుగ గేయములను రచియించిన శ్రీ త్యాగరాజు మున్నగువారు సైతము కవులని యెన్నఁదగు. చిత్రరూపముగఁ జిత్రకారుఁడు ప్రదర్శించును. విరహి మోహించిన యాఁడుది యితరులకుఁ గురూపిగఁ గాన్పించినను, తన దృష్టికి రంభగనేయుండును. తన భావమును సరిగా నితరులకుఁ దెల్పనేరని చర్యఁగలవాఁడు వెఱ్ఱివాఁడనాఁబడు. బహుజనాచారమే లోకసమ్మతము. దీనికి వ్యతిరేకముగా నడచినచో లోకు లాతని వెఱ్ఱివాఁడందురు. వేమనాది ధీమంతులను సైతము వెఱ్ఱివారని జను లనలేదా? పరమభక్తుఁ డొకచోఁ దన్మయుఁడై, యానందబాష్పములఁ గార్చుచు, నృత్యము సల్పుచు, గీర్తనసేయుచు, చుట్టుప్రక్కల నున్నవారిని సడ్డసేయక వర్తించినచోఁ బిచ్చివాఁడని వానిం జూచి నలుగురు నవ్వుదురు. ముఖ్యముగాఁ గవనమును, చిత్రలేఖనమును గూర్చి చర్చింతము. తమ భావముల నితరులకుఁ బ్రదర్శించు సాధనములకుఁ 'బ్రదర్శనోపాయము'లను పదమీవ్యాసమున వాడెద.

కవిత్వము:—1. పదములు; ఇవి గద్యమైనను పద్యమైనను భావమును వ్యక్తము చేయుటకు ముఖ్యసాధనములు. 2. ఛందోనియమములు; పైదానితో నివి కలసినచో వ్రాయునది యొక్కువరసవంతమై యుండును. 3. రాగతాళములు; ఇవియుం గలసినచో శోభ మఱింత హెచ్చు. ఇప్పటి పార్శీపాటలవలెఁగాక యతిప్రాస నియమములు పాటించి రచించి లిఖియించిన శ్రీ త్యాగరాజకృతులు నేఁటికిని నిరుపమానములుగావా?

పదములఁ బ్రయోగించునపుడు ఔచిత్యము నాలోచించి, అశ్లీలములను వర్జించి, సుబోధములగు పదముల నుపయోగింప వలయును. కీర్తిశేషుఁడగు నాధునికకవి తన నామధేయము యొక్క యర్థము నిచ్చునట్లు "అఘధజ్మణి" (=వేంకటరత్నము) అని ప్రయోగించిరి. పండితులు సైతము యిది పేరని గ్రహించుట కష్టము. అదియునుంగాక, అనవసరపు పదబాహుళ్యము లేక పదిమాటలలో నితరులు చెప్పఁగల్గు భావమును మూఁడుమాటలలో నిముడ్చఁగల్గువాఁడే నేర్పరి.

కవనము : ఛందోనియమములే ముఖ్యమని వాదించువారు కొందఱు. ఇట్టి కవుల పద్యములయందు రసపుష్టి లేక, పాదపూర్తిముక్కలు మెండుగానుండును. "భోజనం దేహి రాజేంద్ర" యను శ్లోకమందలి పూర్వభాగమువలె నుండును. ఇట్టి కవులు శబ్దాలంకారములు మెండుగ నుపయోగించి శ్లేషాదిచమత్కృతులం జూపఁ బ్రయత్నింతురు. రాఘవపాండవీయము చమత్కారగ్రంథమే. సర్కసులో నైతైన కఱ్ఱమీద రెండు పల్టీలు కొట్టినట్లుండును. రాఘవ యాదవ పాండవీయము మూఁడుపల్టీ లొక్కవిసురులోనే చేయుట యనుకొందము. "నలరాఘవ యాదవ పాండవీయము" గూడ కవి యొక్కఁడు రచియించెనఁట. ఇది నాల్గుపల్టీ లనుకొందము. లేదా. మ. రా. శ్రీ కోడి రామమూర్తిగారు

త్రోత్ర్ముపై నేనుఁగును నిల్పిన ట్లనుకొందము. మనుష్యుని శక్తి యింతసాధించఁగలదుగదా, యని చూపుట తక్క వేఱొం డుపయోగ మేమి? తదితరుల కెంతమందికి యిట్లే చేయుట శక్యము? చేసెరిపో, ఎందరి కానందము గల్గును? ఏనుఁగు రామమూర్తిగారి. గుండెనుండి దిగునంతవఱకు చూచువారికి మనము లెంత భీతిగొనియుందుమో యెల్ల రకు స్వానుభవము. ఇట్టి కావ్యములను బోధపఱచుకొను మహనీయుఁడు నూటికొకఁడు.

కావున పద్యరూపము ఛందోనిబంధనలే ముఖ్య మని పాటించుటయు, సామాన్యులకు సులభగ్రాహ్యములు గాని ప్రయోగములు తమపాండిత్యమును వెల్లడిచేయు టకై పాదపాదమున నింపుటయు, శ్లాఘ్యము కాదు.

ఇవన్నియు ననవసరములు. భావమే ముఖ్యము. భావగాంభీర్యము, విశేష భావసూచన ముఖ్య ముగనుండినఁ జాలును. ఛందోనిబంధనలతో నవసరము లేదని వాదించుటగూడ సర్వజన సమ్మతముకాదు. ఇట్లు వాదించువారు ఆంగ్లేయభాషాచారము ననుసరింప నిచ్ఛగొన్నవారు. డ్రైడను, పోపు మున్నగువారి కాల ములో ఛందోనియమము లెక్కువగాఁ బాటించిరి. కవి శిరోమణియగు షేక్స్పియరుకూడ నాదిలో వ్రాసిన గ్రంథములకంటెఁ దరువాత వ్రాసినదానిలో (Rhyme) అంత్యప్రాస విసర్జించి యెక్కువ భావగాంభీర్యముతో వ్రాసె. టెనిసన్ కూడ నిట్టి నియమములు విసర్జించినను భావపుష్టియు భావసూచనయుఁ గలకావ్యముల వ్రాయు టచే గొప్పకీర్తి వహించె. ఆధునికులు మరి నాలుగడు గులువేసి ఛందోనియమములు పాటింప నవసరము లేదనియు, భావమొండె కవిత్వలక్షణమనియు వాదించి (Poetic Prose) " పద్యమువంటి గద్య " (Prosaic Poetry) "గద్యవంటి పద్యము" అనుమాటల సృష్టించి గద్యపద్యములకు భేదములేక చేయుచున్నారు. ఇట్లు భావమే ప్రధానముగాఁ గల్గి యితరలక్షణములు లేని పద్యములు తఱుచుగ బయలుదేఱుచున్నవి.

"యెఱ్ఱినాయెంకి" అను పద్యమును ఖండించుచు భారతియందు మ. రా. శ్రీ పో. లక్ష్మీనారాయణ గారు వ్రాసిరి. ఛందోనిబంధనలు విసర్జింపబడియుం డుట వాస్తవము, శోచనీయము. కాని, భావశూన్య మనుటయందు నే నేకీభవించను. వెఱ్ఱివేషము ధరించిన పరమయోగివలె నింవలి వేదాంతము కొంతేతడ పూహిం చినం దెల్లమగు. నామనసుకుఁ దట్టినది యేమనఁగా, ప్రశ్నించువాఁడు ఆత్మ. యెఱ్ఱియెంకి, యజ్ఞానమయ మగు దేహము. వీటికూడిక యీయిరువురి దాంపత్యము. మొదటి రెండుపాదముల భావము:—జన్మమునకుం బూర్వ మేమి? ఎవ్వరెఱుఁగరు? ఈయరయమిచేత సిగ్గు. జన్మానం తర మేమిగలి?:—ఇదియు నెఱుఁగము. కాని రానున్న దగుటచేఁ గడచినదానివలెఁ గాక భీతిం గలిగించుచున్నది. కావున యెంకి తెల్లఁబోయె. పోని, యిప్పటి యానందము శాశ్వతమా? కాదు; క్షణభంగురము. జన్మము క్షణభంగురము. తత్పూర్వాపరదశలు మర్త్యు లకు గోచరములు కావు. కావునఁ గర్తవ్యం బేమి? "భజగోవిందం భజగోవిందం భజగోవిందం మూఢ మతే" యను ధ్వనిగూడఁ గలదు. ఇట్టి యనంతభావ గాంభీర్యము, సూచనగలిగిన దానిని భావశూన్యమని త్రోసివేయుట ధర్మమా?

నేను బాల్యమున నఱవజిల్లాలలోఁ గ్రుమ్మరు చుండగా నొక పండారము (శైవసాధు) ఒంటితంతి తంబురంబూని యిట్లుపాడె. ఈపాట జ్ఞప్తికివచ్చుచు న్నది. కాన యీసందర్భమున వ్రాసెద.

"నందవనత్తిలో రాండి, అవళ్
నాలారుమాదమాయి, కుయవనై వేండి
కొండువందా నొరుతోండి, అవళ్
కూత్తాడి కూత్తాడి, పొట్టాడెత్తాండీ" ॥నంద॥

అర్థము. నందవనములో నొక సాధువుండె. వాఁడు పదినెలలు కులాలునివేఁడి యొక కుండందెచ్చె. కాని నాట్యమాడి దానిం ద్రోచి బ్రద్దలు గొట్టెనే!

ఇందు నందవనమన భూలోకమనియు, సాధువు జీవుండనియుఁ, గులాలుఁడు బ్రహ్మయనియు, తెచ్చిన కుండ దేహమనియు కొసకు దక్కించుకొనక దుర్వర్త నచే భంగము అనఁగా మరణము వాటిల్లెననియు దీని భావమట.

కాఁబట్టి ప్రదర్శనోపకరణములే ముఖ్యమను టయు, భావమే ముఖ్యమనుటయు తెలివితక్కువ. పద్యాకారముండి భావములేనిచోఁ బెఱుకుపిప్పివలెఁ

జప్పగా నుండును. రూపముం బాటించక సూచన హెచ్చైనచోఁ సుబోధము కాక సామాన్యులకు నిరుపయోగముగా నుండును. కావున భావము కొంత స్పష్టపరచి కొంత యూహ్యముగా వదలినచో "ఆంధ్రవ ధూటి కుచమున్ బోలె" నని యాంధ్రకవితా పితామహుఁడు చెప్పినట్లుండిన సర్వజనరంజకముగ నుండును.

గానము:—ఇందు సైతము శ్రీ త్యాగరాజు మున్నగు మార్గదర్శకుల ననుసరించి యతిప్రాసలు పాటించిన బాగు. ఘనగాయకుఁ డుపకరణములతో "సరిగమాది" స్వరాళి ననర్గళధారతోఁ గురిపించుచు, వేసిన సంగతి మరలవేయకయే అఱుఘుంటలసేపు ఆనందభైరవి పాడవచ్చు. కాని గ్రహించి మెచ్చంగలవారు సభ్యులలో నెందరుందురు? సుఖముండునా?

సంగీతశాస్త్రము తెలియకక, యొంటి తంతితంబురాతో వీథిలోఁ బాడుచుఁ, గాని యిచ్చినచోఁ గనకాభిషేకము చేసినట్లు సంతసించు బైరాగి ఒక్క విసురు విసిరినచో నతిహాయిగా నుండుటయే కాక, ఆతఁడు వెడలిపోయిన చాలా కాలము వఱకు చెవిలో ధ్వనించుచుండును. నాటకములలోఁ బద్యములం జదువు మనయువకులు, భావానుసారములగు రాగముల నుపయోగింపక, పొందని రాగములలోఁ బాడి పద్యముం జెడఁగొట్టుదురు. "తగు నీచక్రి విదర్భరాజసుతకున్ తథ్యంబు వైదర్భియున్......మా పుణ్యమూలంబునన్" అను నానందపూరితమగు దానిని నాదనామక్రియలోనో, ఇంకను దైన్యముం జూపెడి "ఫీలు"లోనో పాడి, "ల్గావొక్కింతయు లేదు, ధైర్యము విలోలంబయ్యె .. ......సంరక్షింపు భద్రాత్మకా!" యను దానిని ఆనందభైరవిలోఁ బాడినచో నెంత రసహీనమో యూహ్యము.

చిత్రలేఖన:—ఇందు ప్రదర్శనము ముఖ్యమా, భావసూచన ముఖ్యమా యని చర్చింపకమున్ను, అనేకులకుఁ గల భ్రమ నొకదానిం దొలఁగింపవలయు. "భారతీయ" వైఖరియని చిత్రములం గూర్చి కొన్ని పత్రికలందు వ్రాయుట గలదు. మనమందఱము దేశాభిమానుల మగుటం జేసి యీశబ్దము హృదయంగమముగ నున్నది. ఇట్టి వైఖరి గలదని నమ్మెదము. మన దేశమున కెల్ల నొక వైఖరి చిత్రలేఖనము లేదు. ఏలయన నేదేశములోఁ జూచినను, ఆదేశమునకు నితర దేశమునకుం గల్గు సంబంధములం బట్టి చిత్రవైఖరి మారుచుండును. ఇంగ్లాండు నిదర్శనము. ఆదిలో నాగరికత లేని యీద్వీపవాసులు ఎముకలమీదను కొమ్ముముక్కలమీదను గీచిన చిత్రములు, నార్మనులు వచ్చిన తర్వాతఁ గనుపడునవియు, తరువాత Renaissance అను గ్రీసు రోము దేశముల విద్యాపునరుద్ధారణముచే నాదేశముల వైఖరియు, తరువాత Impressionists అను వారి చిత్రములును, Post_Impressionists అనువారును, Pre-Raphaelites అను వారి చిత్తరువులును, మిగుల భేదముం జూపుచున్నవి. [Pre-Raphaelites అనఁగా రాఫెయిల్ అను గొప్ప చిత్రకారుని ముందున్నవారని యర్థమిచ్చును; కాని, యీ నామధేయము రాఫెయిల్ కు ముందున్న చిత్తరువుల వైఖరిం బునర్వ్యాప్తి చేయంబూనిన రస్కిన్ మున్నగు నాధునికులకే వాడుదురు].

ఇట్లుండ, నన్యదేశస్థులు పరంపరగా నేలిన మనదేశమునం దనేక చిత్రవైఖరు లుండెనన వింత యేమి? శిల్పము లటుండ, అజంతా చిత్తరువులకు మొగలాయి వైఖరికి, ఆంగ్లేయ లేక పాశ్చాత్య వైఖరికి వంగ (Bengal) వైఖరికి, నిప్పుడు క్రొత్తగా దాని జన్యమగు నాంధ్రవైఖరికి (మ. రా. శ్రీ, దామెర్ల రామారావుగారి చిత్రములు) భేద మెక్కువ గలదు. కావున దేశమున కెల్ల భారతీయవైఖరి యున్నదనుట కల్ల.

పైఁజెప్పిన వైఖరులలో ప్రదర్శన ప్రాధాన్యము గలది యాంగ్లేయవైఖరి. ఇట్టి చిత్రరచనచేఁ గీర్తి వహించిన చిత్రకారుఁడు కీర్తిశేషుఁ డగు రవివర్మ. ప్రదర్శనోపాయములను శుష్కించి భావ మెక్కువ సూచింపఁ బ్రయత్నించు వైఖరి వంగవైఖరి. బందరు జాతీయ కళాశాలలోనున్న చౌదరిగారీ వైఖరిం బట్టియే చిత్తరువుల లిఖియించుచుందురు.

ఈ రెంటికిని ఉండు తారతమ్యములం జర్చింతము.

పాశ్చాత్యవైఖరి

i ప్రదర్శనోపాయముల వినియోగ మెక్కువ.
ii ప్రదర్శనము విపులముగ నుండును.
iii సామాన్యులకు సుబోధముగనుండును.
iv చిత్రకారునికింగల (close observation of detail) సాంగోపాంగ పరిశీలనాశక్తిఁ జూపును. ఈశక్తిని యిది వృద్ధిపరచును.
v కావున ప్రకృతి శాస్త్రము, జంతుశాస్త్రము, వృక్షశాస్త్రము, ఇట్టివానికి సంబంధించిన చిత్రలేఖనకు మిక్కిలి యుపయోగకరము.

ప్రాచ్యవైఖరి

i ప్రదర్శనోపాయముల వినియోగము తక్కువ.
ii ప్రదర్శనము గూఢముగ నుండును.
iii పండితులకేకాని తదితరులకు సుబోధములు కావు.
iv చిత్రకారుని యందు మనఃకల్పనాశక్తిని (imajination) చూపును. ఈశక్తిని వృద్ధిపఱచును.
v కావున కావ్యములకుఁ బురాణేతిహాసములకు సంబంధించిన చిత్రలేఖనకు మిక్కిలి యుపయోగకరము.

ఈపైయంశములను విశదపరచెద.

పాశ్చాత్యవైఖరి :— ఇండు, రంగు, వెలుఁగునీడలు, దూరముంజూపు పద్ధతులు బాగుగ నుపయోగింతురు. [మ. రా. శ్రీ. భ. రామసోమయాజులుగారు వీనిం గూర్చి సవిస్తరముగ వ్యాసములు వ్రాసియున్నారు గాన, పునరుక్తి యనవసరము].

ii ప్రదర్శనము విపులముగ నుండును. ఛాయాఘట్టము లేదేనినైనను తద్వతుగానే చూపించెడి భంగి, యీవైఖరి చిత్తరువులు చిత్రితములు ప్రత్యక్షములుగ నున్నట్లే చూపును. ఫ్రాన్సులో నొక చిత్రప్రదర్శనము (exhibition) జరిగెనట. ఒక చిత్రకారుఁడు లిఖించిన పుష్పఫలములం జూచి, సీతాకోకచిలుకలు పిట్టలు చిత్తరువుపై వ్రాలందొడంగెనట. "ఆహా" యని యిట్లు జీవజంతువులం భ్రమింపఁజేయఁగల్గిన చిత్తరువుం గొనియాడిరట. ఇంగ్లండు మఱియొక గొప్ప చిత్రకారుని స్నేహితులు తన పటము నొకదానిం బంపుమనిరట. "కాలాతీతము కాలేదుగదా! పంపెద" నని యతఁడు కాలయాపనచేయుచుండెనట. నియమించిన ఆఖరురోజు దగ్గరించె. అంత నాతఁడు తెరనొకదానిని వ్రాసిపంపెనట. దానింజూచి చిత్రశాస్త్రవేత్తలు భ్రమఁగొని తెరవెనుక నేదోయున్నదని ప్రక్కకుఁ దీయ యత్నించిరట. చివరకు చిత్తరువని తెలిసి యానందాశ్చర్యభరితులై "ఫలపుష్పాదుల పటము పురుగులను పక్షులను మోసపుచ్చెనుగాని, ఇది మనుజులనైతము భ్రమింపఁ జేసెఁగదా!" యని ప్రథమసంభావన తెరనువ్రాసిన వాని కొసఁగిరట.

iii సామాన్యులకు సుబోధముగ నుండును. ఇట్టి ప్రత్యక్షప్రదర్శనము చేసినయెడల నెల్లరు చిత్తరువులం జూచి యానందింతురన వింతయేమి. శ్రీ రవివర్మగారి పటములు ప్రతియింట నుండుట కిదియే కారణము.

iv వస్తు పరిశీలనాశక్తి (observation) ఈవైఖరి నవలంబించు చిత్రకారుల కావశ్యకము. లోకములం దెల్లవస్తువుల నిట్లు పరిశీలించుట ఒకనికి దుస్తరముగాన పాశ్చాత్య చిత్రకారులలో నొక్కొక్కఁ డొకవిధము చిత్రములే లిఖియింపం బూనును.

1. Landscape Painters:— వీరు భూదృశ్యములనే లిఖింతురు. ఇందుఁ గష్టమేమియందురో? సూర్యుని గమనముంబట్టి వెలుఁగు నీడలు, ఆకాశమందు మేఘములరంగులు, జలాశయములు, వీని ప్రతిబింబములు, గడియగడియకు, క్షణక్షణమునకు మార్పు చెందును. కావున నతిశీఘ్రముగ చిత్తువ్రాసి, రంగులు పూసి, దానినంతయు జ్ఞప్తియుంచుకొని తర్వాత సాపుగా వ్రాయవలె. ఇట్లు వ్రాసిన చిత్తులు పాశ్చాత్యవైఖరి నవలంబించు ప్రతివానియొద్దను పెద్ద దస్త్రము లుండును.

2. Marine Painters:— ఇందుఁగూడ శీఘ్రముగఁ జిత్తువ్రాసే శక్తియుండవలె. సముద్రమునందలి యలల చాంచల్యము జగద్విదితము; సాధారణముగ నొకరీతి నుండవు; తుపాను వీచునప్పు డొకవిధముగ నుండును. అదియుంగాక, యానముచేయు నౌకలయొక్కయు, ఎగిరెడి విహంగములయొక్కయు వివిధగతులం బరికించి చూచిననేకాని సముద్రదృశ్యములలిఖియించుటదుస్తరము.

3. Animal Painters :— జంతువులుకూడ చిత్రకారునికై కదలక నిలువవు. చెవినో తోఁకనో ఆడించును.

"ఘనములు దర్పణంబు లిభకర్ణ తలాగ్రము లెండమావు ల, వ్వనధి తరంగముల్ సిరులు" (షట్చక్రవర్తి చరిత్రము) ఇట్టస్థిరముల లిఖియించుటయందుఁ గష్ట మెక్కువగలదు.

4. Group Painters:— జన సమూహాములం జిత్రించువారికి సైత మీ కష్టముండును.

5. Portrait Painters: వీరు చిత్రశిల్పప్రదర్శనశాల లందుఁ (Art Galleries) గ్రుమ్మరి, యనేకవిగ్రహములం జిత్తుగా వ్రాసికొని, వస్త్రములెట్లు లిఖియింపవలెనో (Drapery) గమనించి, నైపుణ్యత వహియింతురు. "అయితే, తన ప్రతిమను వ్రాయించికొను వాఁడు చిత్రకారుఁడు చెప్పిన విధముగ నెదుట చలనము లేక యుండఁడా? ఈ చిత్రములయందు కష్టమేమి!" అని యడుగవచ్చును. (ఎ) పోలిక: పుడమి యందు జను లనేకులైనను, ముఖభాగము లంపటికిని సమమైనను, ఒకనింబోలి మరియొకఁ డుండఁడు. ఇతరులకు లేని యంశ మేదో ప్రతివాని కుండుటంజేసి మనము గుర్తింపఁగలము. ఈయంశములం గమనించి వ్రాయనిచోఁ బోలిక రాదు. చిత్తరువుంజూపి, "ఫలానివారి వలె నున్నదా?" యనినఁ జూచువారు సంతుష్టిలేక "ఒకమోస్తరుగా నున్నదిగాని పోలిక సరిగారాలేదు. ఏమో లోపమున్నది." అందురు. ఈలోపమేమో చిత్రకారుఁడు గమనించి చూడవలె. మెల్లకన్నో, పుట్టుమచ్చో, మూతియందలి ముడుతలో, జుట్టు, బొట్టు, కట్టు(పాగా మొదలైనవాని) నైఖరియో, చూచువారు చెప్పలేరు. దీనిని సవరించిననేకాని పోలిక రాదు. (బి) Expression. ఒకడు నవ్వుచో మొగమందలి మాంసకండరములు (muscles) కొన్నింటి వ్యాపారముచే నొకవిలాసము వహించును. ఏడ్చుతరి మఱికొన్ని కండరముల వ్యాపారముచే నింకొకవిధముగ నుండును. ఒకనియందే మనోవ్యాపారముంబట్టి ముఖసూచన మారును. దీనినే (expression) ముఖసూచన అందురు. తఱుచుగా నానందయుక్తుఁడై యున్నవానికి ఒకవిధమగు ముఖవిలాసము స్థిరపడును. ఎల్లప్పుడు దుఃఖయుతుఁడైనవానికి వేఱువిధమగు ముఖసూచన స్థిరపడును. ఒకని "ఖులాసామనిషి" అందుము. ఇతనికి దుఃఖమే లేదని కాదు. తరుచుగా నాతని మొగమున నానందమే సూచింపఁబడునని భావము. ఇట్టి ముఖసూచనయందుఁ దప్పువ్రాసినను పోలిక చెడును.

V. పాశ్చాత్యు లైహికశాస్త్రములయందు నిపుణత వహించి యార్థికదశను వృద్ధిపఱచుకొనుచున్నారు. మన మాముష్మిక సంబంధమగు శాస్త్రములలో ఘనత వహించితిమి. ప్రకృతి శాస్త్రము మున్నగువానికి సంబంధించిన చిత్తరువులు ప్రత్యక్షప్రదర్శనము లేక, వస్తువునకు చిత్తరువునకు భేదమున్నచో నిరుపయోగములు. ఉదాహరణము: తేలుంగూర్చి చెప్పవలెనని దాని దేహనిర్మాణము జాగ్రతగాఁ జూచి లిఖింపవలె. "తోఁక" యను భాగమున నైదుపూసలకంటె నెక్కువగాని తక్కువగాని యుండరాదు. దాని యాహారమగు

(చి॥ ౧౮)

తేలు తోఁక, కొండి తెరచినపుడు మూసినపుడు గిట్టకీలు

"తలనుండు విషము ఫణికిని
వెలయంగాఁ దోఁకనుండు వృశ్చికమునకున్" (సుమతిశతక.)

జంతువులంబట్టుటకు "గిట్టలలో" నుండు యేర్పాటు చూపవలె. కీలు, పట్టినది జారిపోకుండుటకు పండ్లు, అన్నియు గమనించి లిఖియించవలె. కాని తేలుమందును ప్రచురపరచుటకు వార్తాపత్రికలయందుఁ గనుపించు పటములు, శాస్త్రాభివృద్ధికి నిరర్థకములు.

పాశ్చాత్యవైఖరి నవలంబించిన చిత్రకారులలో మనఃకల్పన కేవలము శూన్యమా అని యడుగుదురేమో? కొద్దిగాఁగలదు. ఉదాహరణము:— గ్రీకుపురాణములలో మన్మథునికి క్యూపిడ్ అందురు. ఈతని బాలునిగఁ జిత్తరువులందును, శిల్ప యుక్తదునుం జూపుదురు. 3. మఱియు నీతఁ డంధుఁడు; ధనుర్ధరుఁడు. ఈతని యమ్ములు తక్కువ రకములు. సీసము నగ్రమందుఁగలవి; కామముం దొలఁగించును. హేమాగ్రములు కామోత్పత్తిచేయును. ఈతనికి రెక్కలుండును.




క్యూపిడ్.

ఇట్టి స్వరూపము వ్రాయంబూనిన పాశ్చాత్యుఁడు తన మనమునందలి ప్రతిమతోడనో యిదివఱకు క్యూపిడ్‌ను బ్రదర్శించు చిత్తరువులనో పోలియుండు బాలుని వెదకి, మంచిమాటలాడియో సొమ్మిచ్చియో యెదుట ధనువుంబూని దిగంబరుఁడుగ నిలువఁబెట్టుకొనును. ఇట్లెదుటనిలిపిన స్వరూపమును "Model" (మోడల్) అందురు. దేహముండు వైఖరికి "Pose" (పోస్) అందురు. కండ్లయందు నల్ల గుడ్డు వ్రాయకున్నచో నంధుని రూపువచ్చును. రెక్కలకో? పక్షులరెక్కలను. చిత్తరువులువ్రాసినవానింబట్టి రెండురెక్కలు వీపునుండినట్లు అతుకఁబెట్టుటయే చిత్రకారుని స్వీయకల్పనాశక్తి.

వంగవైఖరి:— ఇందుఁ బ్రదర్శనవైపుల్యము తక్కువ. సూచన యెక్కువ. గీఁతలు గీచి, చిత్తరువులు వ్రాయుదురు. ఆలోచించినయెడల గీఁత సూచనార్థమే. లోకమునం దేపదార్థమునకైనను ఇనుపకట్టువలెఁ జుట్టు గీత లుండవు. కాని ఆవస్తువు నితరవస్తువులనుండి వేఱుగాఁ జూపుటకు గీఁత మనుష్యుఁడు కల్పించిన యుపాయము. ఈగీఁత సైతము సంపూర్ణముగా నుండనక్కరలేదు. రేకులో కన్నములుకొట్టి సులువుగా గోడమీఁదగాని మరి దేనిమీఁదఁగాని యనేక ప్రతులుతీయుట కనుకూలముగా నుండునట్లు, అక్షరములను ప్రతిమలనుంగూడ లిఖియింప



గణపతి (స్టెన్సిలు)

వచ్చు. దీనిని "Stencil" (స్టెన్సిల్) అందురు. గీఁతలు ముక్కలుముక్కలుగా నుండును. లేకున్న రేకు నిలువదు. దానింబట్టి లిఖియించినది సైతము ముక్కలుగాఁ దునిఁగిన గీఁతలు గల్గియున్నను, సంపూర్ణాకృతిని సూచించును. ఉదాహరణము. గణపతి.

ఆవరణరేఖ (Outline) మిక్కిలి స్పష్టముగా లిఖియించి లోపల రంగుపూఁతపూసిన చిత్తరువులు గోడలమీఁద లిఖియించుటకు సులువుగా నుండును. వీటినే "Frescoes" (ఫ్రెస్కోలు) అందురు. అనేక వేలసంవత్సరముల క్రిందట లిఖియించినను ఇప్పటికిఁ జెడక, పూర్వ

నాగరికతను, చిత్రనైపుణియుంజూపుచు హృదయంగమములుగా నున్నవి. ఈజిప్టుదేశములోఁగూడ నిట్టివానింబట్టి దేశచరిత్రం గనిపెట్టిరి.

సాధారణముగ నావరణరేఖ దృఢముగ వ్రాసినచో దూరదృష్టికి స్పష్టముగ నుండును. కావున నాటకమునందలి తెరలు వ్రాయువారీపద్ధతినవలంబింతురు.

రెండుమూఁడు రేఖలలో నుద్దేశించినవాని పోలికఁ దెచ్చుటకు మిక్కిలి నేర్పు కావలెను. ఇంగ్లాండు మొదలగు దేశములలో వార్తాపత్రికలకుండు స్వాతంత్ర్యముం బట్టి, వానియందు గొప్పవారి నీ హాస్యరూపముగ లిఖియించి వారిచర్యలంగూర్చి జనులయభిప్రాయము వెల్లడి చేయుదురు. ఇట్టి హేళనాచిత్రముల (Caricature) కారికేచరులందురు. చిత్రకారుని యూహకొలఁది మృగరూపములను వ్రాసి, శిరమందుమాత్ర ముద్దేశించినవాని పోలికఁజూపుదురు. నాటకములో నితరపాత్రములకంటె విదూషకుని కెంతయూహ, సమయస్ఫూర్తి కావలెనో, అట్లే, చిత్రలేఖనమున "కారికేచరులు" వ్రాయువానికంత నేర్పు కావలెను. కొద్దిగీఁతలతో "ముఖసూచన" చేయుట మిక్కిలి కష్టము.

Design: సృష్టిలోనుండు వస్తురూపములం గైకొని మనః కల్పితశృంగారాకృతిలో నమర్చుటకు డిజైనందురు. ఉదాహరణము:—పటములయందు శృంగారముగ నుండునట్లు వ్రాయవలె ననుకొందము. భారతీయ సంబంధ ముండుటంజేసి మనదేశమును సూచించెడి తామరను లిఖియింప సంకల్పించుకొందము. ఇట్టియెంచు



భ. ప.

వ్రాయవచ్చు. కాని సృష్టిలో కాడ కొక పువ్వో మొగ్గయో యుండును గాని రెండుకాడ లొకదానిలోఁ గలుగవు. మరియు, పువ్వులు, మొగ్గలు, ఆకులు, వరుసఁ దీరి యుండునా? ఉండవు. కావున నీయాకృతియంతయు శృంగారార్థము చిత్రకారుని మనఃకల్పన. ఇట్టి మనఃకల్పన పాశ్చాత్యులయందు మృగ్యము. ఇతరదేశములనుండి గ్రహియింతురు. టాజ్ మహల్ మున్నగువానియందలి రాతితెరలలోనున్న "డిజైను" సొంపు నేఁటికి నసమానముగనున్నది.

భావమొండే ముఖ్యమని వాదించి, ప్రదర్శనము నుపేక్షించినచో నెల్లరకు సుబోధముగ నుండదు. "శారదా"పత్రిక ముఖపటమునందలి భావగాంభీర్యము డాక్టరు కసిన్సుగారు, డాక్టరు స్టెల్లాక్రెమిష్‌గారు మున్నగు శాస్త్రవేత్తలు బోధపరచిననేకాని యెవరెఱుంగరైరి. ఉద్యోగస్థులు నిషేధించిరి. కసిన్సుగారు వ్యాఖ్యానము వ్రాసినతరువాత సైతము 'హిందూసుందరి' మున్నగు మహిళాపత్రికల సంపాదకులు ఖండించిరి. కావున విద్వాంసులెవరో వేయికొకరు తక్క సామాన్యులకు గ్రహింపశక్యముగాని భావగాంభీర్యము, అరణ్యకుసుమమువంటిది. నారికేళపాకమునకును మించినకాఠిన్యముగల్గి, అయఃపాక మనందగుపద్యము, తానువ్యాఖ్యానము వ్రాసిననేకాని యేరికిం గ్రాహ్యముగాకుండునట్లు వ్రాయు కవియు, ఆఱుగంటలసేపు ఆనందభైరవి దంచిపాడి సభ్యులలో నైదుగురు విద్వాంసులు తప్ప నితరులం దరిమివేయు గాయకుఁడును, లోకగ్రహణాతీత భావగర్భితములగు చిత్రముల లిఖియించు చిత్రకారుఁడును, వందనీయులే కాని నిరుపయోగులు.

"... . కృతి వెంగలిమూక కెఱుంగ శక్యమే" యని లోకులం దూఱుటకంటె, వారియందుఁ గటాక్షముంచి రెండుమెట్లు దిగి, చేయూఁతయొసఁగి కొండనెక్కించుట శ్లాఘనీయము.

కావున, భావము విశేషమున్నను, ప్రదర్శనోపాయములంగూడ వినియోగపఱచి యెల్లఱు కందునట్లు చేసి తనభావ మనేకుల కుపయోగించునట్లు చేయువాఁడే లోకోపకారియగు మహనీయుఁడు.




సోమంచి సూర్యనారాయణ శర్మ గారు

౧

పట్టరాని భావమ్ములు
గుట్టలుగుట్టలుగఁ బుట్ట
నెట్టులో వెలువరింతు
చిట్టిచిట్టినుడుల నేను;
కట్టుగాట్లు సున్న యనుచు
గరువ మ్మది మెండటంచు
దిట్టితిట్టి తీవరించు
ధీరహితుండా! రహి నే
నిట్టులట్టు లాడకుండ
గట్టిగాళ్ల నావాకుం
గట్టి వేయఁ బూనుచుండఁ
బట్టుదలను మానకుండు

౨

కట్టా! నానోరట్టులఁ
గట్టుకొనఁగలనె యూహల
పెట్టయైన నాహృదయము
ఫెళ్లున బ్రద్దలగుదాఁక
గట్టురాయఁ డొక్కయినుక
కణములోనఁ గలియుదాఁక
దట్టమైన ప్రాలేయము
దావానలమైనదాఁక
చుట్ట మినుఁడురాఁ బద్మిని
శోభాహీనయగుదాఁక
చెట్టులెల్ల మోడు లగుచుఁ
జేవదక్కి మాడుదాఁక
పిట్ట లాకసంపు వీథి
విహరించుట మానుదాఁక
బిట్టువసంతమును బాసి
పికనాదం బుడుగుదాఁక.

* * * *

౩

గట్టులఁ జెట్టులఁ బిట్టలఁ
గట్టఁజూచు నాకట్టిఁడి
పుట్టనిమ్ము తిట్టనిమ్ము
పొక్కనిమ్ము స్రుక్కనిమ్ము,
చెట్టలు దలపెట్టనిమ్ము,
సీత్కారము సేయనిమ్ము
పెట్టెడ వందనము లక్ష్య
పెట్ట నట్టియరసికమతి
గట్టిపాండితిం గొనంగఁ
గాలంబును వ్యయపెట్టను
పుట్టెడుతలఁపుల బైటం
బెట్టుట కించుక జంకను
బొట్టెల లేఁబల్కులఁ గని
మోద మొందుపితరులవలె,
జిట్టినుడులకును ముదముం
జెందఁగలరు సహృదయులే.



# లక్ష్మి

మొక్కపాటి నరసింహశాస్త్రి గారు

"లక్ష్మీ, మనరోజు లిలా వెళ్లవలసినదేనా! ఇంతకాలమునుంచి సజీవమై చిగిరించుచున్న ఆశాలతను తెంపవలసినదేనా? లేక నిర్మూలముకూడా చెయ్యాలా?"

ఈ ప్రశ్నకు వచ్చే సమాధానము పైన తనజీవితమంతా ఆధారపడి ఉన్నట్టు, యవనికవలె నున్న అశ్రుబిందువుల చాటునుండి ప్రేమరస ముట్టిపడు చూపుతో, అతిత్వరితముగా వస్తున్న వేడినిట్టూర్పుచేత కదులుచున్న నాసికాపుటములతో, చలిస్తోన్న అధరముతో, ప్రాణము అరచేత పెట్టుకుని, లక్ష్మి పెదవులపైపు తదేకదీక్షగా చూస్తూ ప్రకాశరావు ఆత్రతతో కనిపెట్టుకున్నాడు.

ప్రకాశరావు ఇప్పటికి సుమారు పాతిక సంవత్సరముల వాడు. అతని జన్మస్థలం కాకినాడ. బ్రాహ్మణవంశమునందు పుట్టినవాడు. తలిదండ్రులు మంచి సదాచారసంపన్నులు; వైదికసంపత్తి కలవారు. తమ కున్న స్వల్పాస్తిలోనే ఎవరికేనా అడిగినవాళ్లకు పెట్టడమే కాని దేహీ అని చెయిచాచి ఇంకొకరిని యాచించకుండా నప్రతిగ్రహీతలని వాడుక పొంది కాలక్షేపము చేస్తూ ఉండేవారు. ఈనాటి సామాన్య కుటుంబీకులవలె అనవసరముగా కోర్టుచుట్టూ రిజిస్ట్రారాఫీసులచుట్టూ తిరగడమూ ఓసాక్ష్యాలూ సంపన్నాలూ ఏమీ లేకుండా, చాలా మర్యాదస్తులు, ఘరానా మనుష్యులని పేరుపొందారు. ఒకళ్ల జోలీ జోక్యము అవసరములేదు. పరులనుచూచి అసహనంలేదు. ఎదటివాళ్లు కష్టంలోఉన్నారూ అంటే, తమరూ చాలా కష్టాలు అనుభవించి ఉండడముచేత, వాళ్లకంటెఎక్కువగా తమరూ విచారిస్తూ, మరొకసహాయ మేమీ చేయలేకపోయినా, ధైర్యంకలిగించే జాలిమాటలతో ఎదటివాళ్లు తమకష్టాలు సగము మరిచిపోయేటట్టు చేస్తూ, అందరికీ స్నేహపాత్రులై పదిమందిచేతా "ఓహో" అనిపించుకుంటూ ఉండేవారు.

వారికి చాలామంది పుట్టిపోయిన తరవాత ఇద్దరుకొడుకులూ నలుగురుకూతుళ్ళూ మిగిలారు. పెద్దకొడుకు బి. ఏ. ప్యాసయి పిఠాపురంరాజావారి కాలేజీలో అరవయి రూపాయిలజీతంమీద మేస్టరుగా ఉండేవాడు. తరవాత నలుగురుకూతుళ్ళూ కాపరానికి వెళ్లకముందే అధీనంతప్పి ఇల్లు పట్టారు. కడసారపువాడు ప్రకాశరావు.

ప్రకాశరావు తల్లి పోలిక. అందుచేత చాలా అదృష్టవంతుడని చిన్నప్పటినుంచీ అంతా అంటూఉండేవారు. మెరుగుచామన చాయ శరీరకాంతి, దీర్ఘముగాక అలాఅని మరీకురుచగాక ఇంచుక స్థూలమై బలిష్ఠమైన అవయవసౌభాగ్యము; కాంచెములోతైనను ప్రకాశవంతములై విశాలములైన నల్లనినేత్రయుగము; దృఢసంకల్పమును తెలియజేయు గడ్డము, మిక్కిలి జాలియు స్త్రీవిషయమున మార్దవమును సూచించు నిండైన ఎర్రనిపెదవులు గలిగి, చక్కనివాడై, ఒకసారి చూచిన వారికి తిరిగి చూడవలెనను యాశగొలుపుచు, స్నేహపాత్రుడని అందరిచేతా అనిపించుకుంటూ ఉండేవాడు. తలిదండ్రులవలెనే సున్నితమైన వెన్నవంటి మనసుగలవాడు. భూతదయ సర్వసమత్వము గలవాడు. ఏమాట మాట్లాడితే ఎవరిమనసు నొచ్చునో అను భీతితో బహుజాగ్రతతో సంచరిస్తూ ఉండేవాడు. సహజమైన సౌమ్య స్వభావమునకు తోడు, ఇంట్లో తనతోబుట్టువుల కష్టము చూచి, నిర్ధనుల హైన్యముచూచి ప్రపంచమంతా కష్టమయమై ఉండడము చూచి, ఎప్పుడూ విచారంగాఉంటూ, కష్టములో ఉన్నవారిని చూచినప్పుడు తనకు చేతనైన సహాయము చేస్తూ ఉండేవాడు. ఇతనిస్వభావము గ్రహించలేని వాళ్లు ఇతను చాలా మితభాషి అందుచేత గర్విష్ఠి అనుకునేవాళ్లు. పైవాళ్లదాకా ఎందుకు ఇంట్లోవాళ్ళే ఇతనిసంగతి తెలుసుకోలేక ఒట్టివెర్రివా డనుకునేవారు. తన మనస్సు తను ఇతరులకు విప్పిచెప్పుకోడానికి మొహమాటపడి తమంతటతము తెలుసుకునే వాళ్ళెవళ్ళూలేక, కష్టసుఖములు చెప్పుకోడానికి తనమనసులో కలిశేస్నేహితు లెవ్వరేనా ఉంటే బాగుండునని ఎప్పుడూ విచారిస్తూ, ఇంత ప్రపంచములోనూ ఏకాకియై ఉండేవాడు. చిన్నప్పటినుంచి ఏఆటలూ పాటలూ ఎరగడు. ఎప్పుడూ స్కూలికెళ్లడమూ, చదువుకోడము, శలవులలో ఏమేనత్తగారింటికో మేనమామగారింటికో వెళ్ళి పదిహేను రోజులో, ఇరవైరోజులో అక్కడుండి మళ్లి ఇంటికొస్తూ ఉండడం అలవాటయింది.

౨

రాజోల్లో ప్రకాశరావుకి ఒకవేలువిడిచిన మేనమామగారు ఉండేవారు. భమిడిపాటి రామచంద్ర శాస్త్రుల్లుగారని సంపన్నగృహస్థులు పదిమందికలవారు. ఆగ్రామంలో ఉండే బ్రాహ్మణ్యాం అందర్లోకి వంశమర్యాదచేతనైతేనేమి ధనధాన్యసమృద్ధిచేతనైతేనేమి, రామచంద్రయ్యగారే పెద్ద. సాలుకి పదివేల రూపాయలు భూములవల్ల ఆదాయం. సుమారు ఒక్కలకారానికి వడ్డీవ్యాపారం. ఇంటినిండా ఇంటెడుపిల్లలు. తాలూకా తాలూకా అంతా కూడా గొప్పపలుకుబడి. చూడ ముచ్చటగా ఉండేది వారిఇల్లు.

ప్రకాశరావు ప్రతిశలవులలోను తప్పకుండా వారింటికి వెడుతూఉండేవాడు. నిస్సారము, సంతోషవిహీనము అయిన ఇతని జీవితంలో రాజోలుప్రయాణం మట్టుకు అతనికి ఎప్పుడూ సంతోషం కలిగిస్తూ ఉండేది. ఎక్కడచూచినా చక్కనితోటలు ఊరినిచేరి మంచి

నీళ్ల కాలవ, దానిపక్క నే గోదావరి; వీటన్నిటి తోను రాజోలుచాలా అందంగాను వాస యోగ్యంగాను ఉండేది. నీళ్లుచూస్తే ప్రకాశ రావుకి అమిత ఆనందం. ఎక్కడేనా కాలవున్నా చెరువున్నా గట్టున కూచుని గంటలతరబడి నీళ్ల కేసి చూస్తూ ఉండేవాడు. అందులో అతనికి భావనానుకూలమైన బొమ్మలు కనబడుతూ ఉండేవి.

రాజోలు తప్పకుండా వస్తూ ఉండడానికి ప్రబలకారణం, ఇక్కడ కాలవా గోదావరీ ఉండడం ఒకటి. ఇదొక్కటే కాదు. ఇంతకంటె ముఖ్యమైనది ఇంకోటుంది. రామచంద్రయ్య గారికి నలుగురు కొడుకులు ఇద్దరు కూతుళ్లును. ఆ ఆడపిల్లలిద్దరిలోనూ పెద్దది లక్ష్మీదేవి. ప్రకాశంకంటె సుమారు రెండేళ్లు పెద్ద. పిల్లకి నిజంగా సార్థకనామం. సువర్ణచ్ఛాయ, చెంపకు చేరేడు కళ్లు, కోటేరేశినట్లు ముక్కు, ముద్దులొలికే నోరు, విశాలమైన నుదురు, బారెడు జడ, ముద్దులొలికే గడ్డం, దానిపైన ఉన్నపుట్టు మచ్చ, నవ్వితే బుగ్గలికి సొట్టలు. ఇట్టి బాహ్య స్వరూపానికి తోడు ఆంతరంగిక స్వభావం కూడా అట్టిదే. వెన్నవలె కరగు మనసు, ప్రేమ పూరితమైన హృదయం.

ఇంక కావలశిన దేమిటి. అయస్కాంత శిల ఇనుమును ఆకర్షించేటట్లు, ప్రకాశరావుని ఆకర్షించేది లక్ష్మీదేవి. చిన్నప్పటినుంచి ప్రకాశరావుకి లక్ష్మినిచూస్తే ఎంతో ఆనందంగా ఉండేది. కారణమిదని కాని ఆనందంయొక్క స్వభావ మిదనికాని మాత్రం చెప్పడానికి వీలు లేదు. చంద్రబింబం కనబడడముతోనే కలువలు వికసించినట్లు లక్ష్మినిచూడడం తోటే ఇతని కళ్లల్లో ఒకవింత తేజస్సు సంతోషం కనుపించేది. కారణపరీక్ష అతనెప్పుడూ చెయ్యలేదు. కారణంఏమిటి లోపలినుంచి ఏదో పాలపొంగులా వచ్చేది సంతోషం. వసంతం రావడం తోటే కోకిల ఎందుకు పాడాలి, పువ్వును చూడడం తోటే మధుపం ఎందుకు ఝుంకారంచెయ్యాలి, సూర్యదర్శనం కావడం తోటే పద్మం ఎందుకు వికసించాలి కారణం ఉండి ఉండవచ్చును. ఇవన్నిమట్టుకు కారణపరీక్షచెయ్యకుండానే ఈవికారములను పొందుతూఉంటాయి. ఆలాగే ప్రకాశంకూడాను. రాజోలు రావడముతోనే ఒక్కసారి తనకష్టాలన్నీ మరచిపోయేవాడు. నూతనజన్మ ఎత్తినట్టుగా ఉండేవాడు పరమఆప్తుల నెవ్వరినో చూచినట్టు ఉండేది అతనికి, ఈ చిన్నపిల్లని చూడడంతోనే. పోనీ తనకష్టసుఖము లేమైనా చెప్పకునేవాడేమో నంటె అదీలేదు. ఆపిల్లనిచూడడంతోనే చిన్నపిల్లవాడై పోయేవాడు. ఇంటిదగ్గర ఉన్నంతకాలం వయసున పసిబాలుడైనా, మనసులో ముదుసలిలా ఉండేవాడు. ఇక్కడకొస్తేనో ఆపిల్లమాట్లాడుతే చాలు, నవ్వుతేచాలు, చూస్తేచాలు, సంతోషం ఊరికే సంతోషం. సంతోషంతప్ప ఇంకొకటెరుగడిక్కడ——శలవులాఖరై ఇక్కడనుంచివెళ్ళే సమయంవచ్చిందీ అంటే మళ్లీ గుండెచెరువై పోయేది. మహాకష్టం ఏదో అనుభవించబోయేవాడులా ఉండేవాడు.

## 3

లక్ష్మితోడబుట్టిన వాళ్ళు మేనత్తతోడుకూ నర్సాపురంలో చదువుకుంటూ ఉండే

వాళ్లు. వారిసంరక్షణకోసం లక్ష్మిమేనత్త వితంతు వాళ్లదగ్గరుండేది. మేనత్తదగ్గర చనువు గనుక లక్ష్మికూడా తరుచు నర్సాపురంలోనే ఉండి ఆడపిల్లల స్కూల్లో చదువుకుంటూ ఉండేది.

ప్రకాశరావు ఎప్పుడూ శలవు లివ్వగానే ముందు నర్సాపురం వచ్చి అక్కడ నాలుగు రోజులు ఉండేవాడు. అక్కడనుంచి అంతా కలిశి రాజోలు స్టీమర్లోనో పడవలోనో వచ్చేవాళ్లు. ఇంటిదగ్గరనుంచి తెచ్చిన మినపరొట్టో దోవలో కొనుక్కున్న పకోడీలో కారాబూందో వాళ్లిద్దరూ ఓమూలకూచుని తింటూ, మధ్యమధ్య కాస్త గోదావర్లోవేస్తూ, అవి తినడంకోసం వచ్చిన చేపల్ని చూస్తూ ఎప్పుడూ ఇద్దరూ ఇలా పడవమీద వెడుతోంటే బాగుండు ననుకుంటూ "పడవదరి జేరింది దిగండ" నేటప్పటికి, పడవనీ, పడవ్వాళ్లని, దిగమన్న వాళ్లని, తమదుర్భాగ్యాన్ని, తమర్ని సృష్టించిన బ్రహ్మదేవుణ్ణి, తిడుతూ త్వరగా దిగమని తొందరపెడుతూ ఉన్నవాళ్లమీద విసుక్కుంటూ, దిగలేక దిగలేక దిగి, చూపుమేర వరకూ తిరిగి తిరిగి పడవకేశి చూస్తూ, ఆఖరికి బాష్పపూరితమైన ఒక్క నిట్టూర్పు విడిచి మౌనము వహించి ఇంటికి చేరేవారు. ఇంటికి చేరడంతోనే, బాలుర సహజస్వభావంతో పడవసంగతంతా మరచిపోయి ఆటలు ధోరణ్ణి పడేవారు. తెల్లవారుఝామున నాలుగ్గంటలకే లేచి ముందు ఎవరికి మెలుకువ వస్తే వారు రెండోవార్ని లేపి, పెద్దనవ్వు నవ్వుతూ అర్థంలేని మాటలెన్నో చెప్పకునేవారు. తరువాత మొహాలు కడుక్కుని, తలలు దువ్వుకుని, నీళ్ళోసుకుని, లక్ష్మి మేనత్త కలిపెడుతోంటే, ఇద్దరూ ఒక్కకంచంలోనే ఆవకాయేసుకుని పెరుగోసుకుని చద్దన్నం తినేవాళ్లు. ఇంట్లో ఉండే పిల్లలంతా వీధులోకెళ్లి ఇరుగుపొరుగు పిల్లలతోటి ఆడుకొంటూంటే, లక్ష్మి ప్రకాశం మట్టుకు ఓమూలకూచుని, ఆద్యంతాలు లేని కబుర్లు చెప్పకునేవారు. ఇలా ప్రకాశరావు ఇక్కడుండే పదిహేనురాజులో నెలరోజులో వీళ్లిద్దరికీ ఒక్కక్షణంలా గడిచిపోయేది.

ఇంకో నాలుగురోజులకు ప్రకాశరావు వెడతాడనగానే ఇద్దరికీ అన్నహితవులు పోయేవి. ఇద్దరూ మూరెడుపొడుగు మొహాలు చేసుకుని మాటామంతీ లేకుండా కంఠపూర్తి అయి, ప్రపంచమంతా ఇంతటితోటి ఆఖరవుతుందేమో అన్నట్టు, ఒహళ్లకేశి ఒహళ్లు చూస్తూ కూచునేవాళ్లు. ఇహాను బయల్దేరే రోజున చెప్పనే అక్కరలేదు. ఇద్దరూ ఒహళ్లనొహళ్లు కౌగలించుకుని రాగాలెట్టడం; ప్రకాశం వెళ్లడానికి వల్లకాదని కొంతశేపూ, తను కూడా కాకినాడ వెడతానని కొంతశేపూ, లక్ష్మిపడ్చేది. ఎలాగయితేమి వాళ్లని విడదీసి లక్ష్మికి లక్ష్మిప్రసన్నంచేశి, ప్రకాశం మళ్లీ కొద్దిరోజుల్లోనే వస్తాడనిధైర్యంచెప్పి, అతనికి దార్లోకి గార్లు చేశిచ్చి సాగనంపేవారు. ప్రకాశం ఇంటికి వెళ్లిన వారంరోజులవరకూ లక్ష్మి తిండితినక, ఏదో పరధ్యానంగాను, బెంగగాను, మతిపోయినట్టు తిరుగుతూఉండేది. కాకినాడలో ప్రకాశరావుకూడా అదేఅవస్థలో ఉండేవాడు.

౪

లక్ష్మీదేవికి మేనత్త ఒకావిడుండేది. ఆవిడపేరూ నామకరణసమయమందు లక్ష్మీదేవమ్మనే తలిదండ్రులు పెట్టారు. కాని పూర్వాచారాన్నిపట్టి వ్యావహారికంలో అందరూ ఆవిడను లచ్చమ్మనేవారు. లచ్చమ్మ తలిదండ్రులు చిన్నతనంలోనే పోవడం చేత తన దగ్గిరే పెరుగుతోన్న తనమేనల్లుడికే ఇచ్చి వివాహంచేశి తనఇంట్లోనే కూతుర్నీ అల్లుణ్ణీ అట్టేపెట్టుకున్నాడు. లచ్చమ్మగారు కాపురమునకు వెళ్లిన చాలాకాలానికి లేకలేక ఒక్క కొడుకు పుట్టాడు. వెంకట్రామయ్య అతనిపేరు. కొంచెము నలుపు; లోతైనకళ్లు; విశాలమైన నుదురు. కొంచెము పొడుగుముక్కు; అందవికారికాడుకాని ఎక్కువ చక్కనివాడూకాడు. పాపం, చిన్నతనంలోనే తండ్రిపోయాడు. అయినా ఏలోటూ లేకుండా, తల్లీ మేనమామలూ అరిచేతులో పెట్టుకుని అతిగారాబంగా పెంచారు. వెంకట్రామయ్య చిన్నప్పటినుంచీ స్వతంత్రమంటే ఏమిటో ఎరుగడు. ఎప్పుడూ ఒకళ్లమీద ఆధారపడి ఉండడమే. ఏపనీ చేతయ్యేది కాదు. ఆఖరికి అన్నం కలుపుకుని తినడమేనా చేతయ్యేది కాదు. అన్నిటికీ వాళ్లమ్మ ఎంత చెపుతే అంతే. వీథులో కెడుతోంటే ఏ బట్ట కట్టుకోవాలో వాళ్లమ్మ చెప్పాలి. అన్నం తింటోంటే ఏమికలుపుకోవాలో అమ్మ చెప్పాలి. కట్టుకున్న బట్టమాసిపోతే చాకలిదానికి వెయ్యమని అమ్మ చెప్పాలి. అలాఅని తెలివితేటలకేమీ లోటూ లేదు. చదువులో మంచి తెలివితేటలే ఉండేవి.

ఇతను లక్ష్మీకంటె సుమారు పదిపన్నెండేళ్లు పెద్ద అయినా ఇదో పెద్దతేడా కాదనీ, మేనరికం, అందులో ఒక్కడే మేనల్లుడుండగా పైకెళ్లడ మెందుకనీ, రెండోదాని కెలాగూ పైసంబంధము తప్పదు, పెద్దదేనా ఇంటిదగ్గరుండి మేనత్తదగ్గర సుఖపడుతుందని ఆలోచించి, లక్ష్మికి పదోఏడు రాగానే వెంకట్రామయ్యకు ఇచ్చి పెళ్లిచేశారు.

పెళ్లికి ప్రకాశరావుకూడా వచ్చాడు. లక్ష్మికి ప్రకాశానికీకూడా పెళ్లంటే మేళాలూ, తాళాలూ, ఊరేగింపులూ, భోజనాలూ అనేకాని అంతకంటె వేరే యేమీ తెలియదు. తనపెళ్లికి ప్రకాశంకూడా వచ్చాడని లక్ష్మి బ్రహ్మానంద పడిపోయింది. తనస్నేహితురాలికి పెళ్లి అవుతోందిగదా అని, ప్రకాశం సంతోషానికి మేరలేదు. అత్తమానం పెళ్లికూతురు దగ్గరేకూచోడం, పెళ్లికూతురు కదిత్తే కదలడం; నుంచుంటే నుంచోడం. తనకి మామూలుగా లక్ష్మీకంచంలో అన్నంపెట్టడంలేదని మట్టుకు కొంచెం కోపమొచ్చేది ప్రకాశానికి. ప్రకాశంకూడా పల్లకీలో కూచుంటేనే కాని వల్లకాదని లక్ష్మి పట్టుపడుతోండేది. సంబంధంకూడా కొత్తది కాకపోవడంవల్ల మామూలుకంటె, విశేషం బంధువులంతా రావడం, భోగంమేళం దానితోటీ ఈఅయిదురోజులూ ఎక్కువసరదాగా ఉందన్నమాటకాని అంతకంటె పెళ్లని కొత్త ఏమీ లేకపోయింది.

పెళ్లి అయినతరవాత కూడా లక్ష్మీ, ప్రకాశం, మామూలుగా ఒక కంచంలోనే భోంచేస్తూ ఒకమంచంమీదనే పడుకుంటూ

ఉండేవాళ్లు. ఏదేనా కోపమొస్తేమట్టుకు "నీ
ఎంగిలితినన"ని లక్ష్మి వేరేకంచంలో భోంచేసేది.
అప్పుడు ప్రకాశం కొంటెతనానికి ఏఊరగాయి
ముక్కో లక్ష్మికంచంలో పడేస్తే ఉడుకుబో
త్తనం వచ్చి రాగాలెడుతూఉండేది.

ఇలా కొంతకాలమయేసరికి లక్ష్మి పుష్ప
వతియై కాపరానికి వెళ్లింది. ప్రకాశం యథా
ప్రకారంగా వస్తూఉండేవాడు. కాని, మునుప
టికిమల్లే, లక్ష్మి ఎందుచేత తనకంచంలో భోజ
నంచెయ్యడంలేదో, తనదగ్గర ఎందుకు పడు
కోడం మానేశిందో మట్టుకు ప్రకాశాని కర్థం
కాలేదు. పగలు మునుపట్లాగ కబుర్లూ కథలూ
చెప్పుకోడానికి లక్ష్మికి ఇంట్లో ఏదో ఒకపని
ఉండేది. రాత్రిళ్లు మొగాళ్ల భోజనాలైన తర
వాత ఆడవాళ్లతోటి భోంచేస్తూఉండేది లక్ష్మి.
ఈలోపున ప్రకాశం ఏచాపమీదనో పడు
కుని నిద్రపోయేవాడు. తెల్లవారుఝామున
మెళుకువ వచ్చినప్పుడు మామూలుగా లక్ష్మిని
లేపుదామంటే, ఎక్కడా పడుకున్నదో కనపడేది
కాదు. "నువ్వెక్కడ పడుకుంటున్నా"వని రెండు
మూడుసార్లు అడుగుతే, బుగ్గ నొప్పోటుపొడిచి
నవ్వుతూ పరుగెత్తుకు పోయేది. ఈమాత్రం
తనడుగుతే చెప్పకూడదా అని ఉడుకుమో
త్తనం వచ్చి, "మీకోడలెక్కడ పడుకుంటోం
ద"ని లక్ష్మి అత్తగార్ని అడిగాడు. ఆవిడ
పక్కుననవ్వి, "ఎంత వెర్రివాడవోయ్; ఎక్కడ
పడుకుంటుంది; మొగుడుదగ్గిర దక్షిణపుగదిలో
తలుపు బిడాయించుకొని గువ్వలా పడుకుం
టుంది" అంది. అదేమిటి! మొగుడుదగ్గర పడు
కోడమేమి టనుకున్నాడు. పోనీ పడుకుంటే
మట్టుకు, తెల్లవారకట్ల తను లేపడానికి వీలు
లేకుండా తలుపుబిగించుకోడ మెందుకనుకు
న్నాడు. ఎవర్నైనా అడుగుతే నవ్వుతారేమో
అని భయపడి ఊరుకున్నాడు. ఏమనుకుంటే
ఏమిలాభం. ప్రకాశానికి ఇవన్ని చూస్తే వెను
కటి ఉత్సాహం తగ్గింది. ఎలాగో ఎందుచేతనో
లక్ష్మి తనకి దూరమైపోయిందని తెలుసు
కున్నాడు. ఈసౌఖ్యమేనా లేకుండా చెయ్యాలా
దేవుడని విచారించాడు.

చద్దన్నముమాత్రం ఇతను తినేటప్పుడే
తినేదిలక్ష్మి. ప్రకాశానికి రోజూ స్నానానికి
నీళ్లు తోడిచ్చేది. అతని లాగూ చొక్కా ఉతికి
ఆరేస్తోండేది. మధ్యాహ్నం తలదువ్వి జడో
ముచ్చటముడో వేస్తోండేది.

౫

ఇలాగు కొన్ని సంవత్సరములు సామా
న్యంగా జరిగిపోయినాయి. ఒకశుభవారము
నాడు, లక్ష్మి చెల్లెలు రమణమ్మకు పెళ్లయింది.
రాజమహేంద్రవరమునుంచి పెళ్లివారు తర్లి
వచ్చారు. పెళ్లి రెండోనాడు సాయంత్రం ఒక
మూల కూచుని లక్ష్మి ఎక్కెక్కి రాగాలె
ట్టడం మొదలెట్టింది. కారణమేమిటో ప్రకా
శానికే గోచరించలేదు. బోగంమేళం, బ్యాండు
మేళం తోటి మహావైభవంగా పెళ్లవుతోంటే
ఇలా ఎందుకు విచారించా లనుకున్నాడు. తెలు
గీలేమన్నా కుట్టిందా అనుకున్నాడు. ఎన్ని
విధాల తెలుసుకోవలెనని ప్రయత్నంచేశినా,
లక్ష్మి, తనచెయ్యి పట్టుకుని మరింత రాగా
లెట్టడమేకాని కారణం చెప్పలేదు. కారణం
తెలియకపోయినా తన స్నేహితురా లంత

విచారిస్తోంది కదా అని తనకీ కళ్లమ్మట నీళ్లు వచ్చాయి. తనూ ఓగదిలో కూచుని కళ్లమ్మట నీళ్లు కారుస్తూ లక్ష్మి విచారానికి కారణమేమై ఉంటుందా అని ఆలోచించాడు. చెల్లెలత్తవారింటికి వెడుతోందని విచారిస్తోందేమో అనుకున్నాడు. అంతకంటె ప్రబలమైన కారణమేమీ తోచలేదు. సరే ఇందుకేకదా అనుకుని లక్ష్మిదగ్గరకు వెళ్లి పరామర్శించడము మొదలుపెట్టాడు. "నాకు తెలిసిందిలే కారణము"న్నాడు. "సరదాగా దానికి పెళ్లి అవుతోంటే, నీకు విచారమెందుక"న్నాడు. "పిల్లాడి నువ్వేం కష్టపడుతోన్నావ"న్నాడు. ఈ వింతపరామర్శ విని, బిక్కమొహంతో, ఏడుపుమాని, చిరునవ్వు నవ్వి, "చాల్లేవోయి నీకభుర్లూ నువ్వూను, ఎప్పుడూ ఒకలాగే ఉన్నావు" అని చక్కాపోయింది. ఎప్పుడూ ఒకలాగే ఉండడమేమిటా అనుకున్నాడు, పాపం, ప్రకాశం.

పెళ్లి నాలుగోరోజున ప్రకాశానికి ఎందుచేతనో ఏమితోచిందికాదు. ఏదో పిచ్చెత్తినట్టుంది. తనారోజున లక్ష్మిని పరామర్శించింది మొదలు, మళ్లీ లక్ష్మితనకు కనపడలేదు. సాయంకాలం హఠాత్తుగా ఒకసారి కనుపించింది. కనపడగానే పిల్చి, ఓగదిలోకి తీసుకెళ్లి, కూచోమన్నాడు. 'ఎందుకో చెప్పు', నాకు పనుందంది. "పోన్లే నీకంత తొందరపనుండి నాతోటి మాట్లాడడం ఇష్టంలేకపోతే వెళ్ల వచ్చు న"న్నాడు. "అబ్బ, అదికాదోయి! నిజంగానే పనుంది. అదికాకుండా ఎవళ్లైనా వస్తే బాగుండ ద"ంది లక్ష్మి. "బాగుండక పోవడానికిందులో నాకేం తప్ప కనపడడంలేదు. నాకు ప్రపంచకంలో స్నేహితు లెవ్వరూలేరు నువ్వు తప్ప. నీకోసంగదా నేనిక్కడి కొస్తోంట. మునుపటికి మల్లే మాట్లాడడంమానేశావు. పోనీ కనపడనేనా కనపడకూడదా? నువ్వుకూడా ఇంతదూరమై పోతోంటే నాబ్రతుకెలాగ. నేనిక్కడికి రావడంకూడా నీకు కష్టంగా ఉందేమో చెప్పు దాచక. నీకెలా ఇష్టమైతే అలాగే చేస్తాను. నాజీవితమంతా ఇలా కష్టాలతో వెళ్లవలసిందేను. పాపం, నిన్నుకూడా నిష్కారణం కష్టపెట్టడం నాకిష్టంలేదు. నువ్వు రావద్దంటే మానేస్తాను. నేనేమీ అనుకోన్లే, ఉన్న సంగతిచెప్పు" అన్నాడు ప్రకాశం.

అనేటప్పటికి లక్ష్మి నిశ్చేష్టురాలైంది. మొహం ఎర్రపడ్డది. కళ్లల్లో నీళ్లు కమ్మాయి, ఒళ్లు కొంచెం కంపించింది. ఒక్కక్షణం మాట్లాడ కూరుకుని, "ప్రకాశం, నీకు పదిహేనేళ్లు వచ్చినా వట్టి అజ్ఞానుడవు. నువ్వు ఇలా అనకూడదు. నువ్వు రావడం నాకిష్టం లేకకాదు. ఏదోపని తొందరమీద ఉండడముచేత కనబడలేదు కాని, అంతకంటె మరేమీ కాదు. నువ్వు రాకపోతే నాకు చాలాకష్టంగా ఉంటుంది; మునుపటికిమల్లేనే నీతోటి మాట్లాడుతూ కూచోవాలని ఉంటుంది; కాని ఇప్పుడలా వీలులేదు. నువ్వు ఎప్పుడువస్తావనీ ఎప్పుడు కళ్లబడతావనీ మునుపటికి మల్లేనే కనుపెట్టుకుంటున్నాను. నువ్వు వెడుతే మునుపటికిమల్లేను—అంతకంటె ఎక్కువగాను—బాధపడుతూ ఉంటాను. ఇలా అన్నానని మట్టుకు మళ్ళా ఎవ్వరి దగ్గరా అనకు," అని తొందు

కన్నీటిచుక్కలు రాల్చి, వంచిన తల ఎత్తకుండా గిరుక్కున తిరిగి చక్కాపోయింది. తన స్నేహితురాలికి తనమీద దయ పూర్తిగా తప్పలేదుకదా అని సంతోషించాడు ప్రకాశం; కాని, ఈతలవంపెందుకో, ఈకన్నీళ్లెందుకో మట్టుకు అర్థంకాలేదు. ఈరహస్యం కోరడమెందుకో తెలియలేదు. తమకు మిక్కిలిప్రీతి అయిన వస్తువును సాధారణంగా ఎవ్వరూ బహిరంగపరచరు. ఇప్పుడు జరిగిన సంగతి ప్రకాశం ఎవ్వళ్లతోటీ చెప్పదలచుకోలేదు. ఇదింకోకళ్లకి సంబంధించినదికాదు. కాని చెప్పవద్దని ప్రత్యేకం అనడానికి కారణమేమిటో మట్టుకు తెలియలేదు. "అయినా ఈరోజున లక్ష్మిమాటలు కొంత వింతగా ఉన్నాయి ఎందుచేతనా" అని ఆలోచిస్తూ గోదావరిగట్టు వెళ్లి కూచున్నాడు ప్రకాశం.

ఆరోజు చైత్రశుద్ధత్రయోదశి. వెన్నెల చక్కగా చల్లగాఉంది. అప్పుడే పైకి వచ్చుచున్న తరుణచంద్రకిరణములు గోదావరిలో ప్రతిఫలిస్తున్నాయి. చల్లనిగాలి వేస్తోంది. చూపుమేరలో మనుష్యు లెవ్వరూ లేరు. దూరాన్ని ఒక చిన్ననావ నెమ్మదిగా నీటిని చీల్చుకు వెడుతోంది. చిన్నతనపురోజులు జ్ఞాపకం వచ్చాయి. మనసులో ఒకవిధమైన సౌమ్యభావము కలిగి ఒళ్ళు ఒకసారి గరిపొడిచింది. గోదావరిలో చిన్నచిన్న అలలు బయలుదేరి, వెన్నెలలో మిలమిల్లాడుతూ సజీవమై ఉన్న ఒకపెద్ద పాములా ఉంది. చేపలు




జంటలుగా నీటిపైకి ఎగురుతూ పరుగెడుతోన్నాయి. ఆకాశముమీద రెండుపక్షులు దగ్గరగా ఎగురుతూ కూస్తూ గూటికి కాబోలు బహుతొందరగా వెడుతున్నాయి. దగ్గరలో రెండుకుక్కలు చెలగాటాలాడుతూ

ఒకదానిమెడఒకటికౌగలించుకుంటూతమనీడని పట్టుకోవలెనని ప్రయత్నం చేస్తూ ముద్దుగా గంతులేస్తోన్నాయి. వెనుక కాలవగట్టుమీాద కాభోలు కూచుని పాడుచున్న పిల్లవాని పాట హాయిగా వాయుతరంగములమీాద తన చెవిదగ్గరకు చేరుతోంది.

ఇదంతా చూస్తే ప్రకాశానికి మనసులో ఏదో వర్ణనాతీతములైన భావా లుదయించాయి. ఇదివరకు దుఃఖమయంగా ఉన్న ప్రపంచం ఇప్పుడు హఠాత్తుగా ప్రేమమయంగా కనుపించింది. వాయువులో వింత సౌరభం తోచింది. గోదావరీ తరంగాల్లో వింత గానం వినిపించింది. హృదయంలో నూత్న భావాలు సముద్రతరంగాల్లాగ బయలు దేరి ఏదోవింత ఆనందం కలుగచేస్తోన్నాయి. కాని దాని స్వభావంమట్టు కింకా సరిగా తెలియడంలేదు.

తనూ లక్ష్మి చిన్నప్పటినుంచీ ఆడిన ఆటలు, పలికిన పలుకులు, ఇప్పుడు కొత్తగా స్ఫురించాయి. పాలపొంగులాగ హఠాత్తుగా లోపలినుంచి పట్టరాని సంతోషం వచ్చింది. చీకట్లోనుంచి పెద్దవెల్తురులో కొక్కసారి వచ్చినట్లు, గుడ్డివాడికి నేత్రావరోధము పోయి మళ్లీదృష్టివచ్చినట్లు, లక్ష్మికి తనకీ గల సంబంధము హఠాత్తుగా గోచరమైంది. ప్రేమ. తను లక్ష్మిని చిన్నప్పటినుంచి ప్రేమిస్తోనే ఉన్నాడు, అదోవింత కాదు. లక్ష్మికూడా తన్ని చిన్నప్పటినుంచి ప్రేమిస్తోంది. అది లక్ష్మిమాటల కర్థం. ఆకన్నీటి బిందువుల భావ మిది. తననూత్నభావములకు వ్యాఖ్యాన మిది, ఇది స్ఫురించిన కొంత సేపటివరకూ. దీనివలన కలిగిన ఆనందానికి లోబడి పరవశుడై కొంత సేపున్నాడు. తరువాత ఆ ఆనందసమాధిలోనుంచి లేచి ముందుకర్తవ్య మాలోచించాడు. ఒకక్షణంలో అజ్ఞానావస్థలో ఉన్న బాలుడు యౌవనుడుగా మారిపోయాడు. ప్రేమ స్వరూపం అంతా ఒక్కసారి కళ్లకు కట్టినట్టు కనుపించింది. లక్ష్మికి నాలుగైదు సంవత్సరముల క్రితమే వ్యక్తమైన సంగతి ఇప్పటికి తెలిసిం దతనికి.

ఈ ఆనందవార్థిలో అవశుడై ఉండి, ప్రవాహ మెక్కడికి తీసుకువెడితే అక్కడికి వెళ్లడమా లేక ప్రవాహాని కెదురీది తన ఇష్టం వచ్చినచోటికి వెళ్లడమా అని ఆలోచించాడు. ఏది ఎట్లున్నా ఇక్కడనుంచి వెళ్లిపోయి కొన్నాళ్లు మళ్లీ ఇక్కడకు రాకూ[illegible]న్నాడు. తను వెళ్లి[illegible]కుండాఉంటే లక్ష్మి[illegible] ఉంటుందేమో అను[illegible]త్రం అ[illegible]కాశం లక్ష్మికి కలుగచెయ్యడమే న్యాయమనుకున్నాడు. లక్ష్మిమరచిపోవచ్చు. ఎందుకు మ[illegible]చిపోదు, నిక్షేపమల్లే మ్ముగుడున్నాడు. కావలశినంత డబ్బుంది. ఇల్లు; వాకిలి; సంసారము. మరచిపోతుందంటే ఆశ్చర్యమేముంది. కాలం గొప్పవైద్యుడు లాంటిది. అనేక మార్పులు కలిగిస్తుంది. కుదరవనుకున్న మనోవ్యథల నవేకొన్ని కుదురుస్తుంది. కాని తనకుమట్టుకు అటువంటి అదృష్టం పట్టదు. తనేమిచూచుకొని మరచిపోతాడు. తనబాధ యావజ్జీవం ఇలా అనుభవించవలశిందే, ఒకళ్లతోటి చెప్పకోడా

నికి వీలులేదు. ఒకళ్లు తీర్చేదికాదు. అనుభవించక తప్పదనుకున్నాడు. ఈ నిశ్చయంతోటే ఇంటికెళ్లాడు. అప్పటికప్పుడే పెళ్లి వారి అందరి భోజనాలూ అయినాయి. రాత్రి ఊరేగింపుకి బయల్దేరబోతున్నారు. వెంకట్రామయ్యకనబడి, "ఏమిరా, ప్రకాశం అన్నాని కొచ్చావుగావు, ఇంత పొద్దోయేదాకా ఎక్కడి [illegible]" అన్నాడు. "గోదావరిగట్టున కూ[illegible] నాకీపూట ఆకలి లేద"న్నాడు ప్ర[illegible] లేకపోవడమేమిటి; కొంచెము[illegible]. ఇవాళ ఆఖరురోజు, [illegible]దా," మన్నాడు. "నాకాక[illegible]పుకి రాలేన"ని ఒకమూల [illegible], ప్రకాశం. వెంకట్రామ[illegible]డం తోటే తన సంకల్పం [illegible]యింది. మరునాడు మధ్యా[illegible]రితోటే బయలుదేరి, [illegible] చేరాడు.

౬

[illegible]శం [illegible]మే మెట్రిక్యులే[illegible]ప్యాసయి, కలకత్తా చదువుకి వెళ్లాడు. [illegible]వుల్లో ఇంటికొచ్చాడు. కాని రాజోలు మాత్రం వెళ్లేవాడు కాదు. అక్కడిసంగతులు తెలుస్తూనే ఉండేవి. వెంకట్రామయ్య సహవాస దోషంచేతను దుర్వ్యాపారమారంభించాడు. దగ్గరనున్న మానేపల్లిలో బోగందాని నొకదానిని చేరదీశాడు. దాని [illegible]లోపడి ఇంటికి రావడమే మానుకున్నాడు. దానికి పెట్టేడబ్బు కింకమేరేలేదు. తల్లికీసంగతి మొట్టమొదట తెలియలేదు. అప్తమానం చక్కనిబట్టలు వేసుకుని డబ్బు ఖర్చుపెడుతూ తిరుగుతోంటే, ఊరికే నలుగురులోనూ తిరగడం నేర్చుకున్నాడు గదా అని ఒక్కడే పిల్లవాడుగదా అని, ఏమడుగుతే అది ఇవ్వడం మొదలుపెట్టింది. తల్లికి క్రమేణా, ఈసంగతి తెలిశింది. "పోనీ చిన్నతనం కొంచెం జ్ఞానం వస్తే వాడే దార్లోకొస్తాడు, ఇప్పుడు గట్టిగా చివాట్లెడితే కోపమొచ్చి ఏమి అఘాయిత్యము చేస్తాడో" అని కొడుకు ఆటలు సాగించింది. వ్యవహారం ముదిరింది. తల్లి డబ్బివ్వకపోతే పెళ్ళాం మెళ్ళో వస్తువులు తీసుకోవలెనని ప్రయత్నంచేశాడు. తల్లి స్నేహితులు బంధువులు, ఎంతమంది ఎన్ని చెప్పినా వినక ఉంపుడుకత్తెను విడిచిపెడితే దాని గతేమి కానని అడిగాడు.

లక్ష్మి ఒకరోజున మొగుణ్ణి ఇంటిదగ్గర ఉండమని బ్రతిమాలింది. "లేకపోతే నేనెందులోనేనా పడిచస్తానంది" "లోకంలో ఎంతమంది చావడంలేదు. అందులో నువ్వొకత్తెవ"న్నాడు.

ఇవన్నీ ప్రకాశానికి తెలిశి చాలా విచారించాడు. రత్నంలాంటి భార్యను విడిచిపెట్టి బోగందాని దగ్గర ఏమి సుఖం ఉందని, ఇల్లూ వాళ్లూ గుల్ల చేసుకుంటున్నాడు వెంకట్రామయ్యనుకున్నాడు. లక్ష్మి తనకంటె ఒక ఏడాది చిన్నదైనా బాగుండేది. తనుపెళ్ళాడి సుఖపెడుదునుగదా అనుకున్నాడు. ఏమయినా రాజోలు మట్టుకు వెళ్లలేదు. వెంకట్రామయ్య పేర ఒక ఉత్తరం మాత్రం రాశాడు ఇది కానిపనని. లక్ష్మి అవస్థ ఇలావస్తుందని కలలోనేనా అనుకోలేదు. లక్ష్మి తన్నెప్పుడేనా తలు

చుకుంటుందేమో అనుకున్నాడు. లక్ష్మి ఎంత అవస్థపడుతోందో ఎంత విచారిస్తోందో అనుకున్నాడు.

ప్రకాశంమట్టుకు లక్ష్మిని మరచిపోలేదు. అనుదినం తలుచుకుంటూండేవాడు. ఇలా ఉండగా ప్రకాశానికి పెళ్లయింది. లక్ష్మి పెళ్లికి వస్తే బాగుండు ననుకున్నాడు. కాని రాలేదు. బంధువులంతావచ్చారు లక్ష్మితప్ప. రాలేదని చాలా నొచ్చుకున్నాడు.

కలకత్తాలో అయిదేళ్లుండి ఎం. ఏ. పరీక్ష ప్యాసయి, ఇంటికొచ్చాడు. భార్య పెద్దమనిషైంది, కార్యం చేసుకున్నాడు. రాజమహేంద్రవరం కాలేజిలో ఉద్యోగమయింది. అక్కడ తనూ భార్యా ఎంతోముద్దుగా కాపురం చేస్తున్నారు. భార్యఅంటే అతి ప్రేమ. నెత్తిని పెట్టుకుని పూజించేవాడు. ఏవిధాన్ని పెళ్ళాం మనసు నొవ్వకుండా మెలగుతూండేవాడు; కాని లక్ష్మినిమట్టుకు మరచిపోలేదు. నాడు రవణమ్మ పెళ్లినించి వచ్చి సుమారు ఆరుసంవత్సరము లైంది. నాటినుంచి నేటివరకూ ఒక్కసారేనా రాజోలు తొక్కిచూడలేదు. లక్ష్మిని కలుసుకోలేదు. ఎంతో విశ్వప్రయత్నంచేశి మనస్సు సమాధానపరచుకుని అక్కడికి వెళ్లడం మానేశాడు.

వెంకట్రామయ్య అప్పులపాలయి శరీరమంతా పాడుచేసుకున్నాడు. చాలా జబ్బుపడి చావు తప్పి కన్ను లొట్టపోయిందన్నట్లు ఎలాగో బ్రతికి జీవచ్ఛవంవలె, ఎందుకూ అశక్తుడై ఉన్నాడు.

చామర్లకోటలో లక్ష్మి పెద్దన్నగారికి పేరికంపెనీలో పనయింది. అక్కడికోసారి చూడ్డానికొచ్చింది లక్ష్మి. ప్రకాశం పనుండి కాకినాడ వెడుతున్నాడు రాజమహేంద్రవరంనుంచి. చామర్లకోటలో లక్ష్మిఅన్నగారు కనబడి దిగుమని బలవంత పెట్టాడు. అప్పటికి లక్ష్మి అక్కడ ఉన్నట్లు ప్రకాశానికి తెలియదు. తీరా గుమ్మంఎక్కేటప్పుడు తెలిశింది. ఒక్కసారి గుండెకొట్టుకోడం మానేశినట్టుండి, మళ్లీ దడదడకొట్టుకోడం మొదలెట్టింది. అప్పుడు వెనుదీయడానికి వీలులేకపోయింది. కానున్నది కాకమానదని ముందుకి నడిచాడు.

ప్రకాశరావు మునుపటికంటె లావై పచ్చబడ్డాడు. కళ్లకి జోడూ కోటూ వేసుకుని వచ్చేటప్పటికి లక్ష్మి వాకట్లోనే కూచుంది. కాని ప్రకాశరావుని ఆనమాలు పట్టలేక ఎవరోపరాయివాళ్లనుకుని లోపలికివెళ్లింది.

లక్ష్మి మునుపటికంటె నల్లపడ్డది. తల చాలాభాగం నెరిశింది. ముఖంకూడా ఎండగాడ్పు తగిలిన పువ్వులాగ వాడిపోయింది. "లక్ష్మీ! పరుగెత్తకు, నన్ను మరిచిపోయావా ఏమిటి" అన్నాడు ప్రకాశం. అనేటప్పటికి ప్రకాశాన్ని వెనక్కి తిరిగి ఆనమాలుపట్టి, నిశ్చేష్టురాలైంది. కళ్లమ్మట నీళ్లుకమ్మాయి. తలవంచుకొని మాట్లాడలేకపోయింది. ఆమాటా ఈమాటా మాట్లాడి ప్రకాశంఆరాత్రే వెళ్లిపోయాడు. నివురుగప్పిన నిప్పువలె ఉన్న తనపూర్వప్రేమంతా ఒక్కసారి జ్వాలగా పైకొచ్చింది.

కాలంత ననుకున్నట్టుగానే ఈప్రేమ నార్పలేక పోయింది.

మళ్లీ రెండుమూడుసార్లు లక్ష్మినికలుసుకోడం సంభవించింది. మాటలవల్లా చేష్టలవల్లా లక్ష్మితన్నేమీా మరచిపోలేదని తోచింది. దీనివల్ల తనకి మరింత బాధకలిగింది. ఒకపక్క తనభార్యయెడల తనకుగలఅవ్యాజప్రేమ; లక్ష్మియెడల తనకు చిన్నప్పటినుంచి ఎన్నివిధముల ప్రయత్నంచేశినా చల్లారనిప్రేమ ఒకపక్క; అతన్నికలతపెట్టడం మొదలెట్టాయి. లక్ష్మిపొందుకోరుతే తన్నినమ్మకున్న భార్య ఏమంటుంది. కాని ఈవింతేమిటి, నిజమైన ప్రేమ ఉంటే ఇంకొకరిమీద దృష్టిపోదంటారు పెద్దలు. అలాగైతే తనకి భార్యమీద ప్రేమలేదనా? అలాఅని అతనుఒప్పుకోడు. మళ్లీ ఆపెద్దలే దక్షిణనాయకత్వం ఉత్తమనాయక లక్షణంగా గ్రంథాల్లో వర్ణించారు. దోషమైతే అలా ఎందుకు వర్ణించాలి. ఇటువంటి తర్కంతోటి చాలాదూరం ఆలోచించాడు. భార్యమీద తనకు పరిపూర్ణమైన ప్రేమఉంది; కాని భార్యరాకముందునుంచి ఉంది గనుక లక్ష్మిమీద కూడా ప్రేమ ఉంది. అందుచేత లక్ష్మికూడా కావాలని నిశ్చయం చేసుకున్నాడు.

౭

ఇలాఉండగా లక్ష్మి ఋతుశాల ఉందని పిఠాపురంలో దొరసాని చాలాసాధకురాలని అక్కడికి వైద్యాని కొచ్చింది. ఆపరేషన్ చేయించుకుని ఆసుపత్రిలో ఉంది. ఇంక రెండురోజులకు వెళ్లిపోతుందనగా ఒకనాడు మధ్యాహ్నము చూడ్డాని కొచ్చాడు ప్రకాశం. ఇద్దరూ కష్టంసుఖం చాలాశేపు మాట్లాడుకున్నారు. ఇద్దరి మనస్సులలోను ఒక్కటేభావం పైకిరావడానికి కొట్టుకుంటోంది. ఒకళ్లగుండెచప్పుడు ఒకళ్లకు వినబడుతోంది. ఇద్దరూకూడా పైకి చెప్పడానికి ఝడిశి అల్పసంభాషణతోటి కొంతసేపు కాలక్షేపం చేశారు.



ఆఖరికింక పట్టలేక, ప్రకాశం, లక్ష్మిచెయ్యిపట్టుకుని "లక్ష్మి! నీతోటి ఒక్కమాట చెప్పవలెనని ఉంది. చాలాకాలం నుంచి అనుకుంటున్నాను గాని అవకాశం చిక్కిందికాదు

చెప్పకుండా ఉందామని విధితోటి పంతంపట్టి ఇన్నాళ్లూ ఊరుకున్నాను, కాని నేనేఓడిపోయాను. నేను చిన్నప్పటినుంచీ నిన్ను ప్రేమిస్తున్నాను. కాని చాలకాలంవరకు ఆసంగతి తెలుసుకోలేక పోయాను. హఠాత్తుగా రమణమ్మ పెళ్లిలో తెలుసుకున్నాను. పైగా నువ్వుకూడా నన్ను ప్రేమిస్తోనట్లు గ్రహించాను. కాని కొంతకాలం నేను కనపడకపోతే నువ్వు మరచిపోతావేమో అనుకున్నాను. నువ్వు మరవలేదని నాకు తెలుసును. నీవు నాదగ్గర దాచనక్కరలేదు. నేనింక హృదయంలో బాధ దాచుకోలేక ఇప్పుడు చెపుతున్నాను. ఇప్పుడేనా నాహృదయం పూర్తిగా విప్పదలచుకోలేదు. అందులోని అగాధపుప్రేమ బ్రహ్మకుతప్ప మరొకరికి తెలియదు; కాని ఇదిమట్టుకు నిశ్చయముగా నమ్ము. అగ్నిసాక్షిగా పెళ్లాడిన భార్యమీద నాకు ఎంతపూర్తి అయిన పవిత్రమైన ప్రేమ ఉందో అంతపవిత్రమైన ప్రేమ నీమీదా ఉంది. ఇది అసంభవమని కొందరికి తోచవచ్చును. ఇది కేవలము అనుభవైకవేద్యము. అందుచేత లక్ష్మీ! మనరోజులిలా వెళ్లవలసినదేనా! ఇంతకాలంనుంచి సజీవమై చిగిరించుచున్న ఆశాలతను తెంపవలసినదేనా లేక నిర్మూలముకూడా చెయ్యాలా?" అన్నాడు [illegible] తిప్పుకోకుండాను.

[illegible] ప్రశ్నకు వచ్చే సమాధానముపైన [illegible]జీవితమంతా ఆధారపడి ఉన్నట్లు, యవనికవలెనున్న అశ్రుబిందువుల చాటునుండి ప్రేమరసం ముట్టిపడు చూపుతో అతిత్వరితముగ వస్తు[illegible] వేడినిట్టూర్పుచేత కదలుచున్న నాసికాపుటములతో, చలిస్తోన్న అధరముతో ప్రాణము అరచేతపెట్టుకుని లక్ష్మి పెదవులవైపు తదేకదీక్షగా చూస్తూ ప్రకాశరావు అత్యాతురతతో కనిపెట్టుకున్నాడు.

లక్ష్మి తలవంచుకుని వేడినిట్టూర్పులు విడుస్తూ కన్నుల నీరుకారుస్తూ సాంతంగా వింది. మొహమంతా ఎర్రపడ్డది. వొళ్లంతా జ్వరంవచ్చినట్లు కాగడం మొదలెట్టింది. కొంతసేపూరుకుని, దీర్ఘనిశ్వాస మొకటి విడిచి, "ప్రకాశం నారహస్యం నువ్వు తెలుసుకున్నానన్నావు నిజమే ఆమాట; నేను దాచను. నీమీద ప్రేమున్నమాట నిజమే నాజీవితంలో నిన్ను ప్రేమించినట్లు నేనింకొకర్ని ప్రేమించలేదు. నా భర్తని నేను ప్రేమించానని నీతోటి చెపుతే నన్ను నేనే మోసపుచ్చుకున్నట్లుంటుంది. ఆయనితోటి నేపడ్డపాట్లన్నీ అన్నీ కావు. నీవు నాకెక్కువగా కావలశినరోజుల్లో నువ్వుకూడా దూరమైపోయావు. దానితోటి నాబాధ మరింత ఎక్కువయింది. ఇప్పుడు ఆయనయినా నాకు ఏలోటూ లేకుండా నన్ను నెత్తిని పెట్టుకుంటున్నారు. పాపం నేను లేనిదే ఒక్కక్షణం ఆయనకు గడవదు. ఆయన జబ్బులో ఆయన్ని అరిచేతిలోపెట్టుకుని చేశిన చాకిరీ ఇంతా అంతా కాదు. ప్రేమలేకపోతే ఇంత ఎందుకుచేశావంటావేమో. యావజ్జీవము మేము కలిశిఉండవలసినటువంటి వాళ్లము. చిన్నప్పటినుంచి ఒకచోట పెరగడంవల్ల మాకొకవిధమైన స్నేహం ఏర్పడ్డది. స్నేహభావం తప్ప మరొకటిలేదు. అదికాకుండా, తన్ని నమ్ముకున్నవాళ్లని, అందులోభ[illegible]

అత నెంతదురాత్మగ్రుడైనా కష్టంలో ఉన్నప్పుడు ఆడది విడిచిపెట్టలేదు. నాకు ఆయనతప్ప ఇంకోదిక్కు లేదు. నాకు సగంకాలం గడిచింది. వార్ధక్యచిహ్నములు కూడా కనిపిస్తున్నాయి. నువ్విప్పుడు వేశిన ప్రశ్న అయిదారుసంవత్సరముల క్రితమే అడిగిఉంటే, మారుమాటలేకుండా, లోకానికేనా వెరవకుండా నీతో కూడా భూవలయాంతంవరకు వచ్చేదాన్నే. ఇప్పుడు కాలాతీతం అయిపోయింది. ముందు వెనుక లాలోచించే రోజులొచ్చాయి. నీమీాట ప్రేమ తగ్గిందని చెప్పడంలేదుసుమా. అంతకంతకు వృద్ధిలోఉందికాని క్షయంలోలేదు ఆ ప్రేమ. నీకు రత్నంలాంటి భార్య ఉంది. ముందుముందు పిల్లలుకూడా పుడతారు. అటువంటిసమయంలో ఇంకోబండ మెడకి తగిలించుకోడం మంచిదికాదు. నీపురోభివృద్ధికి భంగం వస్తుంది. ఉండు, నామాట కడ్డురాకు. నీకు నీభార్యమీద ఎంత ప్రేమఉందో, నామీదా అంత ప్రేమఉంచన్నావు కావచ్చును. మొగాళ్లల్లో అలా ఉంటుందేమోకాని, స్త్రీకిమట్టుకు అలాకాదు. ఆడదెప్పుడూ తనహృదయాన్ని అలాపంచలేదు. అంతేకాకుండా తన ప్రియుడు లేశమైనా ఇంకొకరిపై ప్రేమ చూపిస్తున్నాడంటే ఆడది సహించలేదు. నిన్ను వదలుకోడం చాలాకష్టంగానే ఉంది నాకు. ఇంత బాధపడుతూకూడా నీమేలుకోరి నిన్ను చేతులారా విడిచిపెట్టుకున్నానంటే, దాన్ని పట్టి నాప్రేమయొక్క పరిణతి తెలుసుకో. ఆఖరుసంగతింకొకటి, శరీరం ఎప్పుడూ ఒకమోస్తరుగా ఉండదు. ఈ వేళున్న పటుత్వం సౌందర్యం రేపుండవు. మకరందం పోవడంతోనే మళ్ళీ పుష్పం దగ్గిరకి తుమ్మెద రాదు. మకరందం ఉంది అంటే పూవుకొంచెమువాడినా, మధుపం ఝంకారం చేస్తూ చుట్టూతిరుగుతోనేఉంటుంది. అలాగే మన ప్రేమ పుష్పంకూడా అనాఘ్రాతమైతే, మనప్రేమ ఎక్కువ శాశ్వతంగా ఉంటుంది. అదిగాక శరీరాన్ని కోరకుండా ఉండే ప్రేమే సరియైనప్రేమ. నీవు మరోలాగ అనుకోకు. నాబాధను మన్నించి ఇంకెప్పుడూ ఇది తలపెట్టకు. కాని నన్నుమట్టుకు మరచిపోకు," అని హృదయవేదనంతా ఒక్కసారి బాష్పరూపకంగా వెడలగ్రక్కింది.

ప్రకాశానికి కూడా కళ్లమ్మట నీళ్లు వచ్చాయి. ఒక్కమాటు నిశ్చేష్టుడై, ఊరుకున్నాడు. ఆఖరికన్నాడు తలవంచుకుని, "లక్ష్మీ! ఈ మోస్తరు జవాబు వస్తుందని నేను స్వప్నంలోకూడా అనుకోలేదు. నీవుచెప్పినదే బాగుంది. నూత్న ప్రపంచానికి నాకళ్లు తెరిచావు.నీపై ప్రేమాగౌరవమూ నాకు ఇప్పుడు వేయిరెట్లెక్కువయింది. నిన్నుఎన్నటికీ మరవడం అసంభవము. నాహృదయపద్మంలో ఎప్పుడూ నిన్ను నిలిపి, నిష్కామమైన ప్రేమ పుష్పములతో నిన్నెప్పుడూ ఆరాధిస్తాను. నిన్నింత కలతపెట్టినందుకు క్షమించి నాకు శెలవియ్యి నేవెడతాను" అని తలఎత్తుకుని, వెనక్కి తిరిగిచూడకుండా, దృఢమైన నడకతో వెళ్లిపోయాడు ప్రకాశరావు.

అతను దృష్టిపథంలోనుంచి వెళ్ళగానే, అతనివైపు చేతులుజాపి, ఒక్కసారి తనలోనే పెద్దరాగా లెట్టింది లక్ష్మి. కొంతేసేపటికి

ర్ను, జగ్గయ్యపేట మున్నగు బౌద్ధక్షేత్రముల విలసిల్లెడివి. త్రివిష్టపము, బర్మా, జపాను, చైనా మున్నగు దేశములనుండి బౌద్ధ యాత్రికులు తరుచుగ నరుదెంచి యీసార్నాదు స్తూపమునుదర్శించి, ప్రదక్షిణములుచేసి మ్రొక్కులిడి పోవుచుందురు. ఈస్తూపము పూర్వము సువర్ణచ్ఛాదితమై మణిస్థగితమై మహోత్కృష్టదశలోనుండెడిది. ఇప్పుడంతయు శిథిలమై నామమాత్రావశిష్టమై యున్నది.



ధామేక్ స్తూపము సార్నాదు

ఇది 104 అ. ఎత్తును సుమారు 310 అ. చుట్టుకొలతయు కలిగియున్నది.



ప్రాచీనాచారము ననుసరించి ఆధునికులు సహగమనముచేసిన స్త్రీల జ్ఞాపకార్థముంచు మృణ్మయపాత్రములు.



# ఆపదుద్ధారక శ్రీరామస్తవము

మంగిపూడి వేంకటశర్మ గారు

వామాంకంబున మబ్బుచెంత మెరుపై వైదేహి రాణింపగా
సామీప్యంబున నిల్చి రెండవపెడన్ సౌమిత్రి దీపింపగా
స్వామీయుంచును పాదయుగ్మముకడన్ సామీరి సేవింపగా
మామై పొంగగ దర్శనంబియవె రామా ! ఆపదుద్ధారకా!

శా. నీలశ్యామలకోమలాంగరుచితో నిండారు శీతాంశునిన్
లీలన్ మించెడు ముద్దుమోము ప్రభతో నిత్యప్రసన్నంబులౌ
వాలుంగన్నులసౌరుతోన వసుధన్ వర్షించు లేనవ్వుతో
మాలోలాత్ముల దన్ప గన్పడవె రామా! ఆపదుద్ధారకా!

మ. ఘను లాదండకలో మునీశ్వరులె యే కళ్యాణపూర్ణ రూపమున్
గనులారం గని తన్విదీరక కడున్ వ్యామోహముగ్ధాత్ములై
యనుమానింపక నానలేక కవుగిళ్లాసించి రా విశ్వమో
హనమౌరూపము జూపవే సదయ రామా! ఆపదుద్ధారకా!

శా. రాతి న్నాతిగజేసె మ్రానిపడవన్ రామామణిన్ జేయదే
నాతండ్రీ భవదీయ పాదరజమున్ న్ నమ్మంగ నెట్లంచు దా
భీతిన్ మించి నిషాదుడున్ గడిగి తప్పెన్ జన్మకే పాదముల్
ప్రీతిన్ జూచెద వాని జూపగదె తండ్రీ! ఆపదుద్ధారకా!

శా. నూత్నోత్సాహముతోడ జానకికి నిన్నున్ బెండ్లి గావించుచో
రత్నస్థాపితమై సువర్ణమయమై రంజిల్లుపళ్లెంబునన్
పత్నీ తానుభజించె నాజనకుడే పాదాబ్జయుగ్మంబు ని
ర్యత్నంబొప్పగ వానిజూపగదె రామా! ఆపదుద్ధారకా!

మ. పవలున్ రేలును నాక యెల్లపుడు సద్భక్తిప్రపూతాత్ముడై
పవమానాత్మజు డంజనీతనయుడే పాదాబ్జయుగ్మంబు నౌ
త్సవ మొప్పన్ మది నిల్పి భక్తమణియై ధన్యాత్ముడై మించె సం
భవ దూరంబులు వాని జూపగదె రామా! ఆపదుద్ధారకా!






## తీర్మానములు

తణుకులో సమావేశమయిన 13 వ ఆంధ్రసాహిత్య పరిషత్కార్యనిర్వాహకసభలో నీక్రింది తీర్మానములు ప్రవేశపెట్టబడెను.

ఈ సంవత్సర మీసభకు మహారాజశ్రీ ఆచంట వేంకటరాయసాంఖ్యాయనశర్మ గారు అధ్యక్షులుగ నుండుటకు తీర్మానించడమైనది. (అంగీకృతము)

కావ్యనిధి చెలికాని లచ్చారావుగారు, వంగూరి సుబ్బారావుగారు కీర్తిశేషులైనందున వారి యకాల మరణమువలన ఆంధ్రభాషకు గవి కొఱంతకు వగచుచు వారికి శాశ్వతానందము కలుగుగాక యని సభవారభిప్రాయ పడుచున్నారు. (అంగీకృతము)

సభ్యులుగాచేరువారు సొమ్ముచెల్లించువరకు సభ్యులుగా నెన్నబడరు. (అంగీకృతము)

ఈక్రిందివారిని సభ్యులుగా నెన్నుకోవడమైనది. ధనము చెల్లించినసభ్యులు పన్నెండుగురు, గౌరవసభ్యులు నలుగురు. (అంగీకృతము)

రుధిరోద్గారి సంవత్సరపు కార్యనివేదనము చదివి ఆమోదింపబడెను. (అంగీకృతము)

గత సంవత్సరము తునిలో జరిగిన తీర్మానము ననుసరించి పరిషత్కార్యస్థానమును ఆంధ్రదేశమునకు వెంటనే మార్పవలయుననియు గత తీర్మానములో "కాకినాడకు" అనుటకు మాఱుగ "రాజమండ్రి"కి అని మార్పవలయుననియు తీర్మానించడమైనది. (అంగీకృతము)

పరిషత్తువారు పరిష్కరించి ప్రకటించిన ప్రాచీన గ్రంథములలోని పాఠములు బుద్ధిపూర్వకముగ మార్చుట ఉచితము కాదనియు, ఇప్పటివరకు ప్రకటించిన గ్రంథములకు అనుబంధములుగా వ్రాతప్రతులలో పాఠములు ప్రకటింపవలెననియు తీర్మానించడమైనది. (అంగీకృతము)

గ్రామ్యముకాని వ్యావహారికాంధ్రభాషలో పూర్వసంప్రదాయము ననుసరించి గ్రంథముల రచియింపవచ్చునని యీసభవారు తీర్మానించుచున్నారు.

ఇటుపైని పరిషద్వార్షిక సభలు జరిగించినప్పుడు ముఖ్యమైన శాస్త్రములను గురించి కళలను గురించి యొక్కొక్కదాని కొక్కొక్కశాఖ యేర్పరచి దానియందు ఆసక్తిగలవారు దానితో సంబంధించిన విషయము సవిస్తరముగా చర్చించుటకు అనుకూలమగునట్లు చేయవలయునని తీర్మానించడమైనది. (అంగీకృతము)

పరిషత్తువారు తలపెట్టిన యుద్యమములు అనేకములు నెఱవేరనందుకు ఈ సభవారు మిక్కిలి విచారించుచున్నారు. (అంగీకృతము)

చందాలు చెల్లింపని సాధారణసభ్యుల పేళ్లు ఈ తారీఖు మొదలుకొని ఆరుమాసములలోగా బాకీపూర్తిగా చెల్లింపకుండిన రిజిష్టరులోనుండి తొలగింపవలయునని యు అట్టివారు మరల సభ్యులు కాగోరినయెడల బాకీయున్న సొమ్ముతోకూడా ముందుగా క్రొత్తచందా చెల్లింపవలయునని తీర్మానము. (అంగీకృతము)

ఆంధ్రగ్రంథాలయ సంఘాధ్యక్షులగు శ్రీసూరి వెంకటనరసింహశాస్త్రి గారు తంజావూరు సరస్వతీ మహాల్ గ్రంథాలయమందు గల యాంధ్రగ్రంథముల వివరణపట్టికను దయారుచేయుటనుగుఱ్చి వ్రాసిన యుత్తరము జదివి అందుకై రు 500 ముందు సంవత్సరము బడ్జెటులో చేర్చుటకు తీర్మానము. (అంగీకృతము)

రాజమహేంద్రవర గౌతమీగ్రంథాలయమువారు తమ భవనమున పఠిపత్కార్యాలయమునకు

దగినంత తావిచ్చెదమని లేఖ వ్రాసియున్నారు గాన ఆ వాగ్దానమునకు వారి నభినందించుచు గ్రంథాలయ సంఘమువారి ఈ తీర్మానము పరిషత్కార్యస్థానమునకు జేరిన ఆరుమాసములలోగా కార్యస్థానమును మార్పుచేయ వలయునని యీసభవారు తీర్మానించుచున్నారు.

(అంగీకృతము.)

కీర్తిశేషులైన శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావుగారి స్థానమునందు శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారిని కార్యదర్శిగ నియమించుచు కార్యస్థానము రాజమహేంద్రవరమునకు మారువరకు మ॥ రా॥ శ్రీ గుమ్మడూరి వేంకటరంగారావుగారు ఇప్పటివలెనే యచ్చటి కార్యక్రమమును జరుపుచుండ వలెనని యీ సభవారు తీర్మానించుచున్నారు. (అం॥)

సాహిత్య పరిషత్తుయొక్క నిబంధనలను ఈ సభలో నామోదింపబడిన తీర్మానానుసారముగా మార్చుటకు ఈ క్రిందివారి నుపసంఘముగా నేర్పరుచుటయైనది. వీరి నివేదికమును ఈ తేది మొదలు ఆరుమాసములలోగా పరిషత్తున కందజేయవలెను.

కార్యదర్శి:—తల్లాప్రగడ సూర్యనారాయణ రావుగారు.

సభ్యులు:—అయ్యంకి వెంకటరమణయ్య గారు, చిలుకూరి నారాయణరావుగారు. (అంగీకృతము)

పరిషత్సభ్యులు చెల్లించవలసిన చందాలు తరగతి వారిగా సంవత్సరమునకు రు. 6, రు. 4, రు.1 చొప్పున నుండవలయుననియు, రు.1 చెల్లించువారికి వోటు నిచ్చు నధికారముమాత్ర ముండవలెననియు, రు. 4 ల నిచ్చు వారికి పత్రికకూడ పంపవలయుననియు, రు. ౬ల నిచ్చు వారి కీయధికారముతోపాటు కార్యనిర్వాహకసభకు ప్రతినిధులుగా నిలుచు నధికార ముండవలయుననియు నీ సభవారు తీర్మానించుచున్నారు. (ఎవ్వరు నంగీకరింప లేదు తీర్మానము త్రోసివేయబడెను.)

రాబోవు ఆంధ్రసాహిత్యపరిషత్సభను గుంటూరు మండలములో జరుపుటకుగాను ఆహ్వానించుచున్నాము. సభవా రామోదింప గోరుచున్నాము. ఉప:—కోన వేంకటరామశర్మగారు, గుంటూరుజిల్లా.(అంగీకృతము)

అధ్యక్షులగు శ్రీయుత ఆదంట వేంకటరాయ సాంఖ్యాయనశర్మగారు పరమశాంతముతోను సమర్థతతోను సభాకార్యక్రమమును మంగళాంతముగనిర్వర్తించినందులకు ఈ సభవారు వారికి హృదయపూర్వక వందనముల నర్పించుచున్నారు. వచ్చిన ప్రతినిధులకు సమస్త సౌకర్యములను గలుగజేసి యాదరించినందుకు ఆహ్వాన సంఘాధ్యక్షులకును కార్యదర్శులకును ఆహ్వానసంఘమునకును వందనముల నర్పించుచున్నారు. (అంగీకృతము)






కాశీనాథుని భైరవమూర్తి గారు

శ్లో. స్థానప్రాప్త్యా సురాణాం కిమపి విశదాం వ్యంజయన్ మంజువీణాం,
స్థానావచ్ఛిన్న తాళక్రమ మమృతమి వాస్వాద్యమానం శివాయామ్;
నానారాగాది హృద్యం నవరసమధురస్తోత్ర జాతానువిద్ధం,
గానం వీణా మహర్షేః, కల మతిలలితం కర్ణపూరాయతాం నః.

(శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యః)

గత సంచికయందు నిరూపింపబడినట్లు ముఖ్యమగు షడ్జమధ్యమ గ్రామముల నేర్పడునట్టి మూర్ఛనల వివర మిందు వ్రాయ బడును.

శ్లో. క్రమాత్ స్వరాణాం సప్తానాం ఆరోహ
శ్చావరోహణమ్, మూర్ఛ నేత్యుచ్యతే
గ్రామద్వయే తా: సప్త సప్తచ.

(రత్నాక శివ॥రత్నాకరములు)

మూర్ఛ నేత్యుచ్యతే తాస్తు ప్రతిమేళంచ సప్తథా. (చతుర్దండిప్రకాశిక పాఠాన్తరం,

క్రమముగ సప్తస్వరములయందలి ఆరోహణావరోహణములు మూర్ఛనలని పిలువ బడుచున్నవి. ఆరోహణమనగ నెక్కుట, అవరోహణమనగ దిగుట. క్రమముగ హెచ్చుస్వరములబట్టుటయే ఎక్కుటగును: అనగ 'సరిగమపధని' ఇట్లు పట్టుట. దీనిని తిరిగి దిగువకు బట్టుట నిధపమగరిస 'దిగుటయగును' ఇదియే అవరోహణము, ఇవి జగద్విదితమే. శ్రోతలను మూర్ఛిల్ల జేయునట్టిది గనుక మూర్ఛనయని పేరందినదనియు గలదు. షడ్జము మొదలు నిషాదాంతమువరకును ఆరోహణమువలన బ్రథమ మూర్ఛన కల్గుచున్నది, పిమ్మట ఋషభాది పైస్థాయి షడ్జాంతమువరకు నారోహణమందు గ్రమముగ ద్వితీయమూర్ఛనయును నిట్లే వరుసగ గాంధారాదిగ నారంభించి ఆరోహణావరోహణ ప్రత్యేకమూర్ఛన లేర్పడుచున్నవి.

| ఆరోహణము | అవరోహణము |
|---|---|
| సరిగమపధని | నిధపమగరిస |
| రిగమపధనిస | సనిధపమగరి |
| గమపధనిసరి | రిసనిధపమగ |
| మపధనిసరిగ | గరిసనిధపమ |
| పధనిసరిగమ | మగరిసనిధప |
| ధనిసరిగమప | పమగరిసనిధ |
| నిసరిగమపధ | ధపమగరిసని |

ఈతీరున డెబ్బదిరెండు మేళకర్తలలో నొక్కొ-కదానియందునసీమూర్ఛనలను వేంకటమఖియనువారు తమ చతుర్దండిప్రకాశికయందు నిరూపించియున్నారు.

శ్లో. షడ్జే తూత్తరమంద్రాదా రంజనీ చోత్తరాయతా, శుద్ధా షడ్జా మత్సరీకృత్, అశ్వక్రాన్తాభిరుద్గతా. అభిరూహితాయని పాఠాన్తరం.

1. తద్యథా: మధ్యమస్థానాః మధ్యస్థాన షడ్జాత్ సరిగమపదనీతి ప్రథమమూర్ఛనా- అనగ-సరిగమపదని.

2. తస్య షడ్జస్య పశ్చాత్ స్థితమంద్ర నిషాద మారభ్య క్రమా త్పూర్వం నిసరిగమపధేతి ద్వితీయమూర్ఛనా: నిసరిగమపద

3. మంద్రధైవత మారభ్య తృతీయ మూర్ఛనేతి: ధనిసరిగమప.

4. మంద్రపంచమ మారభ్య చతుర్థ మూర్ఛనేతి: పధనిసరిగమ.

5. మంద్రమధ్యమ మారభ్య పంచమ మూర్ఛనేతి: మపధనిసరిగ.

6. మంద్రగాంధా రాదారభ్య షష్ఠ మూర్ఛనేతి: గమపధనిసరి.

7. మంద్రఋషభా దారభ్య సప్తమ మూర్ఛనేతి: రిగమపధనిస. (శివతత్త్వరత్నాకరం)

వీటికిపరుసగ 1. ఉత్తరాయత, 2. ఉత్తరమంద్ర, 3. రంజని, 4. మంజరి, 5. అశ్వక్రాంత, 6. అభిరూహిత, 7. శుద్ధషడ్జ. అనియు నామములు నేర్పఱచియున్నారు.

శ్లో. మధ్యమే స్యాత్ సౌవీరీ హారిణీస్యాత్తతఃపరమ్, స్యాత్ కలోపనతా శుద్ధ మధ్యమార్గీచ పౌరవీ, హృష్యకేత్యధ తాసాంతు లక్షణం ప్రతిపాద్యతే, మధ్య స్థానస్థషడ్జేన,మూర్ఛనారభ్యతేఽ గ్రిమా॥ అధస్తైస్తై ర్నిషాద్యైశ్చ షడన్యా మూర్ఛనాః క్రమాత్, మధ్యమధ్యమ మారభ్య సౌవీరీ మూర్ఛనా భవేత్, షడన్యాస్తదధోఽధస్తాత్, స్వరా దారభ్యతు క్రమాత్;షడ్జస్థానస్థితై ర్న్యాద్యైః రంజన్యాద్యాః పరే జగుః, హారిణాశ్వాదికాన్యాద్యైః మధ్యమస్థాన సంశ్రితైః, షడ్జాదీన్ మధ్యమాదీంశ్చ తదూర్ధ్వాం స్సారయేత్ క్రమాత్, చతుర్థానాం పృథక్ శుద్ధాః కాకలీకలితా స్తథా, సాన్తరాస్తద్వయోపేతాః షట్పంచాశదితీ రితాః శ్రుతిద్వయంచేత్ షడ్జస్య నిషదః సంశ్రయేద్యథా,సకాకలీమధ్యమస్య గాంధారః స్వాన్తరః స్వరః, యస్యాయావతిదా షడ్జ మధ్యమా గ్రామయోః క్రమాత్,మూర్ఛనామతిధ్యేవ సానిశ్యంకేనకీర్తితా, ప్రథమాదిస్వరారంభాత్ ఏకైకః సప్తధా భవేత్,తాసూచ్చార్యాన్తస్వరాన్తాన్ పూర్వానుచ్చారయేత్క్రమాత్, తేక్రమా

స్తేషుసంఖ్యాస్యాద్ద్వినవత్యా శతత్రయం. యక్షరక్షో నారదాబ్జభవ నాగాశ్వ పాశినః. షడ్జగ్రామే మూర్ఛనానా మేతాః స్యు ర్దేవతాః క్రమాత్, బ్రహ్మేంద్రవాయు గాంధర్వ శివద్రుహి ణభానవః, స్యు రిమా మధ్యమగ్రామే మూర్ఛనాః దేవతాః క్రమాత్, తాసా మన్యాని నామాని నారదో మునిర బ్రవీత్, మూర్ఛనో త్తర మంద్రాద్య షడ్జగ్రామే సముద్గతాః, అశ్వక్రాన్తాచ సౌవీర, గతా చో త్తరాయతా, రంజనీతి సమాఖ్యాతా ఋషీణాం సప్తమూర్ఛనాః, అప్యాయనీ విశ్వహృతా చంద్రా హైమీ కపర్దినీ, మైత్రీ చాంద్రమసీ పిత్ర్యా, మధ్యమే మూర్ఛనా ఇమాః, నందావిశాలా సుముఖీ చిత్రా చిత్రవతీ సుఖా, ఆలాపాచేతి గాంధార గ్రామే స్యుః సప్తమూర్ఛనాః, తాశ్చ స్వర్గే ప్రయోక్తవ్యాః విశేషా త్తేన నోదితాః.

(సంగీతరత్నాకర శివతత్త్వరత్నాకరములు)

పైన జెప్పినరీతిని మధ్యమ గ్రామమున గల్గుమూర్ఛన లుదాహరింపబడును.

1. తద్యథా: మధ్యమమధ్యమమారభ్య ప్రథమ మూర్ఛనా: మ ప ధ ని స రి గ
2. పశ్చాత్ గాంధార మారభ్య ఇతి ద్వితీ యమూర్ఛనా: గ మ ప ధ ని స రి
3. పశ్చా దృషభ మారభ్య తృతీయమూర్ఛ నా: రి గ మ ప ధ ని స
4. పశ్చాత్ షడ్జ మారభ్య చతుర్థమూర్ఛనా: స రి గ మ ప ధ ని
5. పశ్చా న్మంద్రనిషాద మారభ్య పంచమ మూర్ఛనా: ని స రి గ మ ప ధ
6. పశ్చా న్మంద్రధైవత మారభ్య షష్ఠ మూర్ఛనా: ధ ని స రి గ మ ప
7. పశ్చా న్మంద్రపంచమ మారభ్య సప్తమ మూర్ఛనా: ప ధ ని స రి గ మ

యీమధ్యమగ్రామ మందలమందలిమూర్ఛనలకు వరుసగ, (1) సౌభరి, (2) ద్రపీరాశ్వ (3) కాలోపాన్త, (4) నటికా, (5) శుద్ధమధ్యా, (6) ఇష్ట, (7) పౌరవి, అని నామములు కలవు.

ఇట్లే గాంధారగ్రామమందలి మూర్ఛనలకు వరుసగ, (1) నన్దా, (2) విశాలా, (3) సుముఖీ, (4) చిత్రా, (5) చిత్రవతీ, (6) సుఖా, (7) ఆలాపా అను నామములనిడియుండిరి. ఇవి నాకౌకసుల కుపయుక్తము లనియు వారికే మిగుల రంజకములనియు నుడివియున్నారు.

మరియు షడ్జగ్రామమూర్ఛనలకు క్రమముగ యక్ష, రక్షో, నారదా, బ్జభవ, నాగాశ్వపాశు లధిదేవత లనియు గలదు.

ఇట్లే మధ్యమగ్రామమూర్ఛనలకు క్రమముగ బ్రహ్మేంద్రవాయు గాంధర్వ శివద్రుహిణభానులు, వీర లధిదేవతలనియు నిరూపించిరి. ఇదియునుగాక నిషాదవర్జ మూర్ఛనలు అనగ నారుస్వరములు గలవి, ఇట్లే రెండుస్వరములు లేకుండ నైదుస్వరములు గలవి, నాల్గుస్వరములుగలవి,మూడుస్వరములుగలవి, రెండు స్వరములుగలవి కూడ నగును. వీటివివరము ముందుసంచికలో వ్రాయబడును.

నిషాదవర్జ మూర్ఛనాః.

ప్రథమమూర్ఛనా: — ధ ప మ గ రి స
ద్వితీయమూర్ఛనా: ధ ప మ గ రి స —
తృతీయమూర్ఛనా: ప మ గ రి స — ధ
చతుర్థమూర్ఛనా: మ గ రి స — ధ ప
పంచమమూర్ఛనా: గ రి స — ధ ప మ
షష్ఠమూర్ఛనా: రి స — ధ ప మ గ
సప్తమమూర్ఛనా: స — ధ ప మ గ రి

వీటికి క్రమముగ (1) జాతుర్మాస్య (2) సంవాస్య, (3) అర్ధ, (4) చతుర్థ (5) సౌత్రా మణి, (6) చిత్ర, (7) ఉద్భిద, యనునామ ముల నేర్పఱచిరి.

పై మూర్ఛనా స్వరములందు'—'ఇట్టి గీత గలచోట "ని" లోపమని ఎఱుంగునది.

దీపకరాగము యొక్కయు తద్రాగిణుల యొక్కయు లక్షణాదికము లిం దుదాహరింప బడినవి.

దీపకరాగము:

శ్లో. షడ్జగ్రహాంశ కన్యాసా సంపూర్ణో దీప కోమతః, మూర్ఛనా శుద్ధమధ్యాస్యాత్ జాతః ప్రాగ్గాయకైస్సదా.

'గాతవ్యాగాయకైస్సదా' అనిపా. సం॥ దర్పణం.

శ్లో. బాలారతార్థం విరత ప్రదీపే గృహాంధ కారే సుభగప్రవృత్తా, తస్యా శ్శిరోభూ షణ రత్నదీపైః లజ్జాం ప్రకుర్వన్ కథితః ప్రదీపః. సం. దర్పణం.

పాఠాన్తరం.

శ్లో. బాలారతార్థం ప్రవిలీనవేషా గృహేఽంధ కారే సుభగం ప్రవృత్తః, తస్యా శ్శిరోభూ షణ రత్నదీపై ర్లజ్జాముదగ్రాం కృతవాన్ ప్రదీపః.

"లజ్జా ప్రదీప" అనుటకు "లజ్జాంవధో దీపక రాగరాజః" అనియు గలదు.

శ్వేత త్వతాత్పర్యము.

ఈరాగరూపము నిట్లు వివరించిరి. గజా రోహణము గావించి, చక్కనియువతీమణు లచే పరివృతుడై, ఎఱ్ఱనిమైచాయగల్గి, అరు ణకాంతిగల వలువలదాల్చి కేశములుదిగజార, ఆణిముత్యపుసరులధరించి మధురగానముజేయు చున్న సుందరపురుషాకారము గలదనిరి. మరి యు గొందఱు గృహాభ్యన్తరమున గాఢాన్ధ కారమున నుండియు, తన ప్రియురాలితో గ్రీడిం చుచు దనశిరోభూషణ రత్నదీపకాన్తులచే నామెను లజ్జాక్రాన్తగా జేయుచున్నట్లు వివ రించిరి.

దీనికి స్వరము:—స రి గ మ ప ధ ని స
(సం॥ దర్పణం. [...])

కేదారి, కేదారము, కేదార రాగిణీ:

కేదారి రిధహీనాస్యాత్ ఔఢవా పరికీర్తితా, నిత్య్రయామూర్ఛనామాన్తకాకలీస్వరమండితా

శ్లో. జటాం దధానా సితచంద్రమౌళీ నాగో త్తరీయా ధృతయోగపీఠా, గంగాధర ధ్యాననిమీలితాక్షీ కేదారరాగా కథితా తపస్వీ.

"యోగపట్టా" అనియు, "నిమగ్నచిత్తా" అనియు, "కేదారికా దీపకరాగిణీయు" మని యు పాఠాన్తరములు.

రాగిణీరూపము:—జటాజూటమందు గంగ గల్గి, కొన్ని జడలు వీపుపై బడినట్లు నుండుటచే యతీశ్వరాకృతిగ నుండుననియు;

పాముకుబుసమును భుజములమీఁదదాల్చి ఆ కర్ణాంతాయతములగు నేత్రములచే మిగుల చక్కని రూపసియై, భస్మాంగలేపనము గావించి ధ్యానసమాధియందు మంత్రానుష్ఠానము చేయుచు నడవియందు గూర్చుండుననియు చంద్రునివలె ముఖవర్చస్సు వెల్గుచుండుననియు గలదు.

స్వరము:—ని స గ మ ప ని

కర్ణాట, కాన్హారా, కన్నడా, కానడా:

శ్లో. త్రినిషాధ సంపూర్ణా నిషాదో వికృతోభవేత్, మార్గీచ మూర్ఛనాజ్ఞేయా కర్ణాటేయం సుఖప్రదా.

శ్లో. కృపాణపాణి ర్గజదంతపత్త్రం ఏకందధత్ దక్షిణహస్తకేన, సంస్తూయమానాసురచారణౌఘైః కర్ణాటికేయం శిఖిపాలమూర్తిః (శ్రీ రత్నాకరః)

"దక్షిణకర్ణమూలే" అనియు "సాకాన దేయం కిలదివ్యమూర్తిః" అనియు పాఠాంతరములు.

రాగిణీరూపము:—నీలశరీర కాన్తి గల్గియు శ్వేతవస్త్రముల ధరించి దక్షిణకరమున కరవాలమును, వామకరమున గజదంతమును బూని, పుష్పమాలికలదాల్చి, సుగంధము నలమి; తన యుద్యానవనమున సూర్యోపాసన సల్పుచున్నట్లుండును. కొందఱిమతమున గజదంతము నూడపెరికికొనినందున మరల తన కిచ్చుటకై ప్రార్థించుచున్న యేనుగు గల్గియున్నట్లు వర్ణించిరి. మఱియు కొందఱు పురుషాకృతిదాల్చి కవీశ్వరులచే స్వయశోగానమును వినుచున్నట్లున్నదనిరి.

స్వరము:—ని స రి గ మ ప ధ ని

దేశ్, దేశీరాగిణి:

శ్లో. దేశీ పంచమహీనాస్యాత్ ఋషభత్రయసంయుతా, కపోలలతికాజ్ఞేయా మూర్ఛనావికృతర్షభా.

శ్లో. నిద్రాలసం సా కపటేనకాన్తంవిబోధయన్తీ సురతోత్సవాయ, గౌరీమనోజ్ఞాశుకపింఛవస్త్రా ఖ్యాతాచ దేశీ రతపూర్ణచిత్తా.

"శుకపుచ్ఛ"యనియు,"రణపూర్ణచిత్తా" యనియు పాఠాంతరములు.

రాగిణీరూపము:—అరుణాభములగు వలువలదాల్చి స్ఫాటిక స్వచ్ఛమగు దేహకాన్తి గల్గి, సర్వాభరణభూషితయై పరభృతతుల్యమగు కంఠారవముగల్గి, తనసౌందర్యమునకును వయస్సునకును మిగుల గర్వితయైనట్లును, కరమున వీవనదాల్చి మోహోద్రేకమున భర్తృసముఖమ్మున నుండినట్లును వర్ణించిరి. కొందఱు, సగము నిద్రించియు సగము మేల్కాంచియు నర్ధనిమీలితలోచనయై తనచేతిమీఁద వ్రాలిన శుకాలాపముల నాలకించుననియు నిరూపించిరి.

స్వరము:—రి మ ధ ని స రి, రి గ మ ధ ని స రి అనియు గలదు.

కామూద్, కాంభోజి, కాంబోది, కామోదీ:

శ్లో. ధాంశన్యాస గ్రహాపూర్ణా పౌరవీ మూర్ఛనా మతా, మల్లారీ నికటా జ్ఞేయా కాంభోజీతి నిగద్యతే.

శ్లో. పీతం వసానా వసనం సుకేశీ వనేరుదన్తీపికనాదమానా, వినోదయన్తీ విదితాచ భీతా కామోదకీ కాంత మనుస్మరంతీ.

"విలోళ నేత్రీ"యనియు "సుకేశీ"యనియు పాఠాన్తరములు.

౭౦. రాగిణీరూపము:— సువర్ణపుకాంతి గేరు మైచాయగల్గి, రక్తాంబరముల ధరించి, తెల్లని మేలిముసుగు వల్లెవాటుదాల్చి, పికకంఠము ననుకరించు శ్రావ్యమగు గానమును బాడుచు వనాన్తప్రాంతములందు సంచరించుచుండునని యు, భర్తృవియోగదుఃఖాకులచిత్తయై, భర్త్రాగమనమును నిరీక్షింపుచు ప్రతినిమిసమును నాతనినే సంస్మరింపుచు, వృక్షచ్ఛాయను చదికిలబడి, ముఖమును జేతులగప్పికొని అశ్రువుల రాల్చుచుండుననియు గలదు. అనగ భర్తృవియోగదుస్సహజనితోద్వేగ మానసయగు రూపము. గనుకనే రామరాజభూషణుఁడుకూడ "కాంభోజీరా"గమ్మున నేడ్చినట్లు వారి గ్రంథమున వ్రాసియున్నారు. ఇదియుజగద్విదితము.

దీనికి స్వరము:— ధ ని స రి గ మ ధ, ధ ని స రి గ మ పధ.

నాటరాగిణి:—

శ్లో. గ్రహాంశన్యాసషడ్జాస్యాత్ సంపూర్ణా నాటికామతా, ప్రథమా మూర్ఛనాజ్ఞేయా గమకైర్బహుభిర్మతా.

శ్లో. తురంగమస్కంధ నిషక్త బాహుః స్వర్ణ ప్రభాశోభితశోణగాత్రా, సంగ్రామభూమౌ విచరన్ ప్రతాపైః నాటాయముక్తాకిల శృంగమూర్తీ.

"నిషణ్ణ"యనియు, "శోణిత"యనియు "విచరన్ ప్రతాపీ" యనియు "రాగమూర్తిః" యనియు పాఠాన్తరములు.

రాగిణీరూపము:— హరిద్రాచూర్ణాభ తుల్య దేహకాన్తిగల్గి, రక్తాంబరముల ధరించి, హంసగమనము గల్గి, ప్రాణనాథుని కానంద మొందజేయుటయందతిసమర్థతగల్గి ఏనుగు వీపుపై చేయివైచికొని తనచేటికలతోగూడి నాట్యశాస్త్రాభ్యాసముగావింపుచుండునట్లు వివరించిరి. మరికొందరు. పురుషవేషముదాల్చి అశ్వారూఢయై దక్షిణకరమున కరవాలమును, వామహస్తమున శత్రుమస్తకమును బట్టియున్నట్లును, శత్రునిమొండెము నేలపైబడియుండినట్లును తత్సమీపమున నొకడు కత్తిని డాలును ధరించి నిలబడియున్నట్లును, యీామె కోపోద్దీపితయై యున్నట్లును వర్ణించియున్నారు.

దీనికి స్వరము:— స రి గ మ ప ధ ని స, స ని ధ ప మ గ రి స.






రావుసాహెబ్ గిడుగు రామమూర్తి పంతులుగారికి

విద్వాన్ గరిమెళ్ల సోమన్న ఎం. ఏ., ఎల్. టి.

శ్రీ రామమూర్తి పంతులుగారు వైశాఖ "భారతి"లో ప్రకటించినవ్యాసమును జదువఁగా నాకుఁ గొన్ని సంశయములు కలిగినవి. వాని నిందుఁ జూపుదును.

"నిత్యమున్ను జనులందరూ వాడుతూ ఉన్నభాష రద్దుచేసి గ్రాంథికభాషను నెలకొలుపరా" దనిగదా పంతులుగారి యభిప్రాయము. వ్యవహారభాషకును గ్రాంథికభాషకునుగల యెడమును తగ్గించుట మిక్కిలి యవసరమె. వాడుకమాటలతోఁ జెప్పిన విషయము సులభముగ మనసునకు వచ్చును. దేశములోని ప్రముఖులు కూడి యవసరము లగు క్రొత్తనియమములను ఏర్పఱుచుటయే కార్యసాధనము.

చేసేవారు, ధనమున్ను, తెలుసుకొను, నలభై, చెప్తాను, అయితే, వస్తాను, మున్నగు ప్రయోగములు ఇంచుమించుగ దేశమునం దెల్లెడల వినిపించును. ఇవి భాషను వదలవు. వీనికి శుద్ధపత్త్రిక ఈయఁదగినదియే. ఇట్టి ప్రయోగములను మాని ప్రసంగింపఁబూనుట ముళ్లపై నడచుట వంటిదే. గ్రాంథికభాషాపక్షులకును ఈసంకటము విదితమే.

ఇచ్చట నొక సంశయము. ఈ ప్రయోగములను పద్యకావ్యములలోఁ గూడ వాడవలయునని శ్రీపంతులుగారు అందురా? ఇఁక మఱికొన్ని ప్రయోగములను బరీక్షింతము. యీమనిషి, ఆవూరు, నువ్వు (నీవు), వాడొస్తే, ఏం జేస్తాడు, వక్కడు, ఒద్దు (వలదు), నువ్వెళ్లి (నీవువెళ్లి), వెళదాం, తీసుకుని, కూర్చున్నాను, వెళ్లాలి, చదవడం, చదవటం, చదవడానికి, కొనుక్కున్నాను, ఉంది (ఉన్నది), పడ్డాయ్ (పడినవి), భయపడుతోంది (భయపడుచున్నది), వెళ్లేడు, పడుకున్నాడు, ఎప్పుడొచ్చావు, (వచ్చినావు), కఠినంగావుంది, పోయింది, ఏడిశాడు (ఏడిచినాఁడు), నాను (నేను), చెబతాను (చెప్పెదను), వాఁడిని రమ్మను, ఇచ్చేస్తే (ఇచ్చి వేసినన్), ఒచ్చాడా (వచ్చినాఁడా?)——ఇట్టిప్రయోగములు నిత్యము జనులు వాడునవియే. ఈప్రయోగములను శ్రీ పంతులుగారు ఒప్పి వీనికి శిష్టత్వముం గూర్తురా? వీనిని పద్యకావ్యములలో వాడుదురా? మఱియొక తెగమాటలను జూతము. అనేకసార్లు, ప్రతిచెట్టు, ఇతరఖర్చులు, గర్భగుడి, నిత్యారాబడి, దారాపుత్త్రులు, తాతాసహోదరులు, కాపరస్థుడు, వ్యవసాయదారుడు, స్వంతదారుడు, స్వంతకార్యము, నామకావ్యవహారము, బేహక్కు——మున్నగు పదములను సాధుపదములు

గ్రహించి శ్రీపంతులుగారు వీనిని సలక్షణములని వ్యవహరింతురా?

ఇఁక సంస్కృత పక్షమును బరికింతము. 'వ్యావహారిక భాషాబహిష్కార నిరసనము' ఇట్టి దీర్ఘ సమాసములకు తెలుఁగున దావుండఁ దగునా? ఇట్టి సమాసములకు అవకాశ మిచ్చినచో సంస్కృత జ్ఞాన మెంతయో కావలసి యుండును. దీనిచే భాషకు సౌలభ్యము సిద్ధింపదు. తెలుఁగు రావలెనన్న సంస్కృతము కూడ విపులముగ ఎఱుఁగవలసియే యుండును. భాషను సులభపఱుచుట యుద్దేశ్యమగునేని సంస్కృతముపై నాధారము తగ్గవలయును. తెలుఁగులో లేని పదసామగ్రిని సంస్కృతమునుండి గ్రహింపనగును గాని సంస్కృతములోని సంధి, సమాసము, తద్ధితము మున్నగునవి అనివార్యమగునటుల తెలుఁగును నిరూపింపఁజనదు. సంస్కృతసంధి సమాసస్త్రీప్రత్యయ తద్ధితాదులు విశేషపరిశ్రమచేఁగాని గ్రాహ్యములుగావు. ఈ సంస్కృతాధారము విషయమై శ్రీపంతులుగారు ఏమి నియమములను జేయనెంతురు?

వస్తారు, చెపుతూఉన్న, అయితే, చదవడము, మున్నగు రూపములను ఒప్పినంత మాత్రాన మన భాషకుఁ గ్రొత్తవికాసము కలుగునా? ఇదియొక గొప్ప ప్రశ్న. మన భాషలో ప్రకృతిశాస్త్రములు చరిత్రలు పారిశ్రామిక గ్రంథములు నూతనవైద్యవాస్తు జ్యోతిషాది విషయములపైఁ బుస్తకములు మున్నగునవి వెలువడకుండుటకు ఈ వ్యావహారికపదత్యాగమేనా కారణము? కాదు. ఈభాషాదారిద్ర్యమునకు, ఈ వాగ్రోగమునకు, ఈ విజ్ఞానాభావమునకుఁ గారణము వేఱుగనున్నది. బడులలో విదేశభాషలోఁ జదువు చెప్పుటయు రాజకీయాది వ్యవహారములు మాతృభాషలో జరుపకుండుటయును ఈ ఘోరవిపత్తునకుఁ గారణము. దేశాభిమానులు, ప్రాజ్ఞులు, ప్రభువులు ఈ ప్రతిబంధములను దొలగించినచో ఈ స్వల్పప్రాతికూల్యములు వానియంతట అవి జారిపోవును. అన్ని తరగతుల బడులలోఁ బాఠప్రవచనపరీక్షలు మాతృభాషలో జరుగునపుడు, రాజకీయాది వ్యవహారములు దేశభాషలో జరుగునపుడు, దేశమునందలి ప్రజలు- ప్రముఖులును, సామాన్యులునుకూడ-స్వభాషలో ఉత్తరములు జరుపునపుడు, ఆభాషకు విజృంభణమును గౌరవమును గలుగును. ఆభాషయొక్క వాఙ్మయము సర్వవిధముల వృద్ధిఁ జెందును. 'I am angry upon you' అనినచో ఇంగ్లీషుచదివిన మనవారు గొప్ప తప్పుగ నెంతురు. 'చేశీశాయుంగలవిన్నపములు' 'మనం యెప్పుడు బయలుదేరాలో' అని వ్యవహరించుట తప్పనియే మనము- అనగా ఇంగ్లీషుపండితులలో పెక్కండ్రము ఎఱుఁగము. జనసామాన్యమునుగుఱించి చెప్పఁ బనిలేదు. తప్పులు ఎన్ని ఎక్కువగనుండిన అంత గౌరవము వ్యవహారభాషకుఁ జూపఁబడుచున్నది. ప్లీడర్లు, తహసీలుదార్లు, మేజస్ట్రేటులు, మునసబులు, రిజస్ట్రారులు, ప్రొఫెసర్లు, మేస్టర్లు, కౌన్సిలు మెంబర్లు, బోర్డుమెంబర్లు, పంచాయితీమెంబర్లు, గ్రాడ్యుయేటులు, స్కూలు ఫయినలు విద్యార్థులు, ఇట్టివారందఱిలో నూటికి ముగ్గురయినను సలక్షణముగ, తప్పులులేని తెలుఁగు వ్రాయఁజాలకున్నారు. తప్పేదియో ఒప్పేదియో ఎఱుఁగరు. ఎవ్వరిత్రోవ వారిది. అనుకొనువారు లేరు. తప్పు పట్టువారు లేరు. భాషకు గౌరవమర్యాదలు లేవు. ఈవిపత్తు, దైన్యమును దుఃఖమును గలిగించును. శ్రీపంతులుగారు దీని కేమి ప్రతిక్రియ నాలోచింతురు?




పూర్వము నరకుఁడను రాక్షసుఁడు ప్రాగ్జ్యోతిషపురమును బాలించుచుండెను. వాఁడు మిగులఁ బరాక్రమశాలి. తపస్సంపన్నుఁడు. కాని పరమదుష్టుఁడై యింద్రాదులకును నజేయుఁడై యుండెను. వాఁడు విశ్వకర్మ కూఁతును, చక్కని చుక్కయగు గంధర్వ కన్యకలను రాజకన్యకలను బదునాఱువేల మందిని బలాత్కారమునఁ దెచ్చి తన యంతఃపురమున నుంచెను. మఱియు నింద్రమాతయగు నదితి కుండలముల నపహరించెను. ఇంద్రుఁడు వానికి వెఱచి శ్రీకృష్ణునితో మొఱపెట్టుకొనెను. కృష్ణుఁడు సత్యభామతో గరుడు నెక్కి ప్రాగ్జ్యోతిషమునకుఁ బోయి నరకుని యుద్ధమునకుఁ బిలిచెను. వాఁడు నతికుపితుఁడై వారలను మార్కొనెను. అప్పుడు సత్యభామ "వేణిం జొల్లెము వెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ శ్రేణిం దాల్చి ముఖేందు మండల మరీచీ జాలముల్ పర్వఁగాఁ బాణిం బయ్యెదఁ జక్కఁగాఁ దుఱిమి శుంభద్వీర సంరంభయై" మగఁడిచ్చిన విల్లునందుకొని కొంత సేపు నరకునితోఁ బోరాడెను. ఈపట్టును బమ్మెరపోతన్నగారు భాగవతమున రస ముట్టిపడునట్లు వర్ణించినారు. తరువాతఁ గృష్ణుఁడు భార్యను వారించి తాను చక్రమున వానిని జంపెను. అంత భూదేవి నరకుని కుమారుఁడగు భగదత్తుని దీసికొనివచ్చి కృష్ణునికిఁజూపి మన్నింప వేఁడెను. కృష్ణుఁడును వానిని దండ్రి రాజ్యమున కధిపతినిఁ జేసెను.

అనంతరము నరకుని చెఱయందున్న పదునాఱువేలు కన్యామణులను విడిపించి యాదరించెను. ఆ 'భూనాథోత్తముఁ గన్యకల్ వరుస నంభోజాతనేత్రుం డున, న్నెనవ్వేఁ దగఁ జూచె డగ్గఱియె వర్ణించెఁ వివేకించె న,మ్మాసించెం గరుణించెఁ బేరడిగె సన్మార్గంబుతోఁ బెండ్లియా, నేనే చక్రికి దేవి నంచుఁ దమలో నిర్ణీత లైరి.' అట్లు వారి మనస్సులు దనయందుఁ దగిలియుండు టెఱిఁగి కృష్ణుఁడు వారలఁ దన రాణివాసముగా నంగీకరించి ద్వారకకుఁ జేర్చెను.

నరకాసురుఁడు రజస్వలయైన భూదేవియందు యజ్ఞవరాహమగు విష్ణుదేవునకుఁ బుత్రుఁడై ప్రాగ్జ్యోతిషమునకు రాజయ్యెను. వాఁడు కాళికాదేవినిగూర్చి తపమును గావించి పెక్కువరములను బడసి గర్వితుఁడై యెవ్వరిని సరకుగొనక యుండెను. ఒకనాఁడు వసిష్ఠుఁడు నీలకూటమున వెలసియున్న కాళికాదేవిని సందర్శింప విచ్చేసెను. నరకుఁ డాలయద్వారము చెంతనుండి యాతని కడ్డువెట్టెను. వసిష్ఠుఁడందుకు గోపించి "నిన్నుఁగన్నవాఁడే మానవ రూపమునుదాల్చి నిన్నుఁ జంపు"నని శపించిపోయెను. నరకాసురుఁడు కృష్ణునిచే



కృష్ణుడు పదునాఱువేలు రాజపుత్త్రికలను నరకుని చెరనుండి విడిపించుట

జచ్చుటకీశాపమే కారణము. ఈకథ కాళికాపురాణమున విపులముగఁ గలదు.

ఈవిధమున వాసుదేవుడు లోకకంటకుఁడగు నరకుని జంపి లోకములకు మేలొనరించెను. లోకముల పీడతొలఁగెను. ప్రజలందఱు సమంధానందమును జెందిరి. తోడనే మంగళస్నానములు గావించిరి. విందులు భుజించిరి. ఉత్సవము లొనరించిరి. తదాది యాదినము పండుగగాఁ బ్రఖ్యాతమయినది. నరకుఁడు మృతుఁడయినదినము గావున దానికి నరకచతుర్దశియను పేరుగలిగినది.

దీని విషయమున స్మృతు లిట్లు చెప్పుచున్నవి: ఈచతుర్దశిరాత్రి విధివిహిత కాలమున నందఱును మంగళస్నానము జేయునది. "శీతలోష్ఠ సమాయుక్త సుకంటకదళాన్విత, హర పాప మపామార్గ భ్రామ్యమాణః పునఃపునః" అను మంత్రము నుచ్చరించుచు నుత్తరేణు మండను స్నానసమయమున మూఁడుమారులు త్రిప్పునది. పిదప నుదయమునఁ గార్తికస్నానమును యమతర్పణమును జేయునది. ఆనాఁడు ప్రదోషకాలమున గృహములు దేవాలయములు, మఠములు, వీథులు, ఉద్యానములు, గుఱ్ఱపుశాలలు, ఏనుగుసాలలు, ఆవుల కొట్టములు మొదలగు చోటులను మిగుల రమణీయముగా దీపములతో నలంకరించునది. ఇట్లు చతుర్దశి మొదలు మూఁడు దినములు చేయునది. సూర్యుఁడు తులారాశియందుండఁ జతుర్దశ్యమావాస్యలయందుఁ బ్రదోషకాలమునఁ బితృదేవతలకుఁ ద్రోవచూపుటకయి కొఱవులను ద్రిప్పునది. అప్పుడు "అగ్నిదగ్ధాశ్చ యే జీవా యేప్యదగ్ధాః కులే మమ; ఉజ్జ్వలజ్యోతిషాదగ్ధా స్తేయాంతు పరమాంగతిమ్, యమలోకం పరిత్యజ్య ఆగతా యే మహాలయే, ఉజ్జ్వలజ్యోతిషా వర్త్మ ప్రపశ్యంతు వ్రజంతు తే" అను శ్లోకముల నుచ్చరించునది. నాగరికత బలసి యిపుడా కొఱవులుపోయి విదేశ బాణసంచు వెలసినది. మఱియు నాదిన ముదయమున దేవపూజచేసి, మధ్యాహ్నము పితృపూజచేసి ప్రదోషకాలమున దీపదానము, ఉల్కాదర్శనము, లక్ష్మీపూజచేసి తరువాత భుజించునది. ఇట్లు చేయు టధికఫలప్రదము. అర్ధరాత్రానంతరమున నిల్లాండ్రు లక్ష్మినిస్సరణము చేయునది—ఇండ్లు వాకిండ్లు తుడవవలెననుట.

ఈపండువును ప్రతి సంవత్సరము మన మాశ్వయుజ కృష్ణచతుర్దశినాఁ డాచరించుచున్నాము. దీనిని భారతీయులు ముఖ్యములగు పండుగులలో నొకటిగాఁ బరిగణింతురు. ద్రావిడాంధ్ర కర్ణాటక దేశములందలి చతుర్వర్ణముల వారును దీని నాచరించుచున్నారు. ఈచతుర్దశి నాఁటిరాత్రి వేకువజామునఁ జంద్రోదయానంతరమున, సంపన్నులు-దరిద్రులు, పిల్లలు-పెద్దలు ఆఁడువారు- మగవారు, అందఱును నభ్యంగస్నానముచేయుదురు. తరువాతఁ బిల్లలందఱు టపాకాయలు, తోటాలు, పూలవత్తులు, బిరుసులు, చిచ్చులు మొదలగు బాణసంచును గాల్చుచు వినోదింతురు. అప్పటి వారిసంరంభమును, ఆనందమునుజూడఁదగినది. పిల్లల యానందముకొఱకు ధనవంతులు బాణసంచును

గొనుటకై యపరిమితముగ ధనమును వెచ్చింతురు. ఎంత దరిద్రుఁడయినను గనీస మొకటిరెండురూపాయలయిన నిందుకు వ్యయము పెట్టక తీఱదు. విదేశపు బాణసంచు లభింపనిచో [illegible] దామేకొన్ని యితర విధములగు బాణసంచును జేసికొని వానితో బాలురానందింతురు. ద్రావిడ దేశమున మంగళస్నానానంతరమున నూతన వస్త్రములను, ఆభరణములను ధరింతురు. ఫలాహారములను జేయుదురు. అల్లుండ్రను బిలుచుకొనివచ్చి అపరిమితముగ ధనమును వ్యయపఱిచి వస్త్రములతోను, భూషణములతోను, సమ్మానింతురు. ఆంధ్ర దేశమున నీయాచారము సంక్రాంతిపండుగపుడు పాటింపఁబడును. ఈపండుగనాఁ డాంధ్ర దేశమువా రభ్యంజనము చేసి మడుఁగులుగట్టి సమీపమునఁ గల దేవాలయములకుఁ బోయి దైవప్రార్థనము చేయుదురు. మధ్యాహ్నకాలమున నెల్ల దేశములవారును చుట్టములను, హితులనుగూడి విందు భుజింతురు. రాత్రి గృహిణులు గృహములయందంతట దీపములను వరుసలుదీర్చి నిల్పి యలంకరింతురు. కావుననే యీపండుగకు దీపావళి యను పేరయ్యెను.

ఘూర్జరులు, మార్వాడీలు, మొదలగు నుత్తర హిందూదేశవాసుల కిది ఉగాది పండుగ. వారును ఈదినము మనవలెనే పండు[గ] నాచరింతురు. తమగృహములను వేలకొలఁది దీపములతో ననేకరీతుల నలంకరింతు[రు]. బా[ణ]సంచుకై వందలకొలఁది [illegible] వెచ్చింతురు. వర్తకులు తమవా[illegible] లెక్కలను సరికట్టి క్రొత్త పుస్తకము[లలో] నెక్కించి, సర్వాభరణ భూషితులై సుంద[ర]ముగ నలంకరింపఁబడిన తమ వ్యాపార గృహ[ము]ములయం దతివైభవముతో ధనపూజగావిం[చు]తురు. అప్పులకాపులందఱు నాయుత్సవకాలమునఁ గొంచెమైనను సొమ్మునుదెచ్చి యిచ్చి వారలచే నుచితరీతిని సన్మానమును బడయుచుందురు. ఈదినము బొంబాయి, బంగాళము మొదలగు నుత్తర హిందూదేశములయందు సంపన్నులయిండ్లు కోట్లకొలఁది దీపములతో ప్రకాశించుచు నేత్రోత్సవముగ నుండును. ఈపండుగ వైభవమంతయు నాదేశము[లయం]దే చూడదగును.

కారణపరామర్శ లేని యిట్టి పండుగలు కొన్నియేని జరుగుచుండుట భారతవర్షమున మరల నెన్నఁడేని ప్రాచీన సంప్రదాయములు పూర్తిగాఁ బ్రతిష్ఠాపితములగుటకుఁ గారణము గావచ్చును.

గ. సు

